# కామ్రేడ్ చలసాని ప్రసాద్‌కు అరుణారుణ జోహార్లు



# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక 316

సంపుటి: 38 సంచిక: 9 జూలై, 2015 పేజీలు: 52 వెల: రు. 15

## విరసం 45వ ఆవిర్భావదినం సందర్భంగా
## హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జూలై 12న జరిగిన సభ దృశ్యాలు














## అమరుల బంధుమిత్రుల సంఘం 3వ రాష్ట్ర మహాసభల సందర్భంగా
## జూలై 17న హైదరాబాద్‌లోని ఆల్వాల్ స్థూపం వద్ద, జూలై 18న సుందరయ్య విజ్ఞానకేంద్రం వద్ద జరిగిన సభల దృశ్యాలు









KLVA101M180

3








సంపాదకుడు
**చలసాని ప్రసాద్**
వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.
*** కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail.com** కూ
పంపవచ్చు
సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

**చందాలు పంపాల్సిన చిరునామ**
**మేనేజర్**
**వలేటి అరవింద్ కుమార్**
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.
**సెల్ : 8142200711**
**(ఫోన్ చేయాల్సిన సమయం**
**ఉ.10 గంటల నుండి మ. 1 గంట వరకు)**

**విరసం కార్యదర్శి చిరునామా**
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
**డి.టి.పి. అండ్ లే అవుట్**
**ఆర్. భాగ్యలక్ష్మి**
**కవర్ ఫోటోలు : క్రాంతి, కె.బాల్‌రెడ్డి, విరసం మిత్రులు**
**కవర్ డిజైన్ : ఆర్. భాగ్యలక్ష్మి**

Like Page://arunatara viplava rachayitala sangham

Virasam website : *www.virasam.in*

**ఈ సంచిక వెల : రు. 15/-**

**సంపాదక లేఖ...**

సంపుటి : 38 ◆ సంచిక : 9 ◆ జూలై, 2015

జులై అంటే గుర్తుకు వచ్చేది కారంచేడు మారణకాండ. ఒక్క కారంచేడే కాదు, అంతక ముందు, ఆ తర్వాత దళితులపై జరిగిన దారుణ హత్యాచారాలు, అత్యాచారాలు గుర్తుకు వస్తాయి. ఈ ఏడాదికి కారంచేడు ఘటన జరిగి ముప్పై ఏళ్లు. అత్యంత విషాదకర అనుభవానికే కాదు, అతి గొప్ప ఆత్మగౌరవ చైతన్యవికాసానికి కూడా ముప్పై ఏళ్లు. తరతరాల దళితుల ఆత్మగౌరవ ప్రకటన ఆధునిక కాలంలో సరికొత్త అర్థాన్ని సంతరించుకుంది. అందునా అధికార మార్పిడీ తర్వాత, నక్సల్బరీ తర్వాత, కారంచేడు తర్వాత దళితుల ఆత్మగౌరవ ఉద్యమం ఈ వ్యవస్థను ఎక్కడ గురి చూడాలో అక్కడే గురి చూసింది. దళితుల సమస్యలో భూమికి ఉన్న ప్రాధాన్యతను, మొత్తంగానే గ్రామీణ సమాజంలో భూమిపై అధికారాన్ని ఆత్మగౌరవంతోపాటు కారంచేడు చర్చనీయాంశం చేసింది. సామాజిక ఆత్మగౌరవానికి, భూమి సమస్యకు ఉన్న సంబంధం లక్షింపేట దాకా వ్యక్తమవుతూనే ఉన్నది. చరిత్రలోని సాంఘిక ఆలోచనాపరులెందరినో కారంచేడు చైతన్యం పరిచయం చేసింది. వాళ్ల గురించిన అధ్యయనంపట్ల అభినివేశం పెంచింది. భారతదేశంలో విప్లవ పరివర్తనకు కులం తీవ్రమైన అవరోధంగా ఉన్నదని, దాని నిర్మూలనకు విప్లవకర మార్గమే శాస్త్రీయమని నిరూపించింది.

కారంచేడు తదనంతర పరిణామాల్లో విప్లవశక్తులకు కుల సమస్యపట్ల గతానికంటే మరింత స్పష్టత వచ్చింది. బ్రాహ్మణీయ భావజాలానికి, ఆధిపత్య సంస్కృతికి వ్యతిరేకంగా లోతైన అవగాహన పెరిగింది. దళితుల ఆత్మగౌరవ ఉద్యమం విముక్తి ఉద్యమంగా మారవలసిన అవసరాన్ని ఆచరణలో కూడా నొక్కి చెప్పింది.

ఇదే క్రమంలో దళిత ఉద్యమంలోని కొన్ని శక్తులు దళిత సమస్యకు పరిష్కారంగా బూర్జువా మార్గాన్ని బలంగా ముందుకు తీసుకొని వచ్చాయి. చివరికి దళితుల హక్కుల కోసం ఎన్జీవోలు కూడా రంగం మీదికి వచ్చాయి. పార్లమెంటరీ మార్గంలో కుల సమస్య పరిష్కారానికి ఎన్నెన్నో ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొత్త సమీకరణలు తయారవుతున్నాయి. నిస్సందేహంగా పార్లమెంటరీ మార్గంలో, వ్యవస్థ పరిధిలో కూడా దళిత బహుజనుల న్యాయమైన డిమాండ్ల కోసం పోరాడాల్సిందే. వాటిని సాధించుకోవడం పీడిత కులాల హక్కు. అయితే కుల పీడనను పార్లమెంటరీ పంథా రద్దు చేయజాలదు. కారంచేడు తర్వాత అనేక పాయలుగా సాగుతున్న దళిత ఉద్యమంలో కొన్ని పాయలు పూర్తిగా బూర్జువా మార్గంపడితే, ఇంకొన్ని శక్తులు దళితవాదాన్ని మార్క్సిజంతో ముడివేసే ప్రయత్నంలో ఉన్నాయి. ఇలాంటివెన్ని జరిగినా... వ్యవస్థను మౌలికంగా మార్చే ఉద్యమాలా? వ్యవస్థలో భాగంగా జరుగుతూ చివరికి వ్యవస్థలో కలిసిపోయే ఉద్యమాలా? అనేదే అసలు ప్రశ్న.

కారంచేడు తదనంతరం అంటరాని కులాల మధ్య ఉన్న అంతరాలపై మొదలైన ప్రజాస్వామిక చర్చ, ఆందోళన సామాజిక ఉద్యమాలను విస్తరింపజేశాయి. అదే సమయంలో సంక్లిష్టం చేశాయి. అత్యంత సంక్లిష్టమైన మన సామాజిక వాస్తవికతే దీనికి మూలం. దీనిని అర్థం చేసుకోడానికి, మార్చడానికి శాస్త్రీయమైన దృక్పథం తప్పనిసరి. నిజానికి కారంచేడు ఘటన తర్వాత ఈ ముప్పై ఏళ్లలో నిత్యం దళితులపై జరుగుతున్న దాడుల స్వభావంలో కూడా మార్పు వచ్చింది. రాజ్యం, అగ్రకులశక్తుల పాత్రలో కూడా మార్పు వచ్చింది. అట్లని దాడుల తీవ్రతలో తేడా ఏమీ రాలేదు. మరిన్ని కొత్త రూపాల్లో దళితులపట్ల వివక్ష, దాడులు పెరిగిపోతున్నాయి. కొత్త జీవనరంగాల్లో సహితం కులం స్పష్టంగా పని చేస్తూనే ఉంది.

కారంచేడు ఆత్మగౌరవ పతాకాన్ని ఎత్తిపడుతూ ఈ సమస్యలన్నిటికీ పరిష్కారం వెతకాల్సి ఉంది. ముప్పై ఏళ్ల కారంచేడు సందర్భం మన సామాజిక చింతనా స్థాయిని మెరుగు పరుచుకోడానికి అసలైన సందర్భం కావాలి. వ్యవస్థ రాజకీయార్థిక పరిణామాలను, ముఖ్యంగా నానాటికీ పెరిగిపోతున్న హిందుత్వ, బ్రాహ్మణీయ భావజాలాన్ని పరిగణలోకి తీసుకొని కుల నిర్మూలనకు కృషి చేయడమే కారంచేడు మృతులకు నివాళి అవుతుంది.



సంచిక - 316



**అరుణతార చందాదారులకు విజ్ఞప్తి !**
ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

విరసం కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికలను, విరసం ప్రచురణలను **www.virasam.in** వెబ్‌సైట్‌లో చూడవచ్చు. సాఫ్ట్‌కాపీలు డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.
అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను **వలేటి అరవింద్ కుమార్, హైదరాబాద్** పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 15; సంవత్సర చందా - రు. 180;
రెండు సంవత్సరాల చందా - రు. 350; మూడు సంవత్సరాల చందా - రు. 500;
ఐదు సంవత్సరాల చందా - రు. 800; దశాబ్ది చందా - రు. 1600/-

# విప్లవ మానవుడు చలసాని ప్రసాద్

- పి. వరలక్ష్మి

చలసాని అంటే సంస్కృతి. సిపి అంటే విలువలు. ఆయన మూర్తిమత్వాన్ని నిర్మించింది ఇవే. కమ్యూనిస్టు పార్టీ ఒడిలో పుట్టిన చలసాని ప్రసాద్ మార్క్సిజాన్ని సంస్కృతిగా, విలువలుగా తన సకల మానవ స్పందనల్లో భాగం చేసుకున్నాడు. రక్త చలనంలోని జీవధాతువుగా మార్చుకున్నాడు. స్నేహం, ప్రేమ, బాధ్యత, సేవ, నమ్మకం, వినయం... అన్నిటినీ ఆయన విప్లవ రాజకీయాల సారంగా సొంతం చేసుకున్నాడు. వాటి పునాది మీద తన సుదీర్ఘ రాజకీయ, సామాజిక, స్నేహ ప్రపంచాన్ని నిర్మించుకున్నాడు. మనుషులను ఆయన అంతలా ప్రేమించేందుకు వర్గపోరాటంపట్ల ఉన్న అచంచల విశ్వాసమే కారణం. ఈ మాట ఎవరైనా ఒప్పుకోరేమోగాని.. అదే ఆయన వ్యక్తిత్వసారం. లేకపోతే అనితర సాధ్యమైన విప్లవ నిర్మాణ సంబంధమైన పనులు ఆయన చేయగలిగేవాడు కాదు. ఈ పనులన్నిటిలోనూ మనుషులతో అదే స్నేహం, అదే ప్రేమ. వాటిని కూడా తాను ఎంచుకున్న రాజకీయ నిర్మాణ కర్తవ్యాల్లో అత్యంత మానవీయంగా, చైతన్యయుతంగా సంలీనం చేయగలిగాడు.

ఈ విలువల పునాది లేకుంటే ఎనభై మూడేళ్ల యువకుడు నలభై అయిదేళ్ల విరసం ఆవిర్భావ సభ కోసం విశాఖ రోడ్లపై తిరుగుతూ కరపత్రాలు పంచడం సాధ్యమయ్యేదా? తనకున్న విస్తృత మానవ సంబంధాలను విప్లవోద్యమం కోసం, విరసం కోసం మాత్రమే వినియోగించి ఒక అరుదైన నమూనాగా నిలవడం అయ్యేదేనా? చలసాని ప్రసాద్ డెబ్బై ఏళ్ల సామాజిక ఆచరణగల అలుపెరగని సాహిత్యకారుడు, మేధావి, నాయకుడు, ఉద్యమ కార్యకర్త, నిత్యచైతన్య శీలి. ఆ రోజు సాయంకాలం విరసం సభలో దండకారణ్య విప్లవ కవిత్వాన్ని ఆవిష్కరించ కుండానే శాశ్వత విశ్రాంతి తీసుకుని వెళ్లిపోయాడు. తెలుగులో ప్రతి సాహితీ బృందం, ప్రతి ఉద్యమ కార్యకర్తా ప్రేమగా చలసానీ అనో, సీపీ అనో పిలిచే కామ్రేడ్ చలసాని ప్రసాద్ జులై 25 ఉదయం గుండెపోటుతో మరణించారు.

విప్లవ రచయితల సంఘం ఆవిర్భావానికి వెనుక ఇప్పటికీ చరిత్రబద్ధంకాని చరిత్రలోని కార్యకర్తృత్వమంతా చలసానిదే. అట్లని అదంతా ఆయన ఒక్కడే చేశాడని కాదు. ఆనాటి చారిత్రక సంఘర్షణ ఆయనను ప్రేరేపించింది. అందులోని పురోగామి శక్తులను గుర్తించడంలోనే ఆయన మేధ ఉన్నది. ముందు చూపు ఉన్నది. నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల్లోని విప్లవపంథాను ఆయన చప్పున పసిగట్టాడు. ఇక అప్పటి నుంచి నక్సల్బరీ పక్షాన రచయితలను నిలబెట్టడానికి శ్రీశ్రీ కేంద్రంగా ఆయన చేసిన కృషి అసాధారణమైనది. అందులో ఆయన ప్రదర్శించిన రాజకీయ, నిర్మాణ దక్షత అపురూపమైనది. సాహిత్య ప్రపంచంలో తనకు ఉన్న స్నేహాలు కూడా దీనికి దోహదపడ్డాయి.

అట్లా 1955 మధ్యంతర ఎన్నికల నుంచి శ్రీశ్రీ వెన్నంటి ఉన్న చలసాని ప్రసాద్ చరిత్ర అవసరాన్ని గుర్తించి తన వెనుక శ్రీశ్రీని విప్లవోద్యమం పక్షానికి తీసుకొనిపోయాడు. శ్రీశ్రీని అపహరించుకపోయారని కొందరు రచయితలంటే దానికి శ్రీశ్రీ "ఓ ఉద్యమ కెరటమే నన్ను ఎత్తుకెళ్లింద"న్నాడు. అలాంటి విప్లవ సంసిద్ధత ఉన్న శ్రీశ్రీ, చలసాని లేకుండా, వీళ్లతో గొంతు కలిపిన కొకు, కెవిఆర్, రావిశాస్త్రి లేకుండా విరసం ఆవిర్భావాన్ని ఊహించలేం. 1960లలో వరంగల్ జీవితంలో కొండపల్లి సీతారామయ్య, కెజి సత్యమూర్తిల స్నేహం, విశాఖ జీవితంలో శ్రీకాకుళ విప్లవోద్యమ అనుబంధం వల్ల చలసాని విరసం ఆవిర్భావానికి పూర్వరంగాన్ని నడిపించాడు. ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ దగ్గరి నుంచి సీపీఐ ఎంఎల్, సివోసి, పీపుల్స్‌వార్, మావోయిస్టు పార్టీ ఏర్పాటు వరకు ప్రతి ముఖ్య ఘట్టానికి ఆయన ప్రత్యక్ష సాక్షి, వాటన్నిటిలో ఆయన ప్రమేయం కూడా ఉన్నది.

విప్లవ రచయితల సంఘం ఆవిర్భావంలో చిరస్మరణీయమైన పాత్ర పోషించిన చలసాని ఈ 45ఏళ్ళలో కార్యవర్గ సభ్యుడిగా, కార్యదర్శిగా, అధ్యక్షుడిగా అన్నిటికన్నా కార్యకర్తగా చివరి శ్వాస దాకా విరసమే జీవితంగా పనిచేశారు. తెలుగు సమాజంలో ఆయన భాగస్వామ్యం లేని ప్రజా ఉద్యమం లేదు. అన్ని విప్లవ ప్రజా సంఘాలకు ఆయన వెన్నుదన్నుగా నిలబడ్డారు.

కృష్ణా జిల్లాలో కమ్యూనిస్టు కుటుంబంలో పుట్టిన చలసాని ప్రసాద్ అయిదో ఏటనే రాజకీయ ప్రచార ఊరేగింపులో పాల్గొన్న జ్ఞాపకం గురించి చెప్పేవాడు. కమ్యూనిస్టు పార్టీ బాలల సంఘంలో సభ్యుడైనప్పటి నుండి ఆయన నిర్మాణాత్మక రాజకీయ ఆచరణ తుదకంటా కొనసాగింది. జమిందారీ వ్యతిరేక పోరాటంలో, తెలంగాణ సాయుధ పోరాటంలో భాగమైన కుటుంబ వాతావరణం నుండి అత్యంత సహజంగా

ఆయన కమ్యూనిస్టుగా రూపొందారు. తెలంగాణ రైతాంగ పోరాటానికి ముగ్గురు అమరవీరులనిచ్చిన ఆ కుటుంబం నుండి విప్లవాల, త్యాగాల విలువలు ఆయన వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేశాయి. ఇప్పటికీ ఉత్తరాంధ్ర నుంచి ఒడిషా దాకా ఎదురుకాల్పుల్లో విప్లవకారులు, ప్రజలు ఎక్కడ అమరులైనా అక్కడ ఆయనుంటాడు. విప్లవోద్యమానికి, విరసానికి ఒక మేధావిగా, నాయకుడిగా ఎంత సేవ చేశారో.. కార్యకర్తగా అంతకంటే ఎక్కువ సేవ చేశారు. ఈ రెంటిలోనూ ఆయన రచయితగా అత్యంత అరుదైన ఉదాహరణ. శ్రీశ్రీలాంటి వారి కవిత్వమంటే పారవశ్యమేకాదు, ఇప్పుడిప్పుడే కలంపట్టిన రచయితలో ఒక చిన్న మెరుపు కనిపించినా ఆయన అంతే ఆనందిస్తాడు. సాహిత్యకత పరిపూర్ణంగా తెలిసిన కమ్యూనిస్టు ఆయన. దాన్ని ఆయన వర్గపోరాట తెరచాప అంచుల్లోని కదలికతో అంచనా వేయగలడు. తెలంగాణ సాయుధ పోరాటం నుండి దండకారణ్య జనతన సర్కార్ దాకా రూపుదిద్దుకున్న ఉన్నత మానవతా విలువలను వ్యక్తిత్వంలో ఇమిడ్చుకున్న చలసాని సమాజ హృదయమైన సాహిత్యాన్నీ అంతగానే జీవితంలో భాగం చేసుకున్నాడు. ఈ రెండూ అసాధారణంగా కలగలిసిన విప్లవ సాంస్కృతిక మూర్తిమత్వం చలసాని ప్రసాద్. దీంతోనే ఇల్లంగా గ్రంథాలయమై, తానే ఒక నడిచే గ్రంథాలయంగా మారాడు. ప్రాచీన సాహిత్యం నుండి అభ్యుదయ, విప్లవ సాహిత్యం వరకు, స్త్రీవాద, దళిత, ముస్లిం మైనారిటీ, తెలంగాణ కవిత్వం దాకా అయన ఎంతో అలవోకగానో స్పష్టమైన దృక్పథంతో విరసం వర్క్‌షాపుల్లో విశ్లేషించి చెప్పేవాడు. అలాగే ప్రపంచ సాహిత్యంతో ఆయన ఆయన మనసంతా నిండి ఉండేంది.

ఆయన అత్యధిక రచనలు శ్రీశ్రీపైనే చేశారు. సొంతంగా రచనలు చేయడం కన్నా తన సాహిత్య ప్రతిభను, పేరుప్రతిష్ఠలను త్యాగం చేసి శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి రచనలు వెలువరించడంలో శ్రమనంతా వెచ్చించారు. ఆయన రచనల్ని సేకరించి అచ్చువేయాలనే విరసం నిర్ణయాన్ని వినయంతోనూ, మోహమాటంతోనూ చాలా కాలం వరకు కాదంటూనే వచ్చారు. ఆయన కవిత్వం, సాహిత్యవిమర్శ, సామాజిక రాజకీయ వ్యాసాలు, ఇంటర్వ్యూలు రెండు సంపుటాలుగా విరసం తీసుకొచ్చింది. ఇంకా సంకలనం చేయవలసినవెన్నో ఉన్నాయి. నిజానికి ఆయన సాహిత్య కృషి ఆయన రచనల కన్నా ఎన్నోరెట్లు ఎక్కువ ఉంటుంది. ఆయన రచనా వ్యక్తిత్వం అర్థం కావాలంటే సకల సంపదలకే కాదు, సమస్త కళలూ, సంస్కృతీ అన్నిటికీ మూలం ప్రజాశక్తే అనే నమ్మకం ఉండాలి. వ్యక్తి సృజనలో సామూహిక జ్ఞానాన్ని, జ్ఞానంలో సామాజికతత్వాన్ని చూడగల మార్క్సిస్టు చింతనను అర్థం చేసుకోవాలి. దానిని జీవితంలో భాగం చేసుకున్న కమ్యూనిస్టు రాజకీయాలకు అన్వయించాలి.

ఒంటిచేత్తో వేలాది పుస్తకాలను సేకరించి తన ఇంటిని గ్రంథాలయం చేయడం, కలలోనూ, మెలకువలోనూ, పుస్తకాలను ధ్యానించడం కేవలం సాహిత్యాభిమానం కాదు. ఆ గ్రంథాలయంలో భవిష్యత్ తరాలకు తన కలను దాచి ఉంచాడు. తన ఇంటిని ఆయన ఐదు దశాబ్దాలుగా రాజకీయ కేంద్రంగా నిర్వహిస్తున్నాడు. ప్రేమాస్పదంగా చూసుకొనే గ్రంథాలయాన్ని కూడా ఆయన సొంత ఆస్తిగా భావించలేదు. తన తదనంతరం సంస్థకు చెందాలని కోరుకున్నాడు. ఎవరైనా కుటుంబానికి ఆస్తులు పంచి ఇచ్చినట్లు ఆయన సంస్థ కోసం, సమాజం కోసం, భవిష్యత్ ఉద్యమావసరాల కోసం నిరంతరం ఆలోచించేవాడు. ఇలాంటి విషయాల్లో ఆయన చూపిన బోల్షివిక్ స్పిరిట్‌ను వర్తమాన సమాజం భరించడం కూడా కష్టమే.

అమరుడు గంటి ప్రసాదం చెప్పినట్లు నాది అన్న భావనను, గుర్తింపును రద్దుచేసుకోవడం ప్రాణత్యాగం కన్నా కష్టసాధ్యం. చలసాని ప్రసాద్‌లాంటి వారికే అది సాధ్యం. అన్నిటినీ నేను కేంద్రంగా ఆలోచించే చోట ఏ రకంగానూ తన గుర్తింపు, సౌకర్యం, అవసరం పట్టించుకోకుండా బతికిన చలసాని మృతజీవుడు. ఆయన పంచిన ఎల్లలెరుగని స్నేహశీలత విప్లవ మానవులకే సాధ్యమయ్యే జీవనతత్వం. రాజకీయ భిన్నాభిప్రాయాలు వేరు, వ్యక్తుల మధ్య మానవ సంబంధాలు వేరు అని ఆయన నమ్మేవాడు. అట్లని రాజకీయాలే ఆయన వ్యక్తిత్వంలో కడ దాకా వెలిగిన కాంతి బావుటా. అందుకే ఆయన కాలవసినవాడు. మనిషిని ప్రేమించడం అయనలోని తిరుగలేని బలం. ఎవరికి ఏ అవసరమొచ్చినా ఆయన ఒక ఆలంబన. రాజ్యహింస బాధితులకు, జైళ్ల పాలయిన ఉద్యమ కార్యకర్తలకు ఏ ప్రతికూల పరిస్థితిలోనైనా తాను ఉన్నానన్న భరోసా, ధైర్యాన్ని ఇచ్చాడు ప్రసాద్. ముఖమంతా నవ్వుయి విచ్చుకుని ఆప్యాయంగా మనిషిని కావలించుకోవడంతో ఆయన పలకరింపు మొదలయ్యేది. ఇక అంతే అందులో అమమరికలు లేని స్నేహం, గొప్ప నమ్మకం ఉండేవి.

కామ్రేడ్ చలసాని ప్రసాద్ ఆచరించిన మానవతా విలువలు మావోయిస్టు రాజకీయాలు, విప్లవ సాంస్కృతిక వ్యక్తిత్వం వల్ల మాత్రమే రూపుదిద్దుకున్నాయి. తాళాలు లేని ఇళ్లు, పరీక్షలు లేని చదువు, పోలీసులు లేని రాజ్యం కోసం ఆయన కలలు కన్నాడు. ఆయన కలల్ని నిజం చేసే రాజకీయ, సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలను ముందుకు తీసుకుపోవడమే ఆయనకు మనమిచ్చే నివాళి.



(అరుణతార సంపాదకుడు కామ్రేడ్ చలసాని ప్రసాద్ విరసం పతాకగీతాన్ని 45వ విరసం ఆవిర్భావ దినం సందర్భంగా ఈసారి జూలై సంచికలో ప్రచురించమని సూచించారు. - సం.)

# విరసం పతాకగీతం

ఎత్తినాం విరసం జెండా
అలలలలుగా వరదలొత్తు
పోరు పోరు జెండా
ఎత్తినాం విరసం జెండా
సుబ్బారావు పాణిగ్రాహి
సంధించిన కళలతోవ...
మా ఎన్.ఎస్. ప్రకాశరావ్
మండిరచిన కథనంలో...
పరిటాలా రాములన్న
ప్రతిఘటనా పాదంలో...
జ్ఞానేశ్వర్ జీవించిన
జనపదాల జాడల్లో
కొ.కు. జగత్ పరిశీలన
కాగడాల కదలికలో...
మా చెర ఏతం బట్టిన
మంది పాట ఉరవడిలో
మా శ్రీశ్రీ నినదించిన
విప్లవాల గానంలో
పదపదమన కదనభేరి మోగిస్తాం
గళగళమున క్రాంతి ఝంఝ
ఝళిపిస్తాం
॥ఎత్తినాం॥

వాడివాడిగా వీచిన
మా సలంద్ర వేడిలో
తూర్పు చలనమై రగిలిన
మా తిరుపాల్ బాటలో
అణచివేత కెదురీదిన
అబ్రహాం అలజడిలో
ప్రతీకార కెరటంలా
పొంగే ఈశ్వరి స్మృతిలో
చావునైన జ్వలియించిన
మా సముద్రు హోరులో
నూతన్ సహదేవరెడ్డి
ఎం.ఎస్.ఆర్. దీక్షలో
కె.వి.ఆర్ అందించిన
నాయకత్వ స్ఫూర్తితో
పదపదమున కదనభేరి
మోగిస్తాం
గళగళమున క్రాంతి ఝంఝ
ఝళిపిస్తాం ॥ఎత్తినాం॥
జనం కాళ్లు చుట్టేసిన
సంస్కృతి సంకెలలు తెంచి
చీకటి బతుకుల చేతికి
సూర్యుడ్నే అందించి...
ప్రత్యూషం రెక్కలిప్పి
దిక్కుల నెగరేయుదాక
యువత జూలు విదిలించే
గర్జన హోరెత్తుదాక
పదపదమున కదనభేరి మోగిస్తాం
గళగళమున క్రాంతి ఝంఝ
ఝళిపిస్తాం ॥ఎత్తినాం॥

కార్ఖానాల్లో కమిలే
కంకాళాల్ కదిలించీ
కూలిదండు వెంట వెంట
కలం కవాతులు కలిపీ
నేలతల్లి చెరపీడన కూలేదాకా
సమత పంట శ్రమ గూటికి నడిచేదాకా
పదపదమున కదనభేరి మోగిస్తాం
గళగళమున క్రాంతి ఝంఝ
ఝళిపిస్తాం ॥ఎత్తినాం॥

# విప్లవాల వేగుచుక్కా కామ్రేడ్ వివేక్

- తంగెళ్ల సుదర్శనం

విప్లవాల వేగుచుక్కరా వివేక్
వెలుగుతున్న అరుణతారరా రఘన్న ॥వి॥

సూర్యపేటన పుట్టి ఓరుగల్లున పెరిగి
విప్లవాల ఉగ్గు పాలు తాగినాడు
విద్యార్థి సంఘంలో నడక నేర్చినాడు
మార్క్స్ లెనిన్ మావో బాట నడిచినాడు ॥వి॥

చిన్నతనములోనె సిద్ధాంతము చదివి
జ్ఞానాన్ని పెంచిండు ఎంతో ఎదిగినాడు
ప్రజా సంఘాలను పరికించి చూసిండు
పాలబుగ్గల పిల్లోడు ప్రశ్నలయ్యినాడు ॥వి॥

తెలంగాణ ఉద్యమ కిరణమయ్యినాడు
ప్రజాస్వామ్య తెలంగాణ పల్లవయ్యినాడు
ఆదివాసి ప్రజల విల్లంబులయినాడు
పోలవరమునాపె పోరుజెండయ్యిండు ॥వి॥

కార్పోరేటు కాలేజీలు తిరిగిండు
విప్లవ భావాలనిప్పి జెప్పినాడు
దోపిడి రాజ్యాన్ని ఎదిరించమన్నాడు
విద్యార్థి లోకాన్ని తట్టి లేపినాడు ॥వి॥

ఏ ఇంటికొచ్చిన ఆ ఇంటివాళ్ళతో
కన్న కొడుకువోలె కలుపుగోలుగుండి
చైతన్య దీపాలు వెలిగించినాడమ్మ
పోరు బాటలయ్యి సాగిపోయినాడు ॥వి॥

జాబిలంటి నవ్వు వెన్నెల వెలుగు
చంద్రునంటి రూపు చెదరని శిల్పం
నూనూగు మీసాల వయసున్న చిన్నోడు
ఆదివాసులకు అండగ నిలిచిండు ॥వి॥

బూర్జువా చదువులు బువ్వబెట్టమందు
లాయరు చదువొదిలి లాంగ్ మార్చ్ అందు
జనతన సర్కారే జనము బాటన్నాడు
సాయుధపోరులో ఆయుధమెత్తిండు ॥వి॥

# భూమి ఒక మహా కావ్యం

**- ఉదయమిత్ర**

ఎవరన్నారు
ఈ భూమి
ఉత్త జడమైనదనీ,
స్థిరమైనదనీ
దశాబ్దాలుగా దాని పొరల్లో
వేలాది అమరుల కంకాళాలు
అస్థిరంగా కదుల్తూనే ఉన్నాయి
భాస్వరమై మండుతూ
సంకేతాలు పంపుతూనే ఉన్నాయి
వాటికి స్పందించండి
ఎవరన్నారు
ఆ భూమి ఉత్త మట్టేనని
దాని పొరల వెంట
బిడ్డల పోగొట్టుకున్న
తల్లుల దుఃఖం
కాలం వెంట ప్రవహిస్తోనే ఉంది
దాన్ని దోసిలి పట్టండి
ఎవడురా అన్నదీ
ఈ ఎగుడు దిగుడు భూమికి
ఏమర్థమనీ
ఈ మట్టి గుట్టల కింక
మాటలేమిటనీ
శతాబ్దాలుగా స్వేచ్ఛ కోసం
పొందిన గెలుపోటముల
మానవేతిహాసాల్ని రికార్డు జేసిన
ఓ మహాకావ్యమది
దాన్ని చదవండి
(పద్మకుమారి రాసిన 'పాల్గుణ' చదివాక..)

# సక్రమ దారి కోసం...!

**- చలపాక ప్రకాష్**

నేను ఎటు వెళ్తున్నాను!
సినిమా షోకో.. టి.వి. ముందుకో...
పుస్తకానికో... ఉద్యమానికో...
సాహిత్యశాలకో...?

నేను ఎటు వెళ్తున్నాను!
టకటక తొక్కిపడేసే నాటు బూట్లు వైపో...
రెపరెపలాడే ఎర్రెర్రని జెండా వైపో...
పశుపక్షాదులు, క్రూరమృగాలకంటే
రాక్షస క్రీడ సాగించే-
రాజకీయ చదరంగరణ్యానికో...?

నేను ఎటు వెళ్తున్నాను!
అధిక ప్రసంగాల వేదికల వైపో... కొనుక్కునే పురస్కారాల కైపో...
పదవుల పరుపుల వైపో... అధికార దర్పపాన్పులవైపో...

నేను ఎటు వెళ్తున్నాను!
బీళ్ళు బారుతున్న నేల తల్లిని ఓదార్పు కోసమో...
కాలుష్యమై ఇంకిపోతున్న నదీజలాల కన్నీళ్ళు తుడవడం కోసమో...

నేను ఎటు వెళ్తున్నాను!
ఎటు వెళ్ళాలో తెల్సుకొనేందుకు ముందు-
ఓ కవిని కలవాలనుకుంటున్నాను!
ఓ రచయిత హృదయ విశ్లేషణని చదివి-
సక్రమ దారిలో నడకలు సాగించాలనుకుంటూ... వెళ్తున్నాను!!

# అతడి పాట బతికే ఉంది

అతడు లేడు, అతడిపాట బతికే ఉంది!
అతనికంటే అతనిపాట మహా శక్తిసంపన్నమైనది!
వేకువనెవడు ఉరిదీయగలడు?
ఉరికే జలపాతాన్నెవడు చెరబట్టగలడు?
నిప్పులవాన అతనిపాటనెవడు నిషేధించగలడు?

తొలకరిరెక్కల చినుకులపిట్టలు
బీడునేల మీద వాలినపుడు...
చిరుగాలికి పైరు, శిశువులా ఊగాడుతున్నపుడు...
పచ్చని అడవిమీంచి
పక్షిరెక్క శబ్ద తరంగాల్ని సృష్టించినపుడు...
చాళ్లమీద చెమటవిత్తులు వెదజల్లపడ్డపుడు...
గనిలో వనిలో కార్ఖానాలో
స్వేదనదులు గలగలా ప్రవహిస్తున్నపుడు...
అతనిపాట అంతర్లీనంగా వినిపిస్తూనే ఉంటుంది!
పాలతరగల పరుగులా... అతనిపాట
ప్రజలపెదాలమీద పదాల వరదై ప్రవహిస్తూనే ఉంటుంది!

యింకా... అతని పాట ఏంచేస్తుంది?
నిశ్చలమైన నదికి కెరటాలరెక్కలిస్తుంది!
మోళ్లకు, కొత్తఆశల చివుళ్లు తొడుగుతుంది!
కుందేళ్లకు కోరల్నిస్తుంది!
పావురాళ్లకు పదునైన గోళ్లనిస్తుంది!
చీమలకు పడగల్నిస్తుంది! మేకలకు పంజాలిస్తుంది!
సగం చచ్చిన సమాజంమీద జీవజలాలు చల్లి
రక్తంతో రాగాలాపన చేయిస్తుంది!
చేపలకోసం పన్నినట్టు
అడవులమీదా... కొండలమీదా... నదులమీదా...
పన్నిన ఉక్కువలల్ని ఛేదిస్తుంది!

పడమటపాదు మీంచి ఎర్రనిదొండపండు సూరీడై
అతడు రాలిపోవచ్చునేమోగానీ...
రేపటితూరుపు మందారపూలవనాల్లోంచి అతనిపాట
విముక్తిగీతమై పల్లవిస్తుంది!
ఎల్లలెరుగని అతనిపాట గళమెత్తి
అఖండిత మానవునికోసం జగమంతా నినదిస్తుంది!!

# నమ్మకం

**- పచ్చల కిరణ్ కుమార్**

మా కోసమే
నీవు నినాదమైనట్టు

మా కోసమే
నువు పిడికిలెత్తినట్టు

మా కోసమే
నువు నెత్తురు ధారపోస్తానన్నట్టు

మా కోసమే
నీ శ్వాస ధ్యాస అయినట్టు
ఎన్ని రంగులు మారుస్తున్నావు!

నీ వెంట నడిచిన దుఃఖాలు
నిను భుజాల మీద మోసిన వెలివాడలు
నీవొక
విముక్తి మార్గమనుకుని
నిన్ను గుండెలో పదిలపరచుకున్నప్పుడు
నువు నమ్మకాన్ని ఖడ్గం అంచులమీద నిలబెట్టాక
అనివార్యంగానైనా
నీలో పయనం కొనసాగదు

ఎన్ని ప్రళయాల్ని ఎదుర్కొందీ పోరాటం
ఎన్ని మోసాల్ని జయించిందీ పోరాటం
చిక్కులను
ముప్పులను ఛేదించడం
పోరాటానికి కొత్తకాదు

నిర్మాణంలో
నువు వేళ్ళూనుకున్న మహావృక్షమే కావచ్చు
ప్రజల హృదయాల నుండి
నిన్ను బహిష్కరించాక
ఈ నెత్తుటి జెండా కింద
నీకిక చోటు లేదు

# మద్యం శరణం గచ్ఛామి

**- ఖలందర్**

ఊరూరా ఉండాల్సిందీ
స్కూళ్లు కాదు, బార్లు!
డబ్బుంటేనే డెవలప్‌మెంట్ గదయ్యా బాబూ!
చంద్రయ్య బాటిల్ మూత దీశాడు
సారా భేతాళం తెలుగు దేశం చుట్టింది
రాజయ్య మంత్రం దాని బెల్టూడదీసింది

గాంధీయుగం పోయింది
బ్రాందీయుగమే మిగిలింది!
యువత జోగుతుంటేనే గదోయ్
పీఠం చేతి అలా రంగంట మ్రోగేదీ!
చదువెందుకూ? సంస్కారమెందుకూ?
సారా చెంత ఉంటే చాలు!

సీసా పట్నం బాట నడిచిందీ
పల్లెబాట చేరింది!
పాదయాత్రలు ముగిశాయి

పీపాయాత్రలు కదిలాయి
ఇదే ప్రగతి కదోయ్!?

తమ్ముడి నిక్కరు గుండీలూడితే
ఇక పురిగోసలె గతి!
చెల్లిశీలం చెడితే
సారా బజంత్రీలు
అక్క పెళ్ళిపుస్తెలకు
పీపాల వెక్కిళ్లే మంత్రాలు!
మత్తే ముత్తయిదులై
ఆశీర్వదిస్తోంది!
అదే ఇప్పుడు ప్రసాదం!
తలా పిడికెడు పంచుకునేందుకూ...

# జోహార్ కామ్రేడ్ సూర్యం

**- రెంజిం**

ప్రకాశం జిల్లా కొరిసపాడులో పుట్టి
అణగారిన జీవితాల మార్పుకై
విశాఖ ఏజెన్సీకి చేరి
ముంచింగ్ పుట్టులో అడవిలో అమరుడైనావా
అడవిలో ఆదివాసీలకు స్నేహితుడవై
పీడిత ప్రజల విముక్తికి బందూకు పట్టావు
ఇంత హఠాత్తుగా ఇంత నిశ్శబ్దంగా
ఇంత దారుణంగా
ఊహించలేదు కామ్రేడ్
ఇరవై రెండేళ్ల నీ వయసు
పదమూడు నెలల ఉద్యమం మర్చిపోలేనివి
సముద్రమంత నిశ్శబ్దంగా
ఆకాశమంత నిశ్చలత్వాన్ని
పరుచుకొన్న నీ ఎదపై కరుకు బూట్లు
సముద్ర కెరటంలా ఎగిసిపడిన శ్వాసను
ఖాకీల క్రూరత్వం బిగించి వేసింది
మృత్యువులోనూ బిగి పిడికిలి బట్టి
విప్లవాన్ని నినదిస్తూ
బూటకపు ఎదురు కాల్పుల్లో
అమరుడైన కామ్రేడ్ అందుకో నా జోహార్లు

(ప్రకాశం జిల్లా కొరిసపాడు మండల కేంద్రం పడమట పాలెం వీరుకి చెందిన కొప్పర్తి సూర్యం (22) విశాఖ ఏజెన్సీ ముంచింగ్‌పుట్ మండలం గొబ్బిరిపడు అటవీ ప్రాంతంలో 20-6-2015న బూటకపు ఎదురు కాల్పులలో అమరుడైనాడు)

# అతనిలో నేనుంటాను!

**- అరసవిల్లి కృష్ణ**

చతురస్రపు గదిలో
కదిలితే గోడ తగిలే ఖాళీలో
ఏ ఖాళీని పూరించను
ఇంద్ర ధనస్సు ఊడిపడి
దేహ హృదయమ్ముందుపడితే
అనేక వర్ణాల నుండి మనుషులు
చీమల్లా ప్రవహిస్తే
అతనా గదిలో గోడలపై వేస్తున్న చిత్రం
వర్తమానం నుండి జారి
రేపటి మనుషులు కళ్ళతో వెతుక్కునే
జైలు గది కనబడవచ్చు
ఏకాంతపు నీడలో
మిగిలిన వెలుగుజాలును
మునివేళ్ళతోతాకి
సమూహంలోకి విసిరిన దోసిలి
పాదముద్రలలో దిగిన తూటాలు
చెట్ల ఆకుల చివర నుండి చినుకుల్లా రాల్తున్న ఆర్తనాదాలు
అయినా
అగ్గిపుల్లతోమంట రాజేస్తున్న బుడతడు
గోడ ఎలాంటి దానివే-
రాజ్యం చేతిలో పావురంలా నలుగుతున్నావు
గోడ నీకై తెలియదే
రాజ్యయంత్రం నీవెనుక నడుస్తుందని-

చీకటి నుండి వాన కురుస్తున్న దృశ్యం. ఎండ వేడికి చెమటలు పోసిన గది, వేలాది విసనకర్రలు కావాలి. చల్లని కుండల వరస కావాలి. మంచినీటి జలపాతం కావాలి. ఇంటి దగ్గర పాపా ఆడుకుంటున్న వేళ లేలేత శరీరాల ఎన్కౌంటరవుతున్న కాలవంతెనపై గదిలో ఏధ్యాల తిరిగినా గోడ తగులుతుంది మందార పూల వాసన గది నిండా అలుము కుంటే శరీరంపై మొలిచిన గాయం సలుపుతున్నా. కంచంలోఅన్నమ్మెతుకు ఏరుకుంటున్న ఆకలి చూపుల మధ్య దూదిపింజలా తేలియాడుతున్న ధిక్కారం గోడల నీడల మధ్య గట్టిగా అరిచిన అరుపు..

నన్నని కూనిరాగంలా గొంతులో తచ్చాడుతుంది. ఆనందాశ్రువుల్లోనీకై వీచిన సన్నటి చిర్నవ్వు గడిచిన కాలమంతా వేసిన అడుగులు అర్ధరాత్రి రహస్య కామ్రేడ్ జీర గొంతు నిద్ర కలలో కదులుతుంది. జనంలో కలియ తిరిగిన ఆలోచనలు ఖైదు అయినాయి. ఆడి అలిసిన చిన్నారి నాన్న బొమ్మతో నిద్రిస్తూ మెలకువతో వున్న అతనికి తోడుగా చిన్నగా శబ్దం చేస్తున్నపురుగువుంది.

నలుపు-తెలుపుల రహస్యాల మధ్య విశ్వాసాల తేనెతుట్టెను కదిలించ లేరు. అత్యంత ప్రేమతో నిర్మించుకున్న సాలెగూడు నిప్పుకణికపై జ్వలిస్తుంది. జైలు గదిలో చలికి వణుకుతున్న అతనికి ఓ దుప్పటి కావాలి- ఎండకి, వాన, చలికి, జ్వలిస్తున్న వాళ్ళకి అతని నీడ కావాలి-
(సాయిబాబా)



# అల్పికలు గల్పికలు

- బమ్మిడి జగదీశ్వరరావు

## పిడికిట్లో ఇసుక

'అడిగినందుకు... అడ్డగించినందుకు... ఆడదని చూడకుండా ఆఫీసరని చూడకుండా ఎమ్మార్వో మీద దాడి చేస్తారా?...' చిరిగిన చొక్కా అడిగింది.

'చేసింది డ్వాక్రా మహిళలు...' అన్నది పచ్చ చొక్కా

'డ్వాక్రా మహిళలలంటే తెలుగు దేశం పార్టీ కార్యకర్తలే కదా? టీవీల్లో కింద పడేసి కొడుతున్న ఎమ్మెల్యే చింతరునేని ప్రభాకరి చౌదరి చూపిస్తుంటే లేదంటారేంటండీ...' తలపాగ తలపడింది.

'మేం యిసుక మాఫియా చేతిలో చచ్చిపోవాలా?' ఉద్యోగి గొణిగాడు.

'ఇసుక మాఫియా నశించాలి...' జనం చేరారు!

'మా తెలుగు దేశం పార్టీయేనా? మీరు మీ పార్టీ చెయ్యడం లేదా యిసుక మాఫియా? ఎవరు చెయ్యడం లేదు...' పచ్చ చొక్కా తిరిగి అరిచింది.

'మీ ఎమ్మెల్యే ఈ విషయంలోనే కాదు, ఎన్నో విషయాల్లో తల దూరుస్తున్నారు...' తలపాగాని పక్కకు తోసి 'మీవాడి మీద ముప్పైయ్యారు నాన్ బెయిలబుల్ కేసులున్నాయి...' ప్రతిపక్షం దిగింది.

'మావాడి మీద మీద ముప్పైయ్యారుంటే, మీవాడి మీద డబల్... డబ్బై రెండు కేసులున్నాయి...' పాలక పక్షం అంది.

'లిక్కర్ సిండికేటు కేసులు లేవా?'

'మీరు పతితులా? మీరు లిక్కరు సిండికేట్ చేయలేదా? కేసులు లేవా?'

'అమ్మాయిల్ని తరలించింది మీరు...'

'మీరు తరలించలేదా?'

'బ్యాంకులో దొంగ లోనులు తీసుకున్నాడు...'

'మీరు మాత్రం బ్యాంకులోన్లు ఎగ్గొట్ట లేదా?'

తలపాగా 'దరిద్రం నా కొడుకులు' అని దులిపింది. ఎవరూ పట్టించుకోలేదు.

'ఇన్ని కేసులున్నాయి కాబట్టే ప్రభుత్వ విప్ ఇచ్చినట్టున్నారు?'

'మీ మీద మీ వాళ్ళ మీద కేసులు లేవా?'

మధ్యలో పానకంలో పుడకల్లా 'మాకు భద్రత కావాలి' అన్నారు రెవెన్యూ ఉద్యోగులు.

'జపాన్నుండి చంద్రబాబుగారొచ్చారు...' అంటూ బాబు కోర్టుకు బంతి' మీడియా లైవిచ్చేసింది.

'ప్రభుత్వ ఉద్యోగి మీద... మహిళా ఉద్యోగి మీద మీ ఎమ్మెల్యే దాడి...' మీడియాకు ప్రశ్నించే అవకాశం ఇవ్వలేదు.

'జరిగిందేదో జరిగిపోయింది... జరగాల్సిన దాని మీద దృష్టి పెట్టాలి...' ఢిల్లీలో బాబు తీర్పిచ్చేసారు. ఆ మాట ఇసుక మాఫియా కన్నా రాష్ట్ర విభజనకు సరిపోతుందని విలేకర్లు గుసగుసలాడుకున్నారు!

కట్ చేస్తే-

సీన్ హైదరాబాద్ లొకేషన్‌కు మారింది. నిరసన చేస్తున్న ఉద్యోగులతో ముఖ్యమంత్రి భేటి అయ్యారు!

కట్ చేస్తే -

ఎప్పటిలాగే ఐఏఎస్ అధికారితో కమిటీ వేస్తున్నారట!

ఇది ఇసుక సమస్య కాదట! కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాల సరిహద్దు సమస్యట!

విచారణ జరుగుతుందట!

రెవెన్యూ ఉద్యోగులు ఆందోళన విరమించేసారట!

విప్పుగారు నిప్పట!

ఠ!

## ఎండు చేపలు చెప్పిన ఏడో కథ

ఎలకల బోనులో ఈసారి పిల్లి పడింది. అది ఆ ఒక్క పిల్లి తప్పే కాదు... చాలా పిల్లులు చాకచక్యంగా బోనులోకి దూరి ఎండు చేపలు ఎత్తుకుపోవడానికి అలవాటు పడ్డాయి. ఎలకలకు యెరచూపడం పిల్లులకు ప్రతిభతో కూడిన సరదా. పైగా సంఖ్య చూపించి తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకోవచ్చని ధీమా. వ్యూహ ప్రతి వ్యూహాలు యెరిగిన పెద్ద పిల్లే బోనులో పడింది. గజ ఈతగాడు గెడ్డలో పడినట్టు పడింది. ఒడ్డుకు చేరాలని తాపత్రయపడింది. మ్యావ్ మ్యావ్ మంది. చాలక నన్ను ట్రాప్ చేసారంది. ట్యాపింగ్ చేసారంది. నోరు ఎండు చేపల వాసనొస్తున్నా - నన్ను మార్ఫింగ్ చేసారంది.

'ఎలకలకు ఎండు చేపలు ఆశ పెట్టావా లేదా? అది చెప్పు...' అంది మరో జట్టు పిల్లి. నిన్నటి వరకూ అవి ఒకే జట్టు పిల్లులు!

'నువ్వే కాదు, నేనూ పిల్లినే! నాకూ బోనుంది, నాకూ ఎండు చేపలున్నాయి. నీకే కాదు నాకూ బోలెడన్ని ఇల్లున్నాయి...' బోనులో పిల్లి బోనులోనే ఉండి బీరాలు పలికింది. నీకు ఉన్నదేమిటి? నాకు లేనిదేమిటి? ఇంకా చెప్పాలంటే నీకు పదిల్లున్నాయి... నాకు పదమూడు ఇల్లున్నాయి... మూడెక్కువే ఉన్నాయి - పిల్లి పులిలా గర్జించింది. అలా అని అనుకుంది. ఇది మా ఇంటింటి ఆత్మగౌరవానికి సంబంధించినదిగా చెప్పుకుంది. ఔనంటూ ఎలకలు కలుగులు తవ్వుతూ ఆత్మగౌరవం గురించి కోరస్ ఇచ్చాయి.

'నువ్వూ నీ పందికొక్కూ నా చేపముక్కలకి ఆశపడ్డారా లేదా?' అవతల పిల్లి అచ్చం దొరపిల్లిలా దర్జాగా అడిగింది.

ఎవరి పిల్లికి వారి ఎలుకలు వంత పలికాయి! చాలక ఇల్లిల్లూ

సౌఖ్యమన్నాయి. మాకేం సంబంధం అనుకున్నారు ఇళ్లల్లో బతికే జనం!

'దొంగ... దొంగ...' అది దొరపిల్లి. దాని ఎలుకలూ!

'నువ్వసలు చేపముక్కలు ఎందుకు పెట్టావు చెప్పు... అలా పెట్టడం నీ తప్పు... నువ్వు చేసిన నేరం... నేను కుక్కలకి ఫిర్యాదు చేస్తాను...' బోనులో ఉండి - బోనుని కవచంగా ధరించి కుక్కల కేంద్రానికి వెళ్ళి ఫిర్యాదు చేసింది.

'ఇళ్లకి కన్నం వేసి దొరికినంత దొబ్బి తినాలి గాని... యిదేటిది జెస్టా తగవు, నేను పడను... జోక్యం చేసుకోనంది శునకరాజం! దానికి అందరి మద్దతూ కావలి గదా అని పిల్లులూ ఎలకలూ చెవులు కొరుకున్నాయి!

దొంగ పిల్లి దొరపిల్లి కేసులు పెట్టుకున్నాయి. పిల్లులకే కాదు ఎలకలకీ ఏం కాదు - అనుకున్నారు తమ ఇల్లు గుల్లయిపోతోందని మరిచిన ఇల్లలోని జనాలు!

ఎలకలూ పిల్లులూ పందికొక్కులూ కుక్కలూ వేటి పనిలో అవి ఉంటూ మధ్య మధ్యలో 'దొంగ... దొంగ...' అని అరుస్తున్నాయి.!

(పిల్లి మీద, ఎలక మీద, కుక్క మీద, పందికొక్కు మీద రాసినందుకు నిరసన తెలిపి - నిలదీసి మేం అంత తింటామా? దాచుకుంటామా - మమ్మల్ని ఇన్వాల్వ్ చెయ్యొద్దన్న జంతు జాలానికి క్షమాపణలతో-)

## ఓటుకు రేటు

'రేటు పెరిగితే బాగుణ్ను...' అప్పటికే ముప్పయ్యోసారో అన్నాడు మా బావమర్ది.

'యేం పెరిగిన రేట్లు చాలవా?' అన్నాను నేను, అయోమయంగా చూసి.

'ఆలు పెంచడమేటి? మనమే రేటు పెంచేద్దాం...' ఒకరిది కాదు అందరిదీ అదే మాట.

నేను మూగోణ్ణయిపోయాను.

'మన ఓట్లు మీద గెలిచిన ఆల ఓట్లకే అంత రేటుంటే, మన ఓటుకి రేటు వుండొద్దా?' నిలదీసారు. 'బాబు కాదు ఆల బాబురాని తగ్గించేది లేద'న్నారు. 'కాదంటే?' అన్నాను. 'బేరమాడుకుందాం' అన్నారంతా. 'యేం రేవంత్ రెడ్డి బేరమాడలే...' నేరం చేసినట్టు నన్ను నిలదీసారు. 'ప్రాబ్లమ్ అవుతుందేమో?' అన్నాను. 'డోంట్ వర్రీ బ్రదర్... ఐయామ్ విత్ యూ... టేక్కేర్ అబౌట్ యూ...' అంతా ఆంగ్లంలో దంచేసారు!.

అచ్చం చంద్రబాబులా అన్నారు, వాయిస్ని అనుకరిస్తూ!

## హా-హ్హానెస్టీ

'నువ్వో రాష్ట్రానికి ముఖ్యమంత్రివయితే నేనో రాష్ట్రానికి ముఖ్యమంత్రిని. నీకు అధికారం ఉంటే నాకూ అధికారం ఉంది. నీకు ఏసీబీ ఉంటే నాకూ ఏసీబీ ఉంది. నీకు పోలీసులుంటే నాకు పోలీసులున్నారు...' నీకు ఉన్నవన్నీ నాకూ ఉన్నాయని చంద్రబాబు కె.సి.ఆర్.ని బహిరంగంగానే అన్నాడు.

'చంద్రబాబు చాలా కరెక్టుగా చెప్పాడు...' మెచ్చుకున్నాడు మావోడు.

నాకర్థం కాక ఎర్రముఖం వేసుకు చూసాను.

'అన్నిటికీ బాబుని తప్పు పట్టకూడదు... చాలా నిజాయితీగా చెప్పాడు...' అన్నాడు మావోడు మళ్ళీ.

నేను బుర్ర గోక్కున్నాను.

'సీ.ఎం. పదవీ - పవరూ - ఏసీబీ - పోలీసులూ... అన్నీ ఉన్నవన్నీ ఉన్నాయన్నాడా? మరి నీకు ప్రజలున్నారన్నాడేటి? మరి నాకు ప్రజలున్నారన్నాడేటి? అన్లేదు గదా...' మావోడు మురిసిపోయాడు.

## కొత్త పోలీస్టేషన్లు

భారీగా పోలీసు డిపార్ట్మెంట్లో నియామకాలు జరుగనున్నట్టు వార్తలొస్తున్నాయి. అవసరమైతే ఇతర డిపార్ట్మెంటుల్లో పని చేస్తున్న వాళ్ళని - కాస్తంత క్రైమ్ బ్యాక్ గ్రౌండ్ ఉన్న వాళ్ళని - ఏరి కోరి ఏపీ పోలీసు శాఖలో డిపిటేషన్ మీద పని చేయించడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నట్టు సమాచారం. సీనియర్ ఖైదీలను కూడా ఎక్స్ సర్వీసుమెన్ కోటాగా ట్రీట్ చేసి, డిపార్ట్మెంట్లో రిక్రూట్ చేయనున్నదని విశ్వసనీయ వర్గాల భోగట్టా. దాంతో నిరుద్యోగుల్లో ఆశలు చిగురించాయి!?

సెక్షన్ 8 అమలు చేయకుంటే - 'హైదరాబాద్లో మా పోలీస్టేషన్లు మేం పెట్టుకుంటాం' అని ఏపీ మంత్రి వర్గం క్యాబినెట్ మీటింగ్ అనంతరం ప్రెస్మీట్లో చెప్పింది.

హైదరాబాద్లో ఏపీ పోలీస్టేషన్లు పెట్టడం తమ రక్షణ కోసమేనని మంత్రులు పునరుద్ఘాటించడంతో - ఎక్కడెక్కడ పోలీస్టేషన్లు పెట్టాలి అన్న చర్చా మొదలైంది. చంద్రబాబు తన కార్యాలయంతో పాటు, కొత్త ఇంటి దగ్గరొకటి, పాత ఇంటి దగ్గరొకటి పోలీస్టేషన్లు పెట్టాలని అలాగే ఏపీ మంత్రుల ఇళ్ళ దగ్గర, ఆస్తుల దగ్గర, వ్యాపారాల దగ్గర కూడా పోలీస్టేషన్లు పెట్టాలని సిఫారసు చేసారట.

ఏపీ ఇంటలిజెన్స్ శాఖ తాను నిద్రపోతోందన్న అపవాదుని చెరిపేసుకోవడానికి ముందుగానే పోలీస్టేషన్లు ఎక్కడెక్కడ పెట్టాలో సూచించిందట. ఢిల్లీ, చెన్నై, కర్ణాటకల్లోనే కాక చంద్రబాబూ తన మంత్రివర్గం ఎక్కడికి వెళితే అక్కడో పోలీస్టేషన్ పెట్టాలనీ, మంత్రుల వెంట రక్షణగా మొబైల్ పోలీస్టేషన్లు నడపాలని ప్రభుత్వ దృష్టికి తెచ్చిందట?

ఏపీ పోలీస్టేషన్లు హైదరాబాద్లోనే గాక సింగపూర్, మలేషియా, జపాన్, చైనాలలోనూ పెట్టాలని ముఖ్యమంత్రికి సలహా సంఘం సభ్యులు ముందుచూపుతో చెప్పారట!

రాష్ట్ర రాజధాని నిర్మాణాన్ని వాయిదా వేసి, రాష్ట్రేతర పోలీస్టేషన్ల నిర్మాణాలపై ప్రభుత్వం దృష్టి సారించిందట!



# కత్తీ, డాలూ

- షహీదా

సి.ఆర్.పి.ఎఫ్. బలగాలను పి.ఎల్.జి.ఎ. బలగాలు చుట్టుముట్టడం దాదాపుగా పూర్తయ్యింది. పెద్ద సంఖ్యలో ఉన్న బలగాల్లో ఒక భాగాన్ని దాని ప్రధాన బలగాల నుండి ఉపాయం ద్వారా విడగొట్టి చుట్టుముట్టారు గెరిల్లాలు. గతంలోనూ పిఎల్‌జిఎ దాడిని చవి చూసిన సిఆర్‌పిఎఫ్ కమాండెంట్‌కు గెరిల్లాలు ఒకవైపు వెనక్కి తగ్గుతూ రిట్రీట్ అవుతున్నప్పుడే సందేహం కలిగింది, ఇదేదో ఉచ్చు బిగించే ఉపాయం లాగుంది అని. ముందు రోజు నుండే గెరిల్లాలతో దాగుడుమూతలు నడుస్తూ ఉండినాయి. చివరికి ఇక్కడ ఒకరికొకరు ఎదురుపడ్డారు.

"గెరిల్లాల వెంబడి పోవద్దు, వెనక్కి రండి," కమాండెంట్ చెప్తూనే ఉన్నాడు.

"కన్పిస్తున్నారు, వెంటపడతాం, వాళ్ళను ఖతం చేస్తాం," అని విర్రవీగుతూ ఆ భాగం గెరిల్లాల వెంటబడింది. తాము అనుకున్నట్టుగానే శత్రువు ప్రవర్తిస్తుండడంతో గెరిల్లాలు వాళ్లను ప్రధాన బలగాల నుండి విడగొట్టి చుట్టుముట్టేశారు. అప్పటికీ స్పృహలోకి రాని జవాన్లు రంకెలేస్తూనే ఉన్నారు గెరిల్లాలను అంతమొందిస్తామని. కమాండెంట్‌కు తమ జవాన్లు ఏం కాబోతున్నారో సినిమా స్క్రీను మీద కనబడినట్టుగా కనబడసాగింది. అతను వాళ్లను వెనక్కి రమ్మని కమ్యూనికేషన్ సెట్‌లో అరుస్తూనే ఉన్నాడు.

"అన్నం ఒక బుక్క తర్వాత ఒక బుక్క తిన్నట్టు" అని కామ్రేడ్ మావో చెప్పిన సూత్రాన్ని అమలు చేయడానికి పిఎల్‌జిఎ గెరిల్లాలు పూర్తిగా సిద్ధమయ్యారు. వాళ్లు గెరిల్లా బేసు ప్రాంతంలోకి ఆపరేషన్ కోసం వచ్చిన ఈ బలగాలను 24 గంటలకు పైగా వెంటాడుతూ ఇప్పటికి అనువైన బిందువును చేరుకున్నారు. ఇక విడిసేది లేదు... విడిస్తే వాళ్లు సృష్టించే విధ్వంసం ఇప్పటికి ఎన్నిసార్లు చవి చూడలేదు తమ ప్రజలు...

* * *

చలికాలం కావడంతో రాధక్క అప్పటి వరకూ మంట కాడే కూచుని, మెల్లగా లేచి కసువు ఊడ్వడం మొదలెట్టింది. ఆమె వయసు యాభై, అరవై మధ్య ఉంటుంది. ఆమెకు నడుం, మోకాళ్లు విపరీతమైన నెప్పి. చలికాలం కావడంతో అవింకా పట్టుకుపోతాయి. అందుకని ఆలస్యంగానే పనులు మొదలు పెట్టుకుని చేసుకుంటూ ఉంటుంది. కానీ ఆమె చెవులు మాత్రం ఇప్పటికీ చురుగ్గానే ఉన్నాయి. అందుకే అందరికంటే ముందుగా ధనధనా మొదలైన కాల్పుల శబ్దం వినబడింది రాధక్కకే.

వెంటనే పక్కింటి కోసి దగ్గరకు చేతిలో చీపురుతోనే పోయి, "కోసీ, భీమే, ఇన్నరా?" అని అరిచింది.

"ఏంది రాధక్కా?" అంటూ బైటకు వచ్చిన కోసి, రాధక్క సైగతో చెవులు రిక్కించి విన్నది.

"పైరింగే," అన్నది కోసి తలూపుతూ.

ఇద్దరూ కొద్ది క్షణాలు ఆ శబ్దాల్ని విన్నారు. ఒకోసారి భీషణంగా వస్తున్నాయి కాల్పుల శబ్దాలు. తర్వాత ఆగుతున్నాయి.

"మనోల్లే దాడి చేసిన్రంటవా రాధక్క?" బైటికి వచ్చి వారితో పాటే శబ్దాల్ని విన్న భీమే అడిగింది.

"చెప్పలేం. ఏదేమైనా మనోల్లు యుద్ధం చేస్తున్నరు. లడాయి గట్టిగనే నడుస్తున్నది. కోసీ, భీమే, మన అక్కలందర్నీ జమ చేసి మనోల్లకు జావ, నీళ్లు తీసుకుపోవాలె. ఎండెక్కితే చాలా తిప్పలైతరు ఎండలో," అంది రాధక్క చీపురు ఆడ్నే పడేసి పొయ్యి రాజేయడానికి పోతూ.

"ఇంగో," అంటూ కదిలారు కోసి, భీమే. వాళ్లిద్దరూ వదినా మరదళ్లు. అప్పటికి ఊర్లో అందరూ కాల్పుల శబ్దం విన్నారు. క్రాంతికారి జనతన సర్కార్ బాధ్యులు మిలీషియాను వెంటనే కాల్పులు జరుగుతున్న ప్రాంతానికి పంపారు. మిలీషియా సభ్యులంతా తమ ఆయుధాలన్నిటినీ తీసుకుని అక్కడికి పరుగులు పెట్టారు. కాల్పులు జరుగుతున్న ప్రాంతం అక్కడికి ఎంతో దూరం లేదు.

రాధక్క కదలికల్లో రోజూలేని ఒక చురుకుదనం. జావ కాచడానికి హడావుడి పడుతూ తిరుగుతోంది. రాధక్కది ఆ ఊరు కాదు, ఆ పంచాయితీ కాదు, ఆ ఏరియా కాదు, ఆ డివిజను కూడా కాదు. ఎప్పుడో 25-30 ఏండ్ల క్రితం పార్టీ కెఎయంఎస్ కార్యకలాపాలను చూసే బాధ్యతను ఇచ్చి ఈ ప్రాంతానికి పంపింది. ఇక రాధక్క ఇక్కడి మనిషే అయిపోయింది. రెండేళ్ళ క్రితమే ఇక తనకు తిరగడం కష్టం అని పార్టీకి చెప్పి ఈ ఊర్లోనే ఉంటోంది. అప్పుడు కూడా ఇంటికి పోవాలనే ఆలోచనే లేదు. తను చనిపోయినా ఇక్కడే బొంద పెట్టాలని చెప్తూ ఉంటుంది. తన దగ్గరకు వచ్చే కెఎయంఎస్ లేదా ఇతర యువ కార్యకర్తలకు తన అనుభవాలు పంచుతూ, సలహాలు ఇస్తూ, సందేహాలు తీర్చుతూ ఉంటుంది. తను పండించిన కూరగాయలూ అవీ పిఎల్‌జిఎకి పంపిస్తూ ఉంటుంది. ఊరివాళ్లకు తలలో నాలుకలా, పెద్దదిక్కులా ఉండడంతో ఊరివాళ్లు ఆమెనూ, ఆమెను ఊరివాళ్లూ వదిలి ఉండరు.

జావ పొయ్యి మీద పడేసి హడావుడిగా తిరిగినందువల్ల పట్టేసిన కాళ్లను సవరించుకుంటూ మంచం మీద కూచుంది రాధక్క.

'ఈ మధ్య ఎట్లంటే అట్ల ఉరికొస్తున్నరు కొడుకులు. ఎలికాప్టర్లలోనే రాబట్టిరి. మనుషులను ఎత్తుకోని కూడా పోతున్నరు వాటిల్లో. మనవాళ్లు ఏడున్నరో ఏమో, మొన్న సీత వాల్లొచ్చి కూరగాయలు పట్టుకోని పోయిర్రు మరి, ఇక్కడ్నే ఎక్కడన్న ఉన్నరేమో, మనవాళ్ల జాడ గిట్ట తెలిసి రాలే కదా కొడుకులు? ఊర్ల మీద దాడి చేస్తే ఊరంతా ఆగం చేస్తుర్రు. మనవాళ్ల మీద దాడి చేస్తే చాలా సార్లు తప్పుకుంటుర్రు గానీ మొన్న పువ్వార్‌లో లాగ అయితే మనకు పెద్ద నష్టమే జరుగుద్ది,' రాధక్క మనసంతా అతలాకుతలంగా ఉన్నది.

కొద్ది నెలల క్రితం రాధక్క ఉన్న ఊరి మీద, చుట్టుపక్కల ఊర్ల మీద పెద్దెత్తున ప్రభుత్వ బలగాలు దాడులు చేశాయి. హెలికాప్టర్లలో ఫోర్సు దిగడమే కాక అరెస్టు చేసిన వారిని వాటిల్లోనే ఎత్తుకుపోయారు కూడా. తమలాగ వేగంగా ఉరకలేకపోతున్న రాధక్కను ఊరివాళ్లే దాదాపు ఎత్తుకున్నంత పని చేసి తీసుకుపోయి దాచి కాపాడారు.

'తనసలు రాలేననే మొండిపట్టు పట్టింది. వాళ్లలా ఆ రోజు నన్ను తీస్కపోకుంటే పోలీసులు చంపేసేవాళ్లే, ఎన్నో ఇండ్లు కాలబెట్టి పోయిర్రు,

ఇప్పటికీ ఆ గుర్తులు అవుపడ్తనే ఉన్నయి,' పనులూ, ఆలోచనలూ కలిపే సాగుతున్నాయి రాధక్కవి. జావను కలియబెట్టి గంజులు తోమడానికి బైటికొచ్చిందో లేదో,

"మనవాళ్లే దాడి చేసిన్రు రాధక్కా, మొత్తం చుట్టుముట్టినారట, కుమ్మాల్ చూసొచ్చి మనకు కబురు ఇచ్చి మల్ల ఉరికిండు అడికి," అంటూ వేగంగా ఆమెకు కబురు చేరవేసి ఊర్లోకి ఉరికింది భీమె.

రాధక్క మనసు కొంత కుదుటపడ్డది. ఆమె ముఖంలో చిరునవ్వు విరిసింది.

'మంచిది. మళ్లొకసారి పోలీసులకు పెద్ద దెబ్బ కొడుతున్నట్టున్నది మన కామ్రేడ్స్. మొన్నటి ఆపరేషన్‌కు కూడా బదులా. కానీ ఆ వొక్క ఆపరేషన్ అనేముంది? ఎప్పుడూ ఆపరేషన్లు జరుగతనే ఉన్నయి. యుద్ధమేనాయె. గెలవాలె, మనవాళ్లు గెలవాలె, లేకుంటే ప్రజల బతుకు ఇంకా ఆగమైతది. ముందు ఇట్ల లేకుండె. ఎన్నో యేండ్లు పోలీసుల ముకం జూడని ఊర్లుంటుండె. కానీ నాలుగైదేండ్లుగా వాని ఆపరేషన్లు పెర్గినయి. ఇప్పుడైతే అసలు రికాం లేకుంటయ్యింది. మళ్లొక పెద్ద దెబ్బ కొడితె గానీ వాడు ఇష్టమొచ్చినట్టు ఉరికొచ్చుడు బంద్ కాదు, కనీసం కొద్ది రోజులైన...'

రోజూ కోసి గానీ, భీమే గాని రాధక్కకు నీళ్లు తెచ్చిస్తరు. భీమే ఊర్లోకి పోయింది గనుక కోసినే నీళ్ళు తెచ్చి పోసి వెంటనే వెళ్ళిపోయింది, "పిల్లోనికి పాలుపట్టి పడుకోబెట్టాలక్కా" అంటూ.

కోసి ముఖంలో కూడా తెలీని ఒక సంతోషం అవుపడింది రాధక్కకి.

'ఎందుకుండదు? మొన్నటి దాడిలో బాలెంత అని చెప్పున్నా ఇనకుండా ఆమెను కూడా కొట్టిన్రు పోలీసులు. పసికందును తీస్కుని ఉరకలేక, మంచంలో ఉన్న మామను విడువలేక కోసి ఊర్లనే ఉండిపోయి ఆ కుక్కలకు దొరికిపోయింది,' గంజులు కడుగుతూ వాతలు తేలిన కోసి శరీరాన్ని గుర్తుకు తెచ్చుకుంది రాధక్క.

తిరిగొస్తున్న భీమె కనిపించడంతో, "అక్కలందరూ తయారేనా?" అడిగింది రాధక్క.

"ఆ, కొందరు జావ, కొందరు నీళ్లు తీసుకుని తయారవుతున్నరు, కొందరు అన్నలు మంచాలు మోసుకోని పోయిన్రు ఇప్పటికే," అంది భీమె ఉత్సాహంగా.

"భీమె, నా జావ కూడా తీస్కోని పో, నాకు రావల్లనే ఉన్నది గానీ..." అంది రాధక్క ఆశగానూ, నిరాశగానూ.

"నువ్వేడ వస్తవక్కా ఎండెక్కుతుంది, నేను తీస్కపోతలే," అంది భీమె ఆప్యాయంగా.

"అంతేలే, లడాయి గెల్చినంక మనకెన్ని తుపాకులు, తూటాలు దొర్కినయో చూడనీకి వస్తలే," అంది రాధక్క నవ్వుతూ.

"ఆ, అలా వద్దువులే," అంది భీమె ఇంట్లోకి పోతూ.

ఊర్లో సందడి రాధక్కకి తెలుస్తూనే ఉంది.

"మొన్నటి పెద్ద దాడి తర్వాత తనను వేరే ఊరికి మారుస్తా మన్నది పార్టీ. తను ఒప్పుకోలేదు. ఊరివాళ్లూ ఒప్పుకోలేదు. పార్టీ చెప్పిందీ నిజమే, ముందరిలా లేదు పరిస్థితి. దాడులు పెరిగితే తను బతికి బట్టకట్టడం కష్టమే అవుతది. తను కెఎఎంఎస్ కార్యకర్తగా పని మొదలుపెట్టినప్పుడు ఎక్కువ యువతుల్నే చేర్చేది సంగంలో. అప్పుడు అరుణక్క తనకు చెప్పింది, సంగం అంటే అన్ని వయసుల వాళ్లూ ఉండాలి, నడివయసువాళ్లనూ, పెద్ద అక్కలనూ కూడా చేర్చాలే అని. ఉడుకు రక్తంలో తనకు మొదట అర్థం కాకపోయేది. యువతులైతే అన్ని పనుల్లోకీ చురుగ్గా వస్తారు కదా, వాళ్లు రారు కదా అనుకునేది. పని చేస్తూ చేస్తూ ఉంటే తనకు అర్థం అయ్యింది అన్ని వయసుల వాళ్లూ సంగంలో ఎందుకుండాలో. ఇప్పుడిక తనకే వయసు పెరిగాక ఇంకా బాగా అర్థం అయితున్నది తన అనుభవం సంగానికి ఎంత అవసరమో. పార్టీ అందుకే పట్టుపట్టింది మారుస్తానని...'

రాధక్క గంజులో జావ పోసి, మూత పెట్టి, ఆకులో కల్లుప్పు మూటగట్టింది. భీమె కోసం ఎదురుచూస్తూ మంచంలో కూచుంది. మహిళలు ఒక్కొక్కరూ తలపై గంజులో, బిందెలో ఎత్తుకుని రాసాగారు. భీమె కూడా రాధక్క ఇచ్చిన గంజునెత్తుకుంది. కోసి కూడా తయారయ్యింది నీళ్ల బిందెతో.

"రాధక్కా పిల్లోడు పడుకున్నడు. లేస్తే సూడు నువ్వే, నీ దగ్గరుంటే ఏడ్చుడు ఉండదులే," అంది కోసి.

'ఇంతమంది పోతున్నరు కదా, ఆగరాదు కోసీ,' రాధక్క నోటి చివరి దాకా వచ్చింది మాట. కానీ అనలేదు. 'వెల్లనీలే, ఆ గుండెల్లో మంట కొంతైనా చల్లార్తది,' అనుకుంది.

హడావుడి వల్ల చెమటలు కారుతున్నా ఉల్లాసంగా కన్పిస్తున్న ముఖాలతో అక్కలు ఏదో జాతరకు పోతున్నట్టు మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ పోతుంటే రాధక్క వాళ్లు కనుమరుగు అయ్యేవరకూ అట్లే చూస్తూ నుంచుంది.

'మన లడాయి మొదలై ముప్పై ఏండ్లు దాటిపోయింది. నాలాగ యువతులుగా, యువకులుగా మొదట పని చేసిన వాళ్ల వయసు పెరుగుతున్నది. అనారోగ్యాలు వస్తున్నయి. ప్రజల్నే నమ్ముకుని ఉంటున్నం. గెరిల్లా బేసులు ఉన్నయి కనుక నాలాంటి సీనియర్ కామ్రేడ్స్‌ను గుండెల్లో పెట్టుకుని కాపాడుకుంటున్నయి. అంతే కాదు స్కూళ్లు, వ్యవసాయం, వైద్యం, ప్రజాసంగాలు, సర్కారు పన్లు ఎన్నెన్ని నడుస్తున్నాయి! వాటిని కాపాడుకోకుంటే ఎన్ని పన్లు ఆగిపోతయి? ఈ దాడిలో మనవాళ్లు పెద్ద దెబ్బ కొడితే మళ్ళీ కొద్ది రోజులు వాని దూకుడు తగ్గుతది, మన పనులన్నీ తిరిగి సాఫీగా సాగుతయి. చుట్టుముట్టినారంటే వదులరులే, అంతు తేలుస్తరు,' ఉండీ, ఉండీ వినిపిస్తున్న తుపాకీ కాల్పులు, శత్రువు వేస్తున్న షెల్స్ చప్పుడూ వింటూ ఇంకేం చేయబుద్ధి కాక నాలుగిండ్ల అవతల ఉన్న తన ఈడుదే అయిన నీతి ఇంటికి నడిచింది రాధక్క.

* * *

కాల్పుల శబ్దాలు వింటూ ఆ దిశలో వేగంగా మంచాలు మోసుకుని పోతున్నవాళ్లలో దేవాల్, రామాల్ కూడా ఉన్నరు. దేవాల్ వయసు నలభై ఏండ్లుంటాయి. ఇద్దరు పిల్లలు. అతను పంచాయితీ స్థాయి డిఎకెఎంఎస్ అధ్యక్షుడిగా ఆ పనుల్లో తిర్గుతుంటే భార్య ఇంటికాడే ఉండి పిల్లల్నీ, వ్యవసాయాన్నీ ఊరివాళ్ల సాయంతో చేసుకుంటోంది. రామాల్ అతనికంటే ఓ ఐదేళ్లు చిన్నవాడు. తన వ్యవసాయం తాను చేసుకుంటూ క్రాంతికారీ జనతన సర్కార్ న్యాయవిభాగంలో కూడా ఉన్నాడు.

"మనకు కబురు వచ్చినప్పటికి ఒక జవాను సచ్చిండు. ఇప్పటికి మనకు నష్టాలు లేవు, కానీ యుద్ధం కదా. చెప్పలేం. తాడిమట్ల దాడిలో మనవాళ్లు ఎనిమిది మంది చనిపోయారు, కొందరు గాయాలైనరు. త్వరగా చేరుకోవాలి. దగ్గరున్న గూడెంవాళ్లు ఈపాటికి చేరుకుని ఉండచ్చు. గాయమైనవారిని త్వరగా మోసుకువస్తేనే కాపాడుకోగల్గుతాం. ఎక్కువ రక్తం పోకముందే తీసుకొచ్చుకోవాలి," దేవాల్ అడుగులంత వేగంగానూ బైటికొస్తున్నాయి అతని నోటి నుండి మాటలు.

"కొడుకులు ఎన్ని షెల్స్ వేస్తున్నరో సూడు," అన్నాడు అతని వెనుకే వేగంగా నడుస్తున్న రామాల్.

"తూటాలు కూడా తక్కువ కాలుస్తలేరు, అన్నీ ఏకేలూ, ఇన్సాస్‌లే ఉన్నట్టున్నయి. తూటాలు మనకు దక్కనియ్యద్దు అని వాళ్లకు చెప్తున్నరట, మనకున్న తూటాల కరువుకి ఇదొకటి," అన్నాడు దేవాల్ అసహనంగా.

'ఒకప్పుడు తమకు షెల్స్ అంటే ఏంటో తెలీవు. పోలీసులు ఊరివాళ్ల మీద కూడా షెల్స్ వేయడం మొదలెట్టినప్పుడు మామూలుగా భయపడలేదు తామంతా. కానీ క్రమంగా తమకి షెల్స్ వేసినప్పుడు వచ్చే సప్పుడు, అలా వచ్చినప్పుడు అవి ఎక్కడ పడతాయి అనేది తెలిసిపోయింది. దాంతో వాటిని తప్పుకోవడం నేర్చుకున్నరు. శత్రువు తీసుకొచ్చే ప్రతి కొత్త ఆయుధం, వేసే ప్రతి కొత్త ఎత్తుగడ యుద్ధం మధ్యలో ఉండే తమకు కొత్త అనుభవాల్నే నేర్పుతూ వస్తోంది. తూటా పేలిన శబ్దాన్ని బట్టి అది ఏ తుపాకిదో కూడా తమలో చాలా మంది చెప్పేయగలరు,' దేవాల్ అన్నదానికి కొనసాగింపుగా సాగుతున్నాయి రామాల్ ఆలోచనలు.

"ఈసారి పెద్ద దెబ్బ కొట్టాలి మనవాళ్లు. మొన్న మనం గట్టిగా డిమాండు చేసినది కూడా అదే కదా," అన్నాడు దేవాల్ స్వగతంలా.

రామాల్ తలూపాడు. 'కొద్ది నెలల క్రితం పిఎల్‌జిఏ చేసిన దాడిలో ఒకే వొక సిఆర్‌పిఎఫ్ జవాను చచ్చాడు. అప్పుడు వాళ్లు తమ ఊరి మీద పడి అందర్నీ ఎంత తుక్కుగా కొట్టారంటే, అబ్బా, తట్టుకోలేకపోయాం. వారాల తరబడి లేవలేకపోయాం. మనవాళ్లు కలవగానే ఒకటే చెప్పారు అందరూ – ఇగో, మీరు దాడి చేస్తే పెద్ద దాడి చేయండి, పెద్దెత్తున చంపండి కొడుకుల్ని, ఒక్కడ్నీ, ఇద్దర్నీ కాదు, అప్పుడు ఆగుతరు, ఒకళ్లిద్దరిని చంపితే మమ్మల్ని బతకనిస్తలేరు అని. తక్కువ కోపం చేయలేదు ఆ రోజు మనవాళ్ల మీద. పాపం, దెబ్బలు తిన్న బాదంతా వాళ్ల మీద ఎల్లదీసినం. అయినా పాపం వాళ్లయినా అదే అనుకుంటరు కదా. కానీ అన్నిసార్లూ అవకాశం దొరకద్దూ. ఇయాల పెద్దదెబ్బే కొడతరనిపిస్తుంది,' రామాల్ పిఎల్‌జిఏ కామ్రేడ్స్‌ను ప్రేమగా తల్చుకున్నాడు.

సైకిళ్ల మీద వేగంగా పోతూ ఎదురైన పక్క ఊరి మిలీషియా సభ్యులిద్దరినీ ఆపడు దేవాల్.

"ముగ్గురు సచ్చిన్రట. ఇంకొందరు గాయాలైనరు అంటున్నరు. మనవాళ్లకేం కాలే. వాళ్ల పని పడుతున్నరు. మన పంచాయితీ మిలీషియా కూడా కలిసింది దాడిలో, పోతున్నం, అర్జంటు పని చెప్పిన్రు," అనుకుంట ఉరుకుతూనే ఉన్నరు వాళ్లు.

"అరే, తుపాకులు దొర్కినయా?" దేవాల్ వాళ్ల వెనకే అరుస్తుండగానే, "పద, పద, మనమూ కలుద్దాం," రామాల్ తొందరచేశాడు.

* * *

రిపేరుకొచ్చిన త్రీనాట్ త్రీ తుపాకీలో సమస్య ఏంటో చూస్తున్న రాజేష్ దగ్గరకు వేగంగా ఉరికొచ్చాడు టెక్నికల్ డిపార్టుమెంటుకే చెందిన ముకేష్.

"రాజేష్ దాదా, మనవాళ్లు సిఆర్‌పిఎఫ్ వాళ్లను చుట్టుముట్టారు. పక్క ఊరి మిలీషియా నుండి కబురు వచ్చింది. చుట్టుపక్కల వాళ్లంతా ఇప్పటికే అక్కడకు పోయిన్రట. మనం ఆధారపడిన ఊరివాళ్లూ పోతున్నరు, మనమూ పోదామా?" అడిగాడు ముకేష్.

రాజేష్ ఒక్క ఉదుటున లేచాడు, "ఎక్కడ? ఎంత దూరంలో?" అంటూ.

"నడకకి రెండు గంటలు పట్టచ్చు, నీది సైకిలే కనుక తొందరగా పోవచ్చు," అంటూ ముకేష్ దాడి ఎక్కడ జరుగుతోందో చెప్పాడు.

"సరే, పోదాం పద, ఈ పని రనితకి అప్పచెప్పి వస్తా," అనేసి వేగంగా రనితకి విషయం చెప్పి ముకేష్‌తో కలిసి సైకిలు మీద పయనమయ్యాడు.

ముకేష్ సైకిలు తొక్కుతున్నాడు. రాజేష్ మనసు అప్పటికే సమర రంగాన్ని చేరింది. ఒకప్పుడు అతనూ ఆ కంబాట్ బలగాలలో భాగమే. వారంతా అతని తోటి కామ్రేడ్సే. వారంతా ఎన్నో పెద్ద దాడుల్లో కలిసి పాల్గొన్నవాళ్లే. అలాంటి ఒక దాడిలో అతని కాలు దెబ్బ తినడంతో అతనికి కంబాట్ బలగాల్లో కొనసాగడం కష్టం అయ్యిందిక. దాంతో అతన్ని టెక్నికల్ డిపార్టుమెంటుకు మార్చింది పార్టీ. ఒక సైకిలు కూడా కేటాయించింది. అంత చురుగ్గా కంబాట్ బలగాల్లో పని చేసి, మూడు పదులు కూడా నిండని రాజేష్‌కి ఒక దగ్గర ఉండి పని చేయడం అంటే మొదట్లో చాలా కష్టంగా తోచిన మాట నిజమే. కానీ క్రమంగా అతను ఆ పనిలో మమేకం అయ్యి బాధ్యతల్లోకి కూడా వచ్చాడు. తమ బలగాలు దాడి చేస్తున్న కబురు వినగానే అతను ఇక ఆగలేకపోతున్నాడు.

"ఇంకేమని చెప్పారు?" అడిగాడు

"ఒక భాగాన్ని విడదీసి మొత్తం చుట్టుముట్టినారంట, అందర్నీ ఖతం చేస్తరని అనుకుంటున్నారు, అప్పుడు మీరు చేసినట్టే," అన్నాడు ముకేష్ శక్తికొద్దీ తొక్కుతూ.

'ఆ దాడి' గుర్తుకొస్తే ఇప్పటికీ రాజేష్‌కి ఒళ్లు గగుర్పొడుస్తూ ఉంటుంది. 'భారతదేశ విప్లవ చరిత్రలోనే అతి పెద్ద దాడి. చచ్చాడనుకున్న జవాను నుండి తుపాకీ స్వాధీనం చేసుకోవడానికి తను అడ్వాన్సు అయ్యాడు. కానీ వాడు చావలేదు. తను దగ్గరకు రావడంతోనే తుపాకీ తీసి కాల్చబోవడంతో తనకు వాడి మీద పడ్డం తప్ప దారి లేకపోయింది. పెనుగులాటలో తను పైచేయి సాధించి వాడిని చంపినా వాడి తూటా తన కాల్లోంచి దూసుకుపోయింది. అప్పట్నుంచే తను...'

"మళ్లొక పెద్ద దాడి జరిగితేగానీ మన ప్రయోగాలకు వెసులుబాటు రాదు అని మనం అనుకుంటూనే ఉన్నాం, ఇంతలోనే మనవాళ్లు సాధించారు, కదా దాదా," అన్నాడు ముకేష్ గొంతులో ఆనందం తొణికిసలాడుతుండగా.

"ఊ, పెద్ద విజయంలాగే అన్పిస్తుంది వింటుంటే. కానీ ఇక్కడి నుంచి చెప్పలేం. అక్కడ మాత్రం ఈపాటికి అర్థం అయిపోయి ఉంటుంది. వేగంగా అదనపు బలగాలు వస్తే కూడా కష్టం అవుతది, గతంలోలా లేదు కదా, కార్పెట్ సెక్యూరిటీ అంతటా..." అన్నాడు రాజేష్ సాలోచనగా.

"నాకైతే మనవాళ్లు కొట్టేస్తారనే అనిపిస్తుంది, అదే జరిగితే మనం చేస్తున్న ప్రయోగాలకు మనకు ఇంకొంత వెసులుబాటు దొరుకుతది. అవి పూర్తయి మనవాళ్ల చేతుల్లోకి కొత్త ఆయుధాలు వస్తే అవి మన దాడుల్లో ఒక గుణాత్మక మార్పును తెస్తాయి. అప్పుడు మనవాళ్లు యుద్ధరంగంలో ఇంకా పెద్ద ఫలితాలను సాధించవచ్చు. కదా దాదా?" ముకేష్ సమాధానం కోసం అడిగినట్టుగా లేదు, తనే చెప్తున్నట్టుగా ఉంది. అందుకే రాజేష్ సమాధానం ఏం చెప్పలేదు. "ఇంగో," అని ఊరుకున్నాడు.

కానీ నిజానికి రాజేష్ మనసులోనూ అవే విషయాలు మెదులుతున్నాయి.

'ఉద్యమం గడ్డు పరిస్థితిని ఎదుర్కుంటోంది అని పార్టీ సమీక్ష చేసింది. దీన్ని అధిగమించడానికి అవసరమైన ప్లానులన్నీ

రూపొందించుకున్నం. పరిస్థితిని సరిగా అంచనా వేసి దానికి తగిన ప్లానులు వేసుకోవడం ఎంతో ముఖ్యమైనదే. కానీ అది మొదటి భాగం మాత్రమే. వాటిని అమల్లోకి తెచ్చే రెండో భాగం ఎంతో కీలకం. గెరిల్లా బేసుల్ని రక్షించుకోవడానికి చేసే ఈ ఎదురుదాడులు ఆ ప్లానులో ఎంతో ముఖ్యమైన ఒక భాగం. సందేహం లేదు, 'తన' కామ్రేడ్స్ అది సాధిస్తారు, వాళ్ల పోరాటపటిమ గురించి వాళ్లతో బ్రతుకున బ్రతుకై పని చేసిన తనకంటే ఇంకెవరికి తెలుస్తుంది...'

* * *

తెల్లవారుతుండగా మొదలైన దాడి మిట్టమధ్యాహ్నానికి ముగిసింది. మొత్తం పదిహేనుమంది సిఆర్‌పిఎఫ్ జవాన్లు చచ్చారు. మరో పదిహేను మందికైనా కనీసం గాయాలు అయ్యి ఉండాలి. చనిపోయిన జవాన్ల ఆయుధాలు, తూటాల పోచులూ, వాళ్ల మిలటరీ సామాగ్రి అంతా పిఎల్‌జిఎ కంబాట్ బలగాలు, మిలీషియా కలిసి స్వాధీనం చేసుకున్నాయి. యుద్ధరంగం అంతా బీభత్సరసాయనంలా ఉంది. పిఎల్‌జిఎలో ఒక్కరికి మాత్రం భుజానికి స్వల్ప గాయాలైనాయి. వెంటనే పిఎల్‌జిఎ డాక్టర్లు అతనికి కట్టు కట్టేశారు. అతనూ మిగతా అందరితోపాటే ఆ ఎర్రటి ఎండలో నడుస్తున్నాడు.

బలగాల కమాండరు కోసాల్ పూర్తిగా అలిసిపోయి ఉన్నాడు. సమయానికి తిండీ, నిద్రా లేని మిలటరీ జీవితం అతనికి అల్సర్‌ను కానుకగా ఇవ్వడంతో, వయసు కూడా నలభయ్యవ పడిలోకి వస్తుండడంతో అతని ముఖంలో మరింత అలసట కనిపిస్తోంది. కానీ అతని కళ్లు చురుగ్గా అందరినీ, పరిస్థితినీ గమనిస్తూనే ఉన్నాయి. ప్రతీ విషయాన్నీ అతని మెదడు చురుగ్గా నమోదు చేసుకుంటూ పోతోంది.

అలసిపోయినా పిఎల్‌జిఎ కామ్రేడ్స్ అందరి ముఖాల్లో విజయగర్వం తొణికిసలాడుతోంది. 'నిజమే, ఈ విజయం ఒక రకంగా పెద్దదే. ప్రతి విజయానికీ ఉన్నట్టే దీనికీ ఒక ప్రత్యేకత ఉంది. మోదీ అధికారంలోకి వచ్చాక తమకు దొరికిన మొదటి పెద్ద విజయం ఇది. రోజురోజుకూ దట్టంగా పరుచుకుంటూ పోతున్న కార్పెటు సెక్యూరిటీ మధ్యనే సాధించిన విజయం. ప్రతి ఒక్కరూ ఎంతో సాహసంగా పోరాడిన ఫలితమే ఈ విజయం. లాల్‌సలాం కామ్రేడ్స్,' తన బలగాలకు మనసులోనే లాల్‌సలాం చెప్పుకున్నాడు కోసాల్.

కంబాట్ బలగాల యోధులకంటే ఉత్సాహంగా దాడి గురించి వర్ణించి వర్ణించి చెప్పుకుంటూ, శత్రు సైనికుల నుండి స్వాధీనం చేసుకున్న వాటిని భుజాల నిండా తగిలించుకుని సంతోషంగా చరచరా నడుస్తున్న మిలీషియాను ముచ్చటగా చూస్తూ, 'దాడి సమయంలో తమతో ఉన్న మిలీషియానే కాక చుట్టుపక్కల ఊర్ల నుండి కూడా పదుల సంఖ్యలో మిలీషియా సభ్యులు దాడి గురించి వినగానే వచ్చేసి దాడిలో భాగమైపోయారు. పెద్ద దాడులన్నిటిలో ఇది నాలుగైదేళ్లుగా క్రమం తప్పకుండా జరుగుతూ వస్తున్నదే. యుద్ధం చేస్తూనే యుద్ధం నేర్చుకోవడం అనేది తమకే కాదు వారికీ వర్తించేదే. ఈ దాడి అనుభవం తర్వాత తాము సైన్యంలో భర్తీ అవుతామని తప్పకుండా ఈసారి వీరిలో చాలామంది అడగడం ఖాయం,' అనుకున్నాడు కోసాల్.

కొద్దిదూరం అలా నడిచారో లేదో తమకు కనిపించిన దృశ్యాన్ని చూసి కోసాల్ సహా గెరిల్లాలందరూ ఒక్కసారిగా అదయ్యారు. పదులకొద్దీ సంఖ్యలో ప్రజలు బిందెలు, గంజులు పట్టుకుని అట్లే వరుసలు వరుసలుగా ఎంతో దూరం వరకూ కూచుని ఉన్నారు గెరిల్లాలకు జావ, నీళ్లు ఇవ్వడం కోసం సిద్ధంగా. ఎండలో ఉన్నామా నీడలో ఉన్నామా అనేది వారికి పట్టనే లేదు. యుద్ధంలో అలసిపోయి వచ్చే గెరిల్లాల కోసం అలా కాచుకోని ఉన్నారంతే.

అప్పటివరకూ ఉన్న అలసటంతా యెటు పోయిందో అర్థమే కాలేదు కోసాల్‌కు. అంత ఎర్రటి ఎండలో ఒక్కసారిగా చల్లటి చెట్టు నీడ కిందకు పోయినట్టుగా తోటి చప్పున కళ్లల్లో నీళ్లూరాయి అతనికి.

'ఎంత దట్టమైన, ఎంత విశాలమైన నీడ! ఇది ఉన్నంత కాలం ఎండ యెంత తీక్షణంగా కాస్తేనేమి?' అనుకుంటుంటే ఆ సాహసిక కమాండరుకే కొత్త ధైర్యం, శక్తీ ఏదో శరీరం నిండా పాకినట్టుగా ఉంది.

కోసాల్ కన్నార్పకుండా ఆ ప్రజా సంరంభాన్ని చూస్తున్నాడు. వారిలో అతనికి డిఏకెఎంఎస్, కెఏఎంఎస్, సిఎన్నెం, బాలల సంఘం వంటి ప్రజాసంఘాల వాళ్లూ, క్రాంతికారి జనతన సర్కార్ వాళ్లూ, పిఎల్‌జిఏకీ, పార్టీకీ చెందిన వేర్వేరు విభాగాల వాళ్లూ, సామాన్య ప్రజానీకం కూడా అనేక రకాల వాళ్లూ కనిపించారు. అక్కడే పుట్టి, పెరిగి, ఇరవై ఏండ్లకు పైగా ఉద్యమంలో పని చేస్తూ వస్తున్న అతనికి వారిలో ఎంతోమంది తెలిసిన వాళ్లున్నారు. అతనికి తెలవని ఎందరో కొత్త తరం యువతులూ, యువకులూ, పిల్లలూ... ఎవరిలోనూ ఇదేదో పిఎల్‌జిఎకు మాత్రమే సంబంధించిన వ్యవహారం అనే భావనే అతనికి ఆవుపడలేదు. జరిగిన సమరం, సాధించిన విజయం సమిష్టిగా తమందరిదీ అన్నట్లే వారు భావిస్తున్నట్టుగా అతనికి తోచింది.

'ప్రజలు ధైర్యంగా ఉన్నారు, ప్రతిఘటిస్తున్నరు గానీ శత్రువుపై పెద్ద దాడులు జరగాలి అని డిమాండు చేస్తున్నరు. తుపాకులు కావాలంటున్నరు, మిలటరీ శిక్షణ కావాలంటున్నరు. మీ తుపాకులు మీరే సంపాదించుకోవాలి అంటే ప్రాణాలకు తెగించి దాడులు చేసి ఒకటీ, అరా తుపాకులు శత్రువు నుండి తెచ్చుకుంటూనే ఉన్నరు కూడా. ఈ దాడి తప్పక వీళ్లందరి నైతిక స్థయిర్యాన్ని మరొక్కసారి పెంచుతుంది. దాంతో ప్రజాపునాదిని పెంచుకోవడానికి తమకు మంచి అవకాశాన్నీ మరోసారి కల్పిస్తుంది.'

అందర్నీ కండ్ల నిండుగా కలియజూస్తున్న అతని చూపు సైకిలు పట్టుకున్న రాజేష్ మీద పడగానే రాజేశ్ తన కుడిచేయి పిడికిలిని 'లాల్‌సలాం' అన్నట్టుగా ఎత్తి దృఢంగా ఊపాడు. కోసాల్ కూడా చిరునవ్వుతో బదులుగా తన కుడి పిడికిలిని లాల్‌సలాంగా ఎత్తాడు. రాజేష్ ముఖం నిండా సంతోషపు తరంగం పాకింది.

ఒక్కసారిగా "సిపిఐ (మావోవాదీ) జిందాబాద్", "పిఎల్‌జిఎ జిందాబాద్", "ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ఓడిద్దాం, ఓడిద్దాం", "క్రాంతికారి జనతన సర్కార్ జిందాబాద్" అనే నినాదాలు మిన్నంటాయి. అలలు, అలలుగా నినాదాలు సాగుతున్నాయి.

కంబాట్ బలగాలు, మిలీషియా అందరూ ఆ ప్రజా ప్రవాహంతో కలగలిసిపోయి నడవసాగారు.

అదంతా ఒక జాతరలా ఉంది. ఒక పండుగలా ఉంది.

ఒక కవాతులాగా, ఒక సవాలులాగా ఉంది.

ఎన్నో సందేహాలకు, మరెన్నో చిక్కుముళ్లకు ఒక సమాధానం లాగా కూడా ఉంది.

క్రమంగా ముందుకు సాగుతున్న ఆ అశేష జనవాహినిలో ఆలివ్‌గ్రీన్ మిలిటరీ డ్రెస్సుల ఆచూకీ ఇక విడిగా కనిపించడం మానేసింది.

(డిఏకెఎంఎస్ - దండకారణ్య ఆదివాసీ కిసాన్ మజ్దూర్ సంఘటన్, కెఏయంఎస్ - క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్, సిఎన్నెం - దండకారణ్య చేతనా నాట్యమంచ్)



వ్యాసం

# ప్రొఫెసర్, యుద్ధఖైదీ

- అరుంధతీరాయ్

స్వేచ్ఛానువాదం: ఉదయమిత్ర

నిరంతరం చక్రాల కుర్చీకే పరిమితమైన ఆ వికలాంగుడికి పాపం మహారాష్ట్ర పోలీసులు ఎంత భయపడ్డారంటే... ఆఖరికి అతడిని అపహరించుకుపోయి అరెస్టు చేయాల్సి వచ్చింది.

డా. జి.ఎన్.సాయిబాబాను అరెస్టు చేసి ఇప్పటికీ (మే 9,2015) సంవత్సరమైంది. ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన రామ్‌లాల్ ఆనంద్ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేసే ఆయనను కొందరు గుర్తు తెలియని వ్యక్తులు ఇంటికి పోయే దారిలో అడ్డంపడి అపహరించుకు పోయారు. తన భర్త కనిపించకపోయే సరికి, సెల్‌ఫోన్‌లో సైతం రెస్పాండ్ కాకపోయే సరికి ఆందోళన చెందిన ఆయన భార్య వసంత స్థానిక పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేసింది. ఇక తప్పని స్థితిలో సదరు ఆగంతకులు ముసుగు తీసేసి తమను తాము మహారాష్ట్ర పోలీసులుగా ప్రకటించుకుని, అతడి అపహరణను అరెస్టుగా మార్చి వేసారు.

ఈ ప్రొఫెసర్‌కు చిన్నప్పుడే పోలియో వచ్చి, ఐదు సంవత్సరాల నుండే చక్రాల కుర్చీకి పరిమితమయిపోయాడు. అతి సులభంగా అరెస్టు చేయగల్గిన ఇట్లాంటి వ్యక్తిని మరెందుకు అపహరించారు? దీనికి రెండు కారణాలు స్పష్టంగా కనబడ్తున్నాయి. మొదటిది, అతడిని తన ఇంటి దగ్గరే అరెస్టు చేస్తే, అతని చుట్టూ గల విద్యార్థులు, కార్యకర్తలు, ప్రొఫెసర్ల నుండి ప్రతిఘటన ఎదుర్కోవాల్సి వస్తుందనే భయం. వాళ్ళంతా సాయిబాబా వృత్తి నిబద్ధతనే గాక, అతని నిర్భయ ప్రాపంచిక రాజకీయ దృక్పథాన్ని కూడా అమితంగా ప్రేమిస్తారు. రెండోది, అపహరించడం ద్వారా తామో కరడుగట్టిన తీవ్రవాదిని పట్టుకోగలిగామని ప్రజలకు చెప్పదల్చుకున్నారు.

సాయిబాబా అరెస్టు కానున్నాడని మా కందరికీ చాలా కాలంగా తెల్సు. గతకొద్ది నెలలుగా ఇది మేమంతా చర్చించుకుంటున్నదే. దాన్ని ఎదుర్కోవటం తప్ప, గత్యంతరం లేదని మాకు తెల్సు. ఈ కొద్ది కాలంలో ఆయన మరింత కష్టపడి, "పొలిటిక్స్ ఆఫ్ ది డిసిప్లిన్ ఆఫ్ ఇండియన్ ఇంగ్లీష్ రైటింగ్" అంశం మీద తన డాక్టరేట్‌ను పూర్తి చేసాడు. మరెందుకితడిని అరెస్టు చేసినట్టు? అతను చేసిన నేరమేమిటి?

సెప్టెంబర్ 2009 నాడు, అప్పటి హోంమంత్రి చిదంబరం "ఆపరేషన్ గ్రీన్‌హంట్" పేరు మీద దండకారణ్యంపై యుద్ధం ప్రకటించాడు. దాన్ని ఆయన అడవిలోని 'మావోయిస్టు'ల్ని పూర్తిగా తుడిచిపెట్టే ప్రణాళిక అన్నాడు గాని, నిజానికది ఆదివాసీల మీద ప్రకటించిన 'అప్రకటిత యుద్ధమే'. రాజ్య ప్రేరేపిత ముఠాలు (బస్తర్‌లో సల్వాజుడుం, ఇతర ప్రాంతాల్లో పేరు లేని మిలీషియాలు) అడవి మీద పడి భయానక వాతావరణాన్ని సృష్టించాయి.

ఇక్కడ ప్రణాళిక స్పష్టమే. అడవిలోని ఖనిజాల్ని దోచుకోవడానికి సిద్ధమైన కంపెనీలకు కంట్లో నలుసులుగా తయారైన ఆదివాసీల్ని వాళ్ళు అడవి నుండి తరిమేయదల్చుకున్నారు. ఆదివాసీలకు అమ్మలాంటిదైన అడవిని కంపెనీలకు ధారాదత్తం చేయడం చట్ట విరుద్ధమనీ, రాజ్యాంగ వ్యతిరేకమనీ అప్పటి యుపిఏ ప్రభుత్వానికి తట్టలేదు. (ఇప్పుడదే చట్ట విర్ధుమైన పనిని చట్ట సమ్మతం చేయడానికి సదరు బిజెపి ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది) ఆ తర్వాత జరిగిన మారణకాండకు రక్త సిక్త అరణ్యం సాక్ష్యంగా నిలిచింది. సల్వాజుడుం హంతక ముఠాలకు వేలాది పారా మిలిటరీ బలగాలు తోడై అడవిని రావణ కాష్టంగా మార్చివేసారు. వందలాది గూడేల్ని తగులబెట్టి, వేలాది గ్రామస్తుల్ని చంపివేసి, స్త్రీలపై హత్యాచారాలు జేసి, కనీవినీ ఎరుగని బీభత్సకాండ సృష్టించారు. ఆకాశం బిత్తరపోయి చూస్తుంటే, వేలాది మంది పౌరులు పారిపోయి అడవుల్లో తలదాచుకున్నారు. దీనికి విసిగి వేసారిన వందలాది యువకులు స్వచ్ఛందంగా ముందుకొచ్చి పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ (పిఎల్‌జిఎ) లో చేరిపోయారు. ఈ ఉద్యమాన్నే అప్పటి గౌరవనీయ మన్మోహన్‌సింగ్ గారు "భారతదేశపు అంతర్గత భద్రతకు అతి పెద్ద ప్రమాదం"గా అభివర్ణించారు. ఇప్పటికీ ఈ దండకారణ్యమంతా అంతర్యుద్ధంలాగా అట్టుడుకిపోతున్నది.

అన్ని సుదీర్ఘ యుద్ధాల్లాగే, ఈ పరిస్థితినీ సింపుల్‌గా విభజించలేం. ఈ ప్రతిఘటనా యుద్ధంలో కొందరు న్యాయం కోసం పోరు జేస్తే, ఇంకొందరు అవకాశవాదులై, డబ్బులు దోచుకుంటూ, పక్కా నేరస్తులుగా మారిపోయారు. ఈ మధ్యలో చాలా దారుణాలే జరిగిపోయాయి. కొన్నింటిని 'టెర్రరిజం' అని, కొన్నింటిని అభివృద్ధి అని చెప్పుకోవాలి.

2010-11 కాలంలో ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఉచ్ఛదశలో ఉన్నపుడు, దీని పట్ల వ్యతిరేక ప్రచారం ఊపందుకుంది. చాలా చోట్ల ర్యాలీలు, బహిరంగ సభలు నిర్వహించారు. అడవిలో జరుగుతున్న దారుణాలు ఒక్కొటొక్కటిగా బయటపడి, అంతర్జాతీయ మీడియా దృష్టిలో పడ్డాయి. ఈ క్యాంపెయిన్‌ను సమర్థవంతంగా నిర్వహించి, ప్రజల మద్దతు కూడగట్టిన వాళ్ళలో సాయిబాబా కూడా ఒకరు. తాత్కాలికంగానయినా ఈ క్యాంపెయిన్ విజయం సాధించింది. దిక్కు తోచని స్థితిలో ప్రభుత్వం అసలు గ్రీన్‌హంట్ అనేదే లేదని నటిస్తూ, ఇదంతా మీడియా సృష్టి అని తేల్చి చెప్పింది. (ఇప్పటికీ దండకారణ్యంలో ఆదివాసీల మీద నిర్బంధకాండ కొనసాగుతూనే ఉంది. ఇంతకు ముందు కనీసం దానికో పేరుండేది. ఇప్పుడది 'నామరహిత ఆపరేషన్' (ఆపరేషన్ నో నేమ్) గా కొనసాగుతున్నది. మే5,2015 నాడు చవీంద్రకర్మ సల్వాజుడుం-2 ను మొదలు పెడ్తున్నట్టు ప్రకటించేసాడు. ఇతడు సల్వాజుడుం సృష్టికర్తగా పేరు పొందిన, మావోయిస్టు అంబుష్‌లో చనిపోయిన మహేంద్రకర్మ కుమారుడు. గతంలో సుప్రీంకోర్టు, సల్వాజుడుం-1

ను చట్టవిరుద్ధమైనదిగా, రాజ్యాంగ విరుద్ధమైనదిగా ప్రకటించినప్పటికీ, దాన్ని బేఖాతరు జేసి, సల్వాజుడుం-2ను ప్రకటించేసాడు)

"నామ రహిత ఆపరేషన్" ప్రకారంగా ఎవరైనా ప్రభుత్వ పాలసీలను విమర్శించినా, ఎక్కువగా మాట్లాడినా, అతడు 'మవోయిస్టు' గా ముద్రవేయబడ్తాడు. ఇక అతనికి జైలు, చిత్రహింసలే గతి. ఈ విధంగా వేలాది మంది దళితులు, ఆదివాసీలు ఊపా (యుఎపిఎ- అన్‌లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్) చట్టం కింద నిర్బంధించబడి, జైళ్ళల్లో మగ్గుతున్నారు. ఈ చట్టం కింద ఎవరినైనా, ఎక్కడైనా, ఏ కారణం చేతనైనా అరెస్టు చేయవచ్చు. ఓ వైపు తమకే సాయమందుతుందో తెలీక, అసలు తామేం నేరం చేసామో తెలీక, గ్రామస్తులు జైళ్ళలో మగ్గుతూ ఉంటే, ఇప్పుడు రాజ్యం తన దృష్టిని పట్టణాల్లోని బహిరంగ (ఓవర్‌గ్రౌండ్) కార్యకర్తల మీద కేంద్రీకరించింది.

గతంలోని పరిస్థితి పునరావృతం కాకూడదని ఆలోచించి, కేంద్ర ప్రభుత్వం 2013లో సుప్రీం కోర్టులో ఓ అఫిడవిట్ దఖలుపర్చింది. అందులో తన ఉద్దేశాల్ని స్పష్టంగానే చెప్పింది. "నగరాల్లోని, పట్టణాల్లోని మావోయిస్టు సానుభూతిపరులు, రాజ్యానికి వ్యతిరేకంగా చాలా బలంగా పనిజేస్తున్నారు. అసలు వీళ్ళే మావోయిస్టు ఉద్యమాన్ని కాపాడుతూ, మావోయిస్టుల కన్నా ప్రమాదకారులుగా తయారవుతున్నారు"

**సాయిబాబా ప్రవేశం :**

అతని మీద కట్టు కథలు రాయడం మొదలెట్టినపుడే, అతనిని టార్గెట్ చేస్తున్నారన్నది తెలిసిపోయింది. (వాళ్ళ దగ్గర సరైన ఆధారాలు దొరకనపుడు, అత్యుత్తమ మార్గమేమంటే, అతని చుట్టూ అనుమానాస్పద వాతారణాన్ని సృష్టించడమే)

ఇక చరిత్ర మొదలయ్యింది.

సెప్టెంబరు 12,2013 నాడు దొంగతనం నేరం మీద సాయిబాబా ఇంటి మీదకి 50 మంది పోలీసులొచ్చి 'దొంగసొమ్ము' కోసం సోదా చేసారు. 'సొమ్ము' దొరకలేదు గాని, వాళ్ళాయన 'ఆస్తి' ని కాజేసారు. ఆయన ల్యాప్‌టాప్, హార్డ్‌డిస్క్, పెన్‌డ్రైవ్‌లను పోలీసులు ఎత్తుకుపోయారు. రెండు వారాలు గడిచాక, అక్కడి పరిశోధనాధికారి, సుహాస్ బావాచి, సాయిబాబాను 'పాస్‌వర్డ్' కోసం అడిగాడు. వెంటనే ఆయన చెప్పేసాడు. జనవరి 9, 2014 నాడు కొందరు పోలీసుల టీం వచ్చి ఈయనను ఇంట్లోనే గంటల తరబడి ఇంటరాగేట్ చేసారు. ఆ తర్వాత మే 9 నాడు ఆయనను అపహరించారు. ఆయనను నాగపూర్‌కు తీసుకపోయి, అక్కడి నుండి ఆహిరి (మహారాష్ట్రలోని చిన్న పట్టణం) కి, మళ్లీ అక్కడి నుండి నాగపూర్‌కు తరలించారు. ఈ క్రమంలో ఆయన వెంట వందలాది మంది సాయుధ పోలీసులు, జీపుల్లో, ల్యాండ్‌మైన్ ప్రూఫ్ వాహనాల్లో వెళ్ళారు. ఒక్క వికలాంగుడి వెంట ఎంత బలగమో...ఎందుకంత భయమో.

సాయబాబాను నాగపూర్ జైల్లో 'అండాసెల్' (అత్యంత ప్రమాదకరమైన సెల్) లో పడవేసారు. దేశ విదేశాల్లో ప్రజా సమస్యల మీద ఉపన్యాసాలిచ్చిన ప్రొఫెసర్ దేశంలోని మూడు లక్షల మంది "విచారణ ఖైదీ"ల గుంపులో చేరిపోయారు. ఈ మొత్తం హైడ్రామాలో అతడి చక్రాల కుర్చీ విరిగిపోయింది. డా.సాయిబాబా "90 శాతం వికలాంగుడు". అతడి భౌతిక పరిస్థితి మరింత జటిలం కాకుండా ఉండాలంటే, అతడికి నిరంతరం ఫిజియోథెరపీ, మందులు, వ్యక్తిగత శ్రద్ధ అత్యవసరం. పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే, అతడిని అమానుషంగా ఒంటరి సెల్‌లో పడేసారు. అతనికి సాయంగా ఎవరూ లేరు. చివరకు బాత్రూంకు పోవాలన్నా ఒక్కడే పోవాలి.అతడు గది నాలుగు దిక్కులా పాకుతూ పోవాల్సిందే.

అయితే ఇవేవీ సదరు అధికారులకు చిత్రహింసల్లాగ అనిపించవు. వాళ్ళకున్న ఒకే ఒక్క ఆయుధమేమంటే, ఆయన అందరిలాంటివాడు గాదు. అతడికి ఏసాయమందకుండా చేసి, కిరాతకంగా చిత్రహింసలు పెట్టి చంపేసేయొచ్చు.

మరుసటి రోజు పేపర్లలో తమషా జరిగింది. తన విరిగిన చక్రాల బండిలో కూర్చున్న ఈ కరడుగట్టిన టెర్రరిస్టును తమ విజయ చిహ్నంగా చూపెడుతూ, సాయుధ మహారాష్ట్ర పోలీసులు అతడితో ఫొటో దిగారు. మరుసటి రోజు అది అక్కడి పేపర్లలో మొదటి పేజీల్లో అచ్చయిపోయింది.

సాయిబాబా మీద ఊపా చట్టం కింద సెక్షన్ 13 (చట్టవ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనడం) సెక్షన్ 18 (టెర్రరిస్టు కార్యకలాపాలకు ప్రయత్నించడం) సెక్షన్ 38 (టెర్రరిస్టు సంస్థలకు సహకరించి, ముందుకు తీసుకుపోవడం) సెక్షన్ 39 (టెర్రరిస్టు కార్యకలాపాలకు ప్రజల మద్దతు కూడగట్టడం) లు నమోదు చేసారు. ఇవి గాక, మావోయిస్టు ఖైదీగా ఉన్న కామ్రేడ్ నర్మదకు అందజేయడానికి గాను హేంమిశ్రా అనే జెఎన్‌యు విద్యార్థికి కంప్యూటర్ చిప్ అందజేసాడని మరో అభియోగం మోపారు. హేంమిశ్రాను బల్లార్షా రైల్వేస్టేషన్‌లో ఆగస్టు 23న అరెస్టు చేసారు. అతడిని సాయిబాబాతో పాటు నాగపూర్ జైల్లో ఉంచారు. ఈ కుట్రలో భాగస్వాములైన మరో ముగ్గురికి మాత్రం బెయిల్ దొరికింది.

డా॥ సాయిబాబా రెవల్యూషనరీ డెమోక్రటిక్ ఫ్రంట్ (ఆర్‌డిఎఫ్) కు జాయింట్ సెక్రటరీగా పనిజేస్తున్నాడు. ఈ సంస్థకు మావోయిస్టు 'ఫ్రంట్' అనే ముద్రవేసి ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లలోని నిషేధించారు. ఈ బాధ్యతను కూడా ఓ తీవ్రమైన నేరంగా పరిగణిస్తూ, అతడి ఛార్జిషీట్‌లోకి ఎక్కించారు. ఈ సంస్థను ఢిల్లీలో, మహారాష్ట్రలో నిషేధించలేదు. ప్రస్తుతం హైదరాబాద్‌లో నివసిస్తున్న సుప్రసిద్ధ కవి వరవరరావు దీనికి అధ్యక్షుడిగా కొనసాగుతున్నారు.

అతని కేసు ఇంకా విచారణకు రాలేదు. అది సంవత్సరాలు కాకపోయినా, కొన్ని నెలలైనా పట్టొచ్చు. ఇక్కడ ప్రశ్నేమిటంటే 90 శాతం వికలాంగుడైన వ్యక్తి జైల్లో ఉన్న దుర్భర పరిస్థితుల్లో ఎక్కు కాలం జీవించగల్గుతాడా?

ఈ సంవత్సర కాలంలో అతని పరిస్థితి మరింత క్షీణించింది. అతడు నిరంతరం విపరీతమైన నొప్పితో సతమత మవుతున్నాడు. (పోలియో బాధితులకు ఇదంతా సహజమేనని జైలు అధికారులు కొట్టి పారేస్తున్నారు)

అతని వెన్నెముక బాగా దెబ్బతిన్నది. అది వంగి ఊపిరితిత్తుల్లోకి చొచ్చుకు వచ్చే ప్రమాదముంది. అతని ఎడమ చేయి పని చేయడం లేదు. జైలు అధికారులు అతడిని స్థానిక దవాఖానాకు తీసుకుపోతే, అతడికి 'ఏంజియోప్లాస్టీ' (హృదయ సంబంధింత శస్త్ర చికిత్స)

అవసరమని కార్డియాలజిస్ట్ సలహా ఇచ్చాడు. ఇదంతా అయ్యే పనేనా? జైల్లో ఉన్న ఈ దుర్భర పరిస్థితుల్లో, అతనికి ఏంజియోప్లాస్టీ చేసిన తర్వాత పరిస్థితి ఊహించుకుంటేనే భయమేస్తుంది. పోనీ ఆ బాధ భరిస్తూ సరిపెట్టుకుందామంటే, అదీ దారుణమే. చాలా సార్లు జైలు అధికారులు మందులు దొరక్కుండా చేసారు. ఒక వేళ మందులు దొరికినా, అతనికి కావాల్సిన 'ప్రత్యేక ఆహారాన్ని' నిరాకరిస్తున్నారు. ఇలా ఒకదాని వెంట మరొకటి చుట్టూ ఉచ్చు బిగిస్తున్నారు.

భారతదేశానికి వికలాంగుల హక్కుల అంతర్జాతీయ ఒప్పందంలో భాగస్వామ్యముంది. దీనితో బాటు, వికలాంగుడైన వ్యక్తిని చాలా కాలం జైల్లో 'విచారణ ఖైదీ' (అండర్ ట్రైల్) గా ఉంచడాన్ని చట్టం నిషేధించింది కూడా. ఇన్ని ఉన్నా కూడా, సాయిబాబాకు రెండు సార్లు సెషన్స్ కోర్టు బెయిల్ ఇవ్వడానికి నిరాకరించింది. తమాషా ఏమటంటే, రెండో సందర్భంలో, జైలు అధికారులు తాము అతని పట్ల ప్రత్యేక శ్రద్ధ (?) వహిస్తున్నామని చెప్పడంలో బెయిలు నిరాకరించారు. (కుటుంబ వ్యక్తులు అతడి చక్రాల కుర్చీని మార్చడానికి మాత్రం వీలు కల్పించారు). తనకు బెయిలు నిరాకరించిన రోజు నుండే తనపై తీసుకునే పర్సనల్ కేర్‌ను ఉపసంహరించుకున్నారని, ఆయన జడ్జికి లేఖ రాసాడు. విసిగి వేసారి అతను జైల్లోనే నిరాహార దీక్ష మొదలెట్టాడు. కొద్ది రోజుల్లోనే, అతడిని అపస్మారక స్థితిలో దవాఖానకు తీసుకుపోయారు.

కొద్దిసేపు వాదన కోసం సాయిబాబా దోషా, నిర్దోషా అనే సంగతి పక్కన పెడదాం. ప్రస్తుతానికి, మనం బెయిల్ ఇవ్వడం అనే ప్రశ్న మీదనే దృష్టి పెడదాం. ఎందుకంటే బెయిల్ అనేది సాయిబాబాకు ఓ అవసరం గాదు, అది ఆయన జీవన్మరణ సమస్య కూడా.

ఆయన మీద ఎటువంటి ఆరోపణలైనా ఉండనీ – సాయిబాబుకు బెయిల్ దొరకాలా? వద్దా? ఈ కింద పేర్కొన్న సుప్రసిద్ధ వ్యక్తులు, ప్రభుత్వ ఉద్యోగులు బెయిల్ పొందిన విధానాన్ని చూద్దాం.

'బాబు భజరంగీ' అనే వ్యక్తి 2002లో గుజరాత్‌లోని నరోదా పాటియా మారణకాండలో 93 మందిని హత్య చేయడంలో కీలక పాత్ర వహించినందుకు ఆయనకు యావజ్జీవ జైలు శిక్ష విధించారు. ఆయనకు 'అత్యవసర కంటి చికిత్స' కోసం గుజరాత్ హైకోర్టు ఏప్రిల్ 23, 2015 నాడు బెయిలు మంజూరు జేసింది. తన నేరాన్ని ఒప్పుకుంటూ, ఈ మహానీయుడు ఏమన్నాడో చూద్దాం. "మేము ఒక్క ముస్లిం షాపునీ వదిలి పెట్టలేదు. మొత్తాన్నీ దగ్ధం చేసాం. వాళ్ళను నరికి, కాల్చి మంటల్లోకి నెట్టి చంపివేసాం. ముస్లింలకు పూడ్చి పెట్టడమంటే ఇష్టం లేదు కాబట్టి మేమే వాళ్ళను మంటల్లోకి తోసేసాం. వాళ్ళను చంపిన తర్వాత నాకు నేను రాణా ప్రతాప్ సింగ్ లాగ ఫీలయ్యాను"- తెహల్కా సెప్టెంబరు 1, 2007.

కంటి ఆపరేషనా? రెండోసారి ఆలోచించినపుడు అతడికది అవసరమేమో ననిపించింది. ఈసారైనా అతడు తన హంతక కళ్ళద్దాల (మర్డరర్స్ లెన్స్) ను మార్చి కాస్త తక్కువ ప్రమాదకరమైన కళ్ళద్దాలు వాడతాడేమో.

మాయా కొద్నానీ దగ్గరికి వద్దాం. మోడీ గుజరాత్ ప్రభుత్వంలో ఈమె మంత్రి. ఈమె నరోదా పాటియా మారణ కాండలో కీలక పాత్ర వహించినందుకు, 28 సంవత్సరాల జైలు శిక్ష విధించారు. ఈమెకు జులై 30, 2014 నాడు గుజరాత్ హైకోర్టు ఎంచక్కా బెయిలు మంజూరు చేసింది. తనకు టి.బి., హృద్రోగ సమస్య, వెన్నెముక సమస్య, డిప్రెషన్ సమస్యలు ఉన్నాయని కోర్టువారికి విన్నవించడంతో, వారు చలించిపోయి, ఏకంగా ఆమె శిక్షను సస్పెండ్ చేసేసారు.

అమిత్‌షా అందరికీ తెల్సిన వాడే. ఈయన కూడా గుజరాత్‌లోని మోడీ ప్రభుత్వంలో మంత్రి. ఈయన ముగ్గురు వ్యక్తులు - షోహ్రాబుద్దీన్, ఆయన భార్య కౌసర్‌బీ, తులసీరామ్ ప్రజాపతిల హత్య కేసుల్లో ప్రధాన సూత్రధారి. ఈ ముగ్గురినీ అక్రమ కస్టడీలో నిర్బంధించినపుడు, అమిత్‌షాకూ, పోలీసులకూ మధ్య నడిచిన ఫోన్‌కాల్స్‌ను సిబిఐ బయటపెట్టింది. అయితే ఆయనను అరెస్టు చేసిన మూడు నెలలకే బెయిలు దొరికింది. (ఆ తర్వాత కొన్ని ఆందోళనకరమైన, విచిత్రమైన సంఘటనల తర్వాత ఆయన కేసును పూర్తిగానే కొట్టి పడేసారు) ప్రస్తుమం ఆయన బిజెపి అధ్యక్షుడు. ప్రధానమంత్రి మోడీ గారికి కుడి భుజం కూడా.

మే22,1987 నాడు 42 మంది ముస్లింలను పిఏసి వారు చుట్టుముట్టి ట్రక్కుల్లో ఎత్తుకుపోయి, అందరినీ హాషింపురా ప్రాంతంలో నిర్భయంగా చంపేసి, పక్కన గల కాలువలో పడేసారు. ఇందులో 19 మంది పిఏసి వారిని దోషులుగా ప్రకటించారు. చిత్రమేమంటే, వీళ్ళంతా తమ తమ సర్వీసుల్లో ఎటువంటి ఇబ్బంది లేకుండా కొనసాగారు. వాళ్ళకు రావాల్సిన ప్రమోషన్లు, బోనస్‌లు, ఆర్థిక సదుపాయాలు ఎంచక్కా అందాయి. 13 సంవత్సరాల తర్వాత తీరిగ్గా, వాళ్ళలో 16 మంది కోర్టుకు సరెండరయ్యారు (ముగ్గురు చనిపోయారు). షరా మామూలుగా వాళ్ళకు వెంటనే బెయిలు దొరికింది. కొద్ది వారాల కిందట సాక్ష్యాధారాలు బలంగా లేనందున, కేసును కొట్టి పడేసారు.

'హనీబాబా' ఢిల్లీ యూనివర్సిటీలో టీచరు. ఈయన సాయిబాబా రక్షణ, విడుదల కమిటీలో ఓ మెంబరు. ఇటీవల ఆయన సాయిబాబాను హాస్పిటల్‌లో కొద్ది నిముషాలు కలువగలిగాడు. ఏప్రిల్ 23, 2015 నాడు ఆయన ఓ పత్రికా సమావేశం ఏర్పరచి (దీన్ని ఎవరూ రిపోర్టు చేసిన పాపాన పోలేదు) అక్కడి పరిస్థితి వివరించాడు. డా॥సాయిబాబా సెలైన్ తీసుకుంటూ, బెడ్ మీద కూచొని తనతో మట్లాడాడు. చిత్రమేమంటే, అతను ఇంటర్వ్యూ ఇస్తున్నంతసేపూ, అక్కడి సెక్యూరిటీ గార్డు తన ఎ.కె-47 తుపాకీ అతని వైపు గురి పెట్టి నిల్చున్నాడు. రెండు కాళ్లూ చచ్చుబడ్డ వ్యక్తి ఎత్తయిన జైలు గోడలు దూకి ఎక్కడికి పారిపోతాడోననే భయం కాబోలు.

అసలు సాయిబాబా సజీవంగా జైలు నుంచి బయటికొస్తాడా? వాళ్ళతడిని అట్లా విడిచిపెడతారా? పరిస్థితులు చూస్తే, వాళ్ళతడిని అట్లా విడిచిపెట్టేటట్టు లేరు.

ఇగో ఈ వ్యవస్థలో, దానికి ఓటేసి, రాజీపడి బతుకుతున్నాం. ఇదీ మనం.

(కా. సాయిబాబా అనారోగ్యం దృష్ట్యా ముంబై కోర్టు ఆయనకు మూడు నెలల తాత్కాలిక బెయిల్ ఇచ్చింది)

*(ఈ వ్యాసం మే 18 అవుట్‌లుక్ పత్రికలో అచ్చయింది.)*



ప్రత్యేక వ్యాసం

# మేక్ ఇన్ ఇండియా వినాశకరం
# జనతన సర్కార్లు ప్రత్యామ్నాయం

-జహంగీర్

(3)

(గత సంచిక తరువాయి...)

జనతన సర్కార్లు వ్యవసాయం తర్వాత కేంద్రీకరిస్తున్నది ప్రజల విద్య, ఆరోగ్యం పైనే. ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడులు ప్రారంభమయ్యాక 2009 నుంచి ఇప్పటి వరకూ దండకారణ్యంలోని దాడులు జరగని జనతన సర్కార్ స్కూళ్లంటూ లేవు. తాజాగా భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) దశాబ్ది వేడుకల ప్రారంభం రోజు అంటే 2014 సెప్టెంబర్ 21 నాడు ఉదయం 8 గంటల సమయంలో మాడ్ డివిజన్‌లోని కుమ్‌నార్ స్కూల్‌పై దాడి జరిగింది. ఇది ఛత్తీస్‌గఢ్‌లోని నారాయణపూర్ జిల్లాలో గల 'దుర్గమమైన' మాడ్ కొండల్లోనే ఉన్నప్పటికీ పొరుగున ఉన్న మహారాష్ట్రకు చెందిన గడ్చిరోలి జిల్లా సీ-60 కమాండోలు దాడి చేసారు. ఆ పోలీసుల దాడిలో ఉపాధ్యాయులు, పిల్లలు ప్రజల మద్దతుతో తృటిలో తప్పుకోగా, క్షణాల్లో పాలిథీన్ కవర్ల పాఠశాల ఖాకీల మంటల్లో ధ్వంసమైంది. చిన్నారి బడిపిల్లల పాఠ్య పుస్తకాలు, గుడ్డలు, బ్రష్‌లు, తిండి దినుసులు ఏవీ చేతికి అందకుండా పోయాయి. వారికి డివిజన్ జనతన సర్కార్ నుంచి వార్షిక బడ్జెట్‌లో భాగంగా అందిన రూ.40 వేలను కూడా పోలీసులు దోచుకున్నారు. ఈ పాఠశాలపైనే 2012 ఫిబ్రవరిలో ఆ పోలీసులే మొదటిసారి దాడి చేసారు. పశ్చిమ బస్తర్‌లోని తుమ్‌నార్, జప్పూర్ తదితర పాఠశాలలు దక్షిణ బస్తర్‌లోని పాఠశాలలు, మాడ్‌లోని కొడ్డిలేర్, తూర్పు బస్తర్‌లోని తిర్క, గడ్చిరోలిలోని టేకమెట్ట పాఠశాలలను మచ్చుకు కొన్నిగా దాడికి గురైన పాఠశాలలుగా పేర్కొనవచ్చు.

ప్రభుత్వం ప్రకటించుకునే గణాంకాలలో ఆదివాసీలలో అక్షరాస్యత రేటు మాట ఎలా ఉన్నా, దండకారణ్యంలో మాత్రం జనతన సర్కార్లు కొనసాగిస్తున్న కృషితో మారుమూల పల్లెల్లో సైతం అక్షరాస్యత పెరిగింది. దోపిడీ ప్రభుత్వాలు రకరకాల పాఠశాలలు ఏర్పర్చి నిర్బంధ పాఠశాల విద్యపై తెగ ప్రచారం చేసుకుంటున్నాయి. మరో వైపు విద్యావకాశాలకు ఇన్నాళ్లుగా నోచుకోలేకపోయిన ఆదివాసీ గ్రామాలలో ప్రజా ప్రభుత్వాలు తమ పిల్లలకు తమ ఖర్చులతోనే విద్య నేర్పిస్తుంటే భద్రతా బలగాలు ఆ పాఠశాలలను బుగ్గిపాలు చేస్తున్నాయి. వర్గాతీతమైన చర్య ఏదీ ఉండదనీ, బూర్జువాలు నిర్దాక్షిణ్యంగానే 'సర్వం ధ్వంసం' చేస్తారనీ పదే పదే నిరూపిస్తున్నారు.

జనతన స్కూల్‌లలో శాస్త్రీయ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టారు. ఒకటో తరగతి నుంచీ ఏడవ తరగతి వరకూ తమ పాఠ్యాంశాలను వారు తయారుచేసుకున్నారు. స్వార్థం, లాభాపేక్షను పిల్లల మెదళ్లలో పెంచి పోషించే గణితం, చిన్నరుల మెదళ్ళను గందరగోళ పరిచే చిల్లికుండ లెక్కలు ఆ పాఠ్యాంశాలలో లేవు. మూఢ నమ్మకాలను పిల్లల మెదళ్ళలో కూరే పాఠాలు చెప్పరక్కడ. అ అంటే అమ్మ, అడవి అని బోధిస్తారు. ఆదివాసీలకు అడవి తల్లితో సమానం కదా! చంద్రునిలో ముసలావిడ రాట్నం అనే కథలు బోధించడం ఆ పిల్లల ఊహలకే అందదు. దోపిడీని ఎదుర్కోవడం, మనుషులను ప్రేమించడం, శ్రమను గౌరవించడం, ప్రజల సంస్కృతిని కాపాడడం ఆ పాఠశాలలో పిల్లలకు బోధిస్తారు. దోపిడీ ప్రభుత్వాల పాఠశాలలకు ఉపాధ్యాయులు క్రమం తప్పకుండా రావాలనీ, వారి కనీస అవసరాలు జనతన సర్కార్లు తప్పక పట్టించుకొని తీరుస్తాయనీ తరచుగా ఎన్ని విజ్ఞప్తులు చేస్తున్నప్పటికీ ఫలితాలు మాత్రం ఆశాజనకంగా లేవు.

మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలలోని పాఠశాలలకు ఉపాధ్యాయులు రాకపోవడాన్ని మాజీ దేశ వ్యవహారాల మంత్రి చిదంబరం సమర్థించడం దేశంలోని హక్కుల సంఘాల వారికైనా తప్పక గుర్తుండే ఉండాలి. నిజానికి ఆయన ఉద్దేశం ఆదివాసీ పిల్లలకు విద్య దూరం చేయడమే! ఆయన హయాంలో మొదలై ఇప్పటి వరకు మాడ్ కొండలపై ఉన్న అనేక పాఠశాలలను పోలీసు క్యాంపుల వద్దకు తరలించి గ్రామాల్లో పాఠశాలలు మూయించారు. పోలీసులే వెళ్ళలేని మావోయిస్టు ప్రాంతాలకు, నిరాయుధ ఉపాధ్యాయులు ఎలా వెళ్ళగలరంటూ విదేశాల్లో విద్యనభ్యసించిన మంత్రివర్యులు ప్రశ్నించడం గుర్తొస్తే 'చదివేస్తే ఉన్న మతి పోయిందన్న' నానుడి ఇలాంటి వారి కోసమే పుట్టిందనిపిస్తోంది. ఈ దేశ కాకీల కళ్ళకు ఉద్యోగులు, ఉపాధ్యాయులు, రైతులు, పిల్లలు, మహిళలు, వృద్ధులు, వ్యాపారస్థులు, విద్యార్థులు, పాత్రికేయులు అనే తేడా లేకుండా అంతా మావోయిస్టులుగానే అగుపడతుంటారు. కాబట్టి అందరూ నేరస్థులే. కానీ జనతన సర్కార్ల దృష్టికోణం ఆయనకు చచ్చినా బోధపడదు. దోపిడీ వర్గాల ఆయుధం వారి రాజకీయాలను నడిపిస్తూంటే మావోయిస్టుల రాజకీయాలు మర తుపాకులను నడిపిస్తాయన్న మౌలిక తేడా ఏ బూర్జువా రాజకీయ నాయకుడి మెదడుకు ఎక్కదు!

ఆదివాసీ ప్రజల ఆరోగ్యాల విషయాన్ని వారికి జనతన సర్కార్లు అందిస్తున్న చికిత్సను కూడా తెలుసుకోవడం అవసరం. ప్రజల్లో జనతన డాక్టర్లు అందిస్తున్న అందిస్తున్న సేవలతో వారు నిజంగా చాలా పాపులర్ అయ్యారు. పోలీసులు కొనసాగిస్తున్న భారీ దాడుల మధ్య ప్రజల వైద్యం కోసం మందులువారికి లభించడం ఎంతో దుర్భరంగా ఉంది. ముఖ్యంగా వర్షాకాలంలో కలరా లాంటి అంటు వ్యాధులు తీవ్రంగా వ్యాపిస్తుంటాయి. యావత్ దండకారణ్యం తీవ్రమైన మలేరియా విష జ్వరాలతో పీడింపబడుతున్న ప్రాంతం. గతంలో మలేరియాలోని ఒక రకమైన వైవాక్స్ జ్వరాలు ఎక్కువ ప్రబలేవి. కానీ ఈ మధ్యకొంత కాలంగా మరో రకమైన మలేరియా

ఫాల్సిఫరం జ్వరాలు ఎక్కువవుతూ ప్రాణాంతకంగా మారుతున్నాయి. 2013లో కలరా వ్యాప్తితో వందల సంఖ్యలోనే ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ప్రభుత్వాలు చికెన్ పాక్స్ సమస్య సమసిపోయిందని గొప్పగా ప్రచారం చేసుకుంటాయి. కానీ లోతట్టు ప్రాంతాలకు ఏ ప్రభుత్వ వైద్యుడూ రాడే! అవి ఎలా లేకుండా పోతాయి? చిన్న పిల్లల మరణాలు కూడా అధిక సంఖ్యలోనే ఉంటున్నాయి. వివిధ కారణాలతో అకాల మరణాలు సంభవిస్తున్నాయి. అయితే చాలా వరకు సాధారణ మందులు దొరికితే, రోగులకు చికిత్స చేసి ఎంతో మందిని బతికించుకోవచ్చు. కానీ పోలీసు దాడుల మధ్య క్లోరోక్విన్ మాత్రలు సంపాదించుకోవడమే దిన దిన గండంగా మారుతోంది. ప్రభుత్వ డాక్టర్లు చాలా వరకూ పోలీసులు ఉండే చోటికి పరిమితమై గ్రామాల్లోకి రావడం, ప్రజలకు చికిత్స చేయడం అంటూ చాలా అరుదుగానే ఉంటుంది. అంటు వ్యాధులు ప్రబలి, పెద్దెత్తున మరణాలు సంభవించి, ఆరోపణలు, ప్రత్యారోపణలతో రాజకీయ పార్టీల మధ్య జరిగే వాగ్వివాదం మీడియా కెక్కినపుడు మాత్రం వైద్యుల సంచలనం ఉంటుంది. అలాంటివేవీ లేనపుడు వైద్య అధికారుల అడ్రసే ఉండదు. వారి సిబ్బంది సైతం అగుపడదు. ప్రజలు, విప్లవ పార్టీ, జనతన సర్కార్లు వైద్యులకు, వారి సిబ్బందికి గ్రామలకు వచ్చి చికిత్స చేయాలని ఎన్ని విజ్ఞప్తులు చేసినా చెవిటి వాడి ముందు శంఖం ఊదినట్టే ఉంటుంది. ఇలాంటి చోట ప్రజల ప్రాణాలకు ఉన్నంతలో చికిత్స చేయడం జనతన సర్కార్ల వైద్య విభాగం విధిగానే ఉంది. వారు వైద్యం అందిస్తున్న కొన్ని ఆర్‌పీసీల 2014 వివరాలు ఇలా ఉన్నాయి.

రావుగాట్ ఏరియా జనతన సర్కార్ అందించిన వివరాల ప్రకారం మలేరియా సోకిన 877 మందికి (పురుషులు-470, స్త్రీలు-64, బాలురు-145, బాలికలు-198), వాంతులు-విరేచనాలతో బాధపడుతున్న 622 మంది, కడుపు నొప్పులతో ఉన్న 114 మంది, నడుం నొప్పితో బాధపడేవారు 155 మందికి జనతన డాక్టర్లు వైద్యం చేసారు.

భామ్రాగడ్-గట్ట ఏఆర్‌పీసీ వారు అందించిన వివరాలు ఇలా ఉన్నాయి. 2013-14లలో 2 వేల 422 మందికి, జనతన డాక్టర్లు వైద్యం చేసారు. గ్రామీణ వైద్యులు తమతో చికిత్స కాని రెండు సీరియస్ కేసులను తమ ఖర్చులపైనే బయటి వైద్యానికి పంపారు.

గంగలూరు, భైరంగఢ్‌లలో 2013లో జనతన డాక్టర్లు కలరా సోకిన వందలాది మందికి వైద్యం చేసి బతికించారు. వైద్య టీంలను పోలీసులు ఓ పక్క వెంటాడుతుండగా పీఎల్‌జీఏ గెరిల్లాలు రక్షణ కల్పిస్తూ ప్రజలకు చికిత్స జరిగేలా చూసారు.

శత్రు దాడులు తీవ్రంగా జరుగుతున్న ప్రాంతాల్లో బయటి నుంచి ఔషధాలు తెచ్చుకోవడం ఎంతో గగనమవుతున్న పరిస్థితులలో కొన్ని జనతన సర్కార్లు, కొందరు గెరిల్లాలు ప్రజల్లో చాలా ప్రచలితమై ఉన్న వనమూలికలను, ఔషధ మొక్కలను తెలుసుకుంటూ సంప్రదాయ వైద్యాన్ని నేర్చుకోవడంపై శ్రద్ధ పెడుతున్నారు. 'గెరిల్లలతో గెరిల్లాలుగా పోరాడాలనే' నినాదం చేపట్టి కరుడు గట్టిన కమాండోలను తయారు చేస్తున్న దోపిడీ పాలకవర్గాలు వారి ప్రాణాలను మాత్రం గాలికి వదిలేస్తున్నది. సరండా అడవుల నుంచి దండకారణ్య అడవుల వరకూ ఎందరెందరో కమాండోలు వివిధ రకాల జబ్బుల పాలవుతూ మృత్యువాత పడుతున్నారు. గ్రీన్‌హంట్ దాడులు ప్రారంభమయ్యాక 2009-14 మధ్య గెరిల్లాలతో జరిగిన ఎదురు కాల్పుల్లో 252 మంది కేంద్ర అర్ధ సైనిక బలగాలు మృతి చెందితే అంతకు ఎన్నో రెట్లు అదనంగా 2,270 మంది జబ్బులతో చనిపోయారు. వీరిలో 207 మంది ఆత్మహత్యలకు పాల్పడిన వారు ఉండగా, మలేరియా పీడితులు 102 మంది ప్రాణం విడిచారు. రోగగ్రస్తులలో 153 మంది ఎయిడ్స్/హెచ్ఐవీతో మరణించడం చూస్తే చాలా ఆందోళన కలిగిస్తుంది. పోలీసులలో ఇంత పెద్దెత్తున ప్రబలి ఉన్న హెచ్ఐవీ, వారు స్థానిక ఆదివాసీ మహిళలపై జరిపే సామూహిక అత్యాచారాలతో ఎంత భయంకరంగా వ్యాపిస్తుందన్నదే ఆందోళన కలిగించే విషయం. పోలీసు కమాండోల ప్రాణాలంటే దోపిడీ పాలక వర్గాలకు గడ్డి పోచతో సమానం. సకాలంలో వారికి వైద్య సౌకర్యాలు కల్పించడం లేదన్నది వారి ప్రయాణానికి హెలికాప్టర్లను పంపడం లేదన్నది జగద్విదితమే. పోలీసు ఉన్నతాధికారుల తీవ్ర నిర్లక్ష్యంతో 2014 అక్టోబర్ 18 నాడు సుక్మా జిల్లాలో శివ కుమార్ అనే కమాండో మరణించాడు. సకాలంలో హెలికాప్టర్ పంపితే ఆయన బతికేవాడేమోనన్న వాదనతో కమాండోలు పత్రికలకెక్కారు.

దోపిడీ పాలక వర్గాలకు కావల్సింది లాభాలు, వారి రక్షణ కోసం పోలీసుల సేవలే తప్ప వారి బాగోగులు ఎలా ఉంటే ఏంటనేది మీడియా అందిస్తున్న సమాచారాన్ని బట్టి తెలుస్తోంది. దీని ద్వారా నైనా పోలీసులు దోపిడీ పాలక వర్గాల స్వభావాన్ని అర్థం చేసుకుంటారని, 'పోలీసులారా మీరూ పేదలే, ఖాకీ డ్రెస్సులు వేసుకున్న రైతు కూలీల పిల్లలే'నంటూ విప్లవ పార్టీ చెప్పే సత్యాన్ని అర్థం చేసుకుంటారని ఆశిద్దాం! విప్లవ పార్టీ చేపట్టిన వ్యూహాత్మక ప్రచారంలో భాగంగా ఉద్యమ ప్రాంతాలలో తరచుగా జనతన డాక్టర్లు పోలీసులకు విజ్ఞప్తులు చేస్తున్నారు.

దండకారణ్య ప్రాంతంలో ఉన్న 'సికిల్ సెల్' వ్యాధి మూలంగా వ్యాధిగ్రస్తులు అర్థాంతరంగా జీవితాలను చాలిస్తుంటారు. ఆ వ్యాధికి ఇప్పటి వరకూ ఎలాంటి చికిత్సను, శాశ్వత నివారణోపాయాలను ఏ ప్రభుత్వం చేపట్టలేదు. ఆదివాసీ ప్రాంతాల వనరుల దోపిడే తప్ప ప్రజల బాగోగులను పట్టించుకునే వారు కారు కదా మన పాలకులు! అయితే ప్రధానిమోదీ ఈ వ్యాధి నివారణను కూడా మేక్-ఇన్-ఇండాయాతో జోడించి జపాన్ వారి ముందు సికిల్ సెల్ .వ్యాధి నివారణ మందులను తయారు చేయాలని కోరాడు. అంటే, మన దేశంలోని చేతకాని ప్రభుత్వాలు ప్రజల ఆరోగ్యాలను సైతం వ్యాపారానికి వదులుతున్నాయి. ఇప్పటికే ఈ దేశంలో బిఎమ్‌జీఎఫ్ (బిల్ అండ్ మిలిందా గేట్స్ ఫౌండేషన్) వారు ఆరోగ్య రంగంలో అనేక 'స్వచ్ఛంద' సంస్థలను ప్రమోట్ చేసి ప్రజల, ముఖ్యంగా మహిళల జీవితాలతో చెలగాటమాడుతున్నాయి. రేపు తన పదవీకాలం ముగిసాక ఒబామా దంపదులు సైతం భారతదేశంతో సహా ఆఫ్రికా దేశాల్లో ఆరోగ్యరంగంలో ఇలాంటి సంస్థల ప్రమోటర్స్‌గా రానున్నట్టు స్పష్టంగానే 'గణతంత్ర' దినాన 'మనసులోని మాట'ను బయటపెట్టాడు. వీరికి ప్రజల అనారోగ్యాలు సైతం వ్యాపారమే. ప్రజలను ఆకలికి మాడుస్తూ, అనారోగ్యాలకు గురిచేస్తూ రోగగ్రస్త వ్యవస్థను పెంచి పోషించడాన్ని సైతం ప్రజా ఆరోగ్య వ్యవస్థ విప్లవోద్యమంలో భాగంగా సరిదిద్దాల్సి ఉంది.

ఇక జనతన న్యాయ విభాగాన్ని చూద్దాం! జనతన సర్కార్లలోని న్యాయ విభాగం ముఖ్యమైన విభాగాల్లో మరొకటి. ఇది అన్ని వర్గాల ప్రజల జీవితాలతో సంబంధంలో ఉంటుంది. న్యాయ విభాగాన్ని చూడడానికి చాలా వరకు జీవితానుభవం ఉండి, ప్రజల ఆచార వ్యవహారాలతో లోతైన సంబంధం, అవగాహన కలిగి ఉండి, పునాది వర్గాలకు చెందిన వారిలో నుండే బాధ్యులుగా ఎంపికవుతారు. వారు విప్లవ రాజకీయ విషయంలో కూడా సాపేక్షికంగా మెరుగైన అవగాహన ఉన్న వారై ఉంటారు. గెరిల్లా బేసులలోని ప్రజలు తమ సమస్యలు ఎంత తీవ్రమైనవి అయినప్పటికీ, సంక్లిష్టమైనవైనప్పటికీ జనతన సర్కార్ల న్యాయ విభాగాల ద్వారానే పరిష్కరించుకుంటున్నారు. ఇక్కడ కుత్సితమైన నిచ్చెన మెట్ల కుల వ్యవస్థ లేప్పటికీ, తెగల మధ్య అంతరాలున్నాయి. వీటిని రెచ్చగొట్టడానికి దోపిడీ వర్గాలు సల్వాజుడుం కాలంలో అనేక కుట్రలు పన్నాయి. కానీ జనతన సర్కార్లు అందుకు వ్యతిరేకంగా ప్రజల్లో సమైక్యతను నిలబెట్టాయి. మతాల మధ్య ఘర్షణలను, 'ఘర్‌వాపసీ' పేరుతో బీజేపీ ప్రభుత్వం ముందుకు తెస్తున్న జనతన సర్కార్లు సాగనివ్వడం లేదు. స్త్రీలపై పోలీసులు చేసే అత్యాచారాలు తప్ప ఇతరత్రా అత్యాచారాలు లేవనే చెప్పవచ్చును. స్త్రీ-పురుషుల నిష్పత్తిలో ఇక్కడ సమతుల్యం ఉంది. ప్రజలు తాము స్థానిక వర్గ శత్రువులతో, తెగ పెద్దలతో ఎదుర్కొనే సమస్యలైనా ప్రజా కోర్టుల ముందుకే తెస్తుంటారు. వారికి దోపిడీ ప్రభుత్వాల అటవీ శాఖ వారితో కానీ, రెవెన్యూ శాఖ వారితో గానీ, తుదకు పోలీసు శాఖతో గానీ ఎదురయ్యే సమస్యలను ఎదుర్కోవడంలో ప్రజలు జనతన సర్కార్ల సలహాలు సూచనల మేరకే నడుచుకుంటారు. ఫలితంగా గెరిల్లా బేసులలో ఎక్కడా తమ వ్యాజ్యాల పరిష్కారానికి పోలీసు స్టేషన్లకు, బూర్జువా కోర్టులకు వెళ్ళడం లేదన్నది ఆయా ప్రాంతాల బూర్జువా కోర్టుల రికార్డులను చూస్తే ఎవరికైనా స్పష్టంగానే బోధపడుతుంది. ఈ మధ్యే 40 ఏండ్ల తర్వాత తీర్పు వెలువడిన మాజీ రైల్వే మంత్రి ఎల్ఎన్ మిశ్రా కేసు సందర్భంగా మరోమారు దేశవ్యాప్తంగా కోర్టులలో పెండింగ్‌లో ఉన్న కేసుల చర్చ విస్తృతంగా జరిగింది. ఈ దేశంలోని కోర్టులలో దాదాపు మూడు కోట్ల కేసులు మూలుగుతున్నాయని, నక్సలైట్ల విస్తరణకు ఇది కూడా తోడ్పడుతుందని న్యాయ కోవిదులే సెలవిచ్చారంటే, ఈ దేశంలో ఎవరికి వారే ఆయా రంగాలు, సెక్షన్ల సమస్యల పరిష్కారానికి నక్సలిజమే తుది పరిష్కారంగా చూపుతున్నారు. ఇది అక్షరాల నిజం. దేశ మాజీ ప్రధాని మన్‌మోహన్ సింగ్ నక్సలిజంను వైరస్ అన్నాడు. కానీ నిజానికి అది ఒక పరిష్కారం, రోగ నివారణకు సరైన ఆలోచనా విధానం అది. వర్తమాన ప్రధాని నక్సలైట్లను అడవుల్లో ఉండే అరాచకులు అంటున్నాడు. కానీ సమస్త సామాజిక రుగ్మతలకు, దోపిడీ పాలకవర్గాల అంతానికి వారిదే ఏకైక పరిష్కార మార్గం. సమస్య సృష్టికర్తలు దోపిడీ పాలకవర్గాలు కాగా వాటిని మావోయిస్టులు పరిష్కరిస్తున్నారు.

జనతన సర్కార్లు ఒకవైపు పోలీసు దాడులను ఎదుర్కొంటూ మరోవైపు దోపిడీ పాలకవర్గాలు తీవ్రంగా కొనసాగిస్తున్న కుట్రలను, కుహకాలను ఎదుర్కోవలసి వస్తోంది. పోలీసు దాడులను ఎదుర్కోవడంలో వారికి ప్రత్యక్షంగా తలపడడం తప్ప మరేం సమస్య లేదు. కానీ తీపి గుళికల్లాంటి కుహనా సంస్కరణలను అర్థం చేసుకొని వాటితో వ్యవహరించడంలో అనేక ఇబ్బందులు ఎదురవుతున్నాయి. జనతన సర్కార్లను దెబ్బతీయడానికి గ్రామంలో అధికారం కోల్పోయిన వర్గాలు ప్రజల్లో చీలికలను సృష్టిస్తున్నారు. ప్రభుత్వ సంస్కరణల ద్వారా, పుట్టగొడుగుల్లా పుట్టుకు వస్తున్న ఎన్‌జీఓల ద్వారా నూతనంగా ముందుకు వస్తున్న ఒక సెక్షన్ ఆర్థికంగా బలపడుతూ ప్రజలను విప్లవోద్యమం నుంచి దూరం చేయడానికి తీవ్రంగానే ప్రయత్నిస్తున్నాయి. వీరి ప్రయత్నాలన్నీ చాప కింది నీరులా సాగుతున్నాయి. గ్రామీణ యువత విప్లవోద్యమం వైపు వెళ్ళకుండా చేయడానికి ప్రభుత్వాలు డబ్బులను ఎగజిమ్ముతున్నాయి. ఎన్నెన్నో పథకాలను ప్రవేశ పెడుతున్నాయి. ప్రతి పథకం ప్రజల మేలు కోరి వారి అభివృద్ధి కోసమేనంటూ తెగనమ్మించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. విప్లవోద్యమాన్ని లోపలి నుంచి దెబ్బ తీయడానికి ఆదివాసీ సంప్రదాయాలను, సంబంధాలను, మోసపూరిత చట్టాలను విరివిగా ఉపయోగించుకుంటున్నాయి. రావ్‌ఘాట్ రైల్వే లైన్ ప్రజల అభివృద్ధి కోసమే అంటారు. పల్లెమాడిలో గనుల తవ్వకం ఆ ప్రాంతవాసుల వికాసం కోసం అంటారు. ఆముదాయిమెట్టలో, లోహండిగూడలో, సూర్జగఢ్‌లో, దమ్‌కోడిలో ఎక్కడైనా గనుల తవ్వకం అక్కడి ప్రజలను, ఆ ప్రాంతాలన్ని అభివృద్ధి చేయడానికే అంటారు. తుదకు దండకారణ్య నడిబొడ్డున ఉన్న మాడ్‌కొండల్లో గానీ, అటు తూర్పున ఝార్ఖండ్‌లోని సరండా అడవుల్లోగాని సైనిక శిక్షణా కేంద్రాల ఏర్పాటు కూడా ప్రజల అభివృద్ధి కోసమేనంటూ చేస్తున్న ప్రచారంలోని మోసాన్ని, ద్రోహాన్ని అర్థం చేసుకొని, వాటితో వ్యవహరించడంలో సరైన అవగాహన, చాకచక్యత లేని చోట ప్రజలు నష్టపోతున్నారు. దేశ ప్రధాని మోదీ మేక్ ఇన్ ఇండియా తరహాలోనే ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ మేక్ ఇన్ ఛత్తీస్‌గఢ్ మొదలుపెట్టాడు. మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్ 10 రోజులలో పెట్టుబడులకు అన్ని రకాల అనుమతులిచ్చి సహకరిస్తామని ప్రకటిస్తున్నాడు. వీరంతా గోముఖ వ్యాఘ్రాలు. దేశ ప్రధాని కానీ, రాష్ట్రాల ముఖ్యమంత్రులు గానీ పెట్టుబడిదార్ల ప్రయోజనాలను నెరవేర్చడానికే పూర్తిగా అంకితమయ్యారు. ఎందుకంటే ఈ దేశంలో కానీ, ఏ దేశంలోనైనా కానీ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పరమార్థమే అది. మన దేశంలో 16వ లోక్‌సభ ఎన్నికలలో 50 వేల కోట్లు ఖర్చయ్యాయని వార్తలు రాస్తున్నారు. అందులో అధికారికంగా దేశంలోని దళారీ పెట్టుబడిదార్లు ఇచ్చిన మొత్తాలను కూడా ఉటంకిస్తూ రాస్తున్నారు. ఉదాహరణకి కొన్ని: ఆదిత్య బిర్లా కాంగ్రెస్‌కు 36.40 కోట్లు, భాజపాకి 26.60 కోట్లు, టొరెంటో పవర్ కాంగ్రెస్‌కు 8.90 కోట్లు, భాజపాకి 15 కోట్లు, టాటా గ్రూపు కాంగ్రెస్‌కు 10 కోట్లు, భాజపాకు 6.90 కోట్లు, వేదాంత వారు కాంగ్రెస్‌కు 6 కోట్లు, భాజపాకు 9 కోట్లు, వీడియోకాన్ కాంగ్రెస్‌కు 4.30 కోట్లు, భాజపాకు 6.30 కోట్లు ఇచ్చారు. ఇంకా రిలియన్స్, అదానీ లాంటి వాళ్ళ లెక్కలు మరీ పెద్ద సంఖ్యలోనే ఉండాలి. ఫోర్బ్స్ పత్రిక ప్రకారం విశ్వ కుబేరులలో అద్వానీ 260వ వాడిగా ఉన్నాడు. మోదీ అధికారంలోకి వచ్చాక ఈ నెంబర్ మారింది. ఈ దళారీ నిరంకుశ పెట్టుబడిదార్లు రెండు పార్టీలకు 'చందాలు' ఇచ్చారు. అలాంటప్పుడు ఏ పార్టీ గెలిచినా వారి ప్రయోజనాలను నెరవేర్చాల్సిందే! అందుకు దేశ సంపదలను

వారికి అప్పగించాల్సిందే! అందుకు వారు ఎంతటి ఫాసిజానికైనా దిగుతారు. మరో వైపు భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) తాను విప్లవోద్యమ నిర్వహణకు సేకరించుకునే నిధులలో 10 శాతం జనతన సర్కార్లకు వెచ్చించాలని నిర్ణయించుకుంది. అంటే మేక్ ఇన్ ఇండియా ప్రజా వినాశనానికి పూనుకుంటుంటే, జనతన సర్కార్లు ప్రజా ప్రయోజనాలకు అంకితమయ్యాయని ఈ రకంగా కూడా తెలుసుకోవచ్చు. అయితే ఏది అర్థం చేసుకోవాలన్నా వర్గ దృష్టి, ప్రజా హితం, ప్రజల పక్షపాతిగా ఉండాల్సిందే. దోపిడీ వర్గాల దోపిడీ స్వభావం తెల్సుకొని వ్యవహరించడం జనతన సర్కార్ల అస్తిత్వంతో ముడిపడిన విషయంగా మారతోంది.

జనతన సర్కార్లు చాలా ప్రాథమిక స్థాయిలో ఉన్నాయి. అవి నూతనంగా ఆవిర్భవిస్తున్నాయి. అవి ప్రగతిశీలమైనవి. అవి దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా దృఢంగా పోరాడుతున్నాయి. అవ ప్రజల బలంపైన ఆధారపడి పని చేస్తున్నాయి. అవి ప్రజల కోసమే, ప్రజల మధ్య పని చేస్తున్నాయి. అవి ప్రజల అన్ని రకాల సమస్యలను చేపడుతున్నాయి. అయినప్పటికీ వాటి కార్యాచరణలో దోపిడీ పాలక వర్గాలు రుద్దిన యుద్ధాన్ని ఎదుర్కోవడమే ప్రధాన కర్తవ్యంగా మారింది. శత్రు సైనికులు బూటకపు ఎన్‌కౌంటర్లలో హతమారుస్తున్న శవాల స్వాధీనానికీ, అరెస్టు చేసిన వారిని విడిపించుకోవడానికి కూడా అవి పోరాడాల్సి వస్తోంది.. అవి అన్ని రంగాలలో పోరాడుతూ జీవిస్తున్నాయి. వాటిని ఆదుకోవాలి. వాటికి అండగా నిలవాలి. అవి పీడిత ప్రజారాశులకు చెందినవి. వాటిని కాపాడుకోవడానికి మనమంతా సమైక్యంగా నిలబడుదామని విద్యార్థులకు, మేధావులకు, ప్రజాస్వామిక వాదులకు, రచయితలకు, పాత్రికేయులకు సమస్త జనులకు విజ్ఞప్తి!

ముగింపు : కామ్రేడ్స్, మిత్రులారా! దండకారణ్యంపై మున్నెన్నటికన్నా దోపిడీ ప్రభుత్వ వర్గాల దాడి తీవ్రమైంది. వారి దాడి లక్ష్యం విప్లవోద్యమాన్ని అంతమొందించడమే. దేశంలోనే అధికమైన సైనిక కేంద్రీకరణ ప్రాంతంగా దండకారణ్యం ముఖ్యంగా ఛత్తీస్‌గఢ్‌లోని బస్తర్ ఇప్పుడు నిలిచింది. అక్కడ రోజూ ఎన్‌కౌంటర్లు, బూటకపు ఎన్‌కౌంటర్లు, అత్యాచారాలు, అరెస్టులు, దొమ్మీలు, ఇండ్లు-పంటలు తగులబెట్టడం లాంటి అనేక దుశ్చర్యలు వినబడుతూనే ఉంటాయి. ఆ ప్రాంతమతా పోలీసుల ఇనుప పదఘట్టనల కింద నలిగిపోతోంది. మావోయిస్టు నేతల తలలకే కాదు విప్లవ ప్రజా సంఘాల కార్యకర్తలను పట్టుకొని 'ఇనామీ నక్సల్స్' అంటూ అప్పటికప్పుడు తమకు తోచిన వెల ప్రకటిస్తున్నారు. ఇంతే కాదు, సంతలో దొరికే సాధారణ రైతు స్త్రీ-పురుషులను కూడా ఇనామీ నక్సల్స్‌గా వారు ప్రటిస్తున్నారు. తాజాగా 'గణతంత్ర దినం' నాడు మహారాష్ట్ర-ఛత్తీస్‌గఢ్ సరిహద్దులో నున్న బీనగుండలో వందలాది మంది సి-60 కమాండో పోలీసులు, తమ చిత్తానుసారంగా జరిపిన కాల్పులే ఊరి వాళ్ళను నిద్ర లేపాయి. పట్టుమని పాతిక ఇళ్లు సైతం లేని ఆ కుగ్రామంలో స్త్రీ-పురుషులంతా పోలీసు కాల్పులతో భీతిల్లిపోయారు. ఏం జరుగుతోందో తెలియని స్థితి. ఊళ్ళోని ఏ ఒక్కరినీ బయటకి పోనీయకుండా బంధించారు. పోలీసు కమాండో అధికారి ఊరి పాఠశాలలో మువ్వన్నెల జెండా ఎగురవేసి 25 ఏళ్ళ తర్వాత ఎగురుతున్న జెండా అని మురిసిపోయాడు! ఇది భారత గణతంత్రం. సరిగ్గా ఢిల్లీలో ప్రపంచ ప్రజల నెంబర్ వన్ శత్రువు ఒబామాకు ఓవైపు స్వాగతం చెప్తూతూ భద్రతా బలగాలు నిస్సిగ్గుగా తలలు వంచి వందనాలు చేస్తూ (గార్డు ఆఫ్ ఆనర్) తమ దేశ వాసులను, మారుమూల పల్లె బీనగుండలో నిరుపేద ఆదివాసీలను తుపాకి కాల్పులతో భయభ్రాంతులను చేయడం అంటే దేవ బలగాలు ఎవరి సేవలకు, ఎవరి రక్షణకు అంకితమయ్యాయో ఆలోచించండి. ఇదేం గణతంత్రమో ఆలోచించండి. అంతకు మరో నెల రోజుల ముందు గడ్చిరోలి జిల్లాలోని నాదెకల్ గ్రామస్తుల సమక్షంలోనే ఓ కానిస్టేబుల్ తనపై తానే కాల్పులు జరుపుకొని మావోయిస్టులతో ఎదురుకాల్పులు అని అచ్చం బీనగుండలాగే కట్టుకథలు సృష్టించారు. ఇలాంటి కథలు బోలెడు! ఈ కథలను మించిన కల్పితాలు లొంగుబాట్లు. రోజూ లొంగుబాట్లు వార్తలు మీడియాలో వస్తుంటాయి. అంతా ఇనామి మావోయిస్టులే! కేంద్రం గతం కన్నా ఐదు రెట్లు విప్లవకారుల తలల విలువ పెంచాక పోలీసు ఉన్నతాధికారులు డబ్బు కక్కుర్తితో అనేక లొంగుబాటు కేసులను సృష్టిస్తున్నారు. బస్తర్ ఐ.జీ. కల్లూరి ఇలాంటి వాటన్నింటికీ మాస్టర్ మైండ్‌గా ఉన్నాడు. ఈ లొంగుబాట్లపై స్థానిక రాజకీయ నాయకులు, పార్టీలు, ప్రజలు పోలీసు కల్పితాలను బట్టబయలు చేస్తూ అనేక వాస్తవాలను ముందుకు తెస్తున్నారు. ఉద్యమం నుంచి దిగజారిపోతున్న శక్తులను కీర్తిస్తూ గ్రామాల్లో ఖాకీలు జరిపే ప్రచార సభలు, పంచే ప్రచార సాహిత్యం లెక్కేలేదు. అందులోనూ దిగజారిన శక్తులతో అవాకులు, చవాకులను గుప్పిస్తుంటారు. ప్రభుత్వం, పాలక వర్గాలు కొనసాగిస్తున్న బహుముఖ దాడి లక్ష్యం దేశంలోని కొన్ని ప్రాంతాలలో పురుడుపోసుకుంటున్న ప్రజల ప్రత్యామ్నాయ రాజ్యాధికార వ్యవస్థను రూపుమాపడమే. ఇందుకు గానూ దోపిడీ వర్గాల సేవకే అంకితమైన దేశ ప్రధాని నరేంద్ర మోదీ నుంచి పల్లెలలోని దోపిడీ, ప్రజా వ్యతిరేక శక్తుల వరకు అన్ని విధాలా సామ, దాన, భేద, దండోపాయాలు ప్రయత్నిస్తున్నాయి. వీరి ప్రయత్నాలను జనతన సర్కార్లు తమ శక్తి మేరకు అడ్డుకుంటుంటే దోపిడీ పాలకవర్గాల భద్రతా బలగాలు సైని దాడులను ముమ్మరం చేసాయి. వీటిని ఎదుర్కోకుండా ప్రజల రాజ్యాధికారాన్ని, ప్రజాతంత్రాన్ని నిలుపుకోలేమని ప్రజల సైన్యం-పీఎల్‌జీఏ- ప్రజాయుద్ధం ద్వారా తొంగ్‌పాల్‌లకు, కసాల్‌పాడ్‌లకు, ముర్మురీలకు, మర్పుకోలాలకు, పర్లకోట్‌లకు, పఖంజుర్‌లకు తలపడక తప్పడం లేదు. ప్రతిఘటన లేకుండా, ప్రజాయుద్ధం లేకుండా ప్రత్యామ్నాయ రాజ్యాధికార వ్యవస్థను నిలబెట్టుకోలేమని, కాపాడుకోలేమని, విస్తరించుకోలేమనే చారిత్రక సత్యం మరోమారీ స్పష్టమవుతోంది. మీరూ ఆలోచించండి. మీరు ప్రజల పక్షం నిలవాలనీ, నిలుస్తారనీ, ఈ దేశ సంపదలను కాపాడుకోవడానికీ, దేశ సార్వభౌమాధికారాన్నీ, దేశ స్వతంత్రతనూ, దేశంలో నిజమైన ప్రజల ప్రజాస్వామ్యాన్నీ నిలబెట్టుకోవడానికి జరుగుతున్న ప్రజాయుద్ధం వెంట ఉంటారని విశ్వసిస్తున్నాం. ఈ దేశం మనది. దీనిని కాపాడుకోవల్సింది మనమే! అందుకు ఎంతటి మూల్యాన్నయినా చెల్లిద్దాం. విజయం వైపు అడుగులు వేద్దాం!

(అయిపోయింది)



# కా. సూర్యం స్ఫూర్తిని కొనసాగిద్దాం

- వై.వి.

ప్రకాశం జిల్లా, కొరిశపాడు గ్రామంలో 1992 జూలై 31న కా. సూర్యం మధ్య తరగతి రజక, విప్లవ రాజకీయాలు కలిగిన కా. కొప్పర్తి సుబ్బయ్య రత్తమ్మ దంపతులకు 3వ సంతానంగా జన్మించాడు. జలియన్ వాలాబాగ్ సంఘటనకు కారకుడైన డయ్యర్‌ను ఇంగ్లాండ్‌లో కాల్చి చంపి బ్రిటిష్ సామ్రాజ్యవాదులను గడగడలాడించి ప్రతీకారం తీర్చుకున్న కా. ఉద్ధంసింగ్ అమరుడైన జులై 31న పుట్టి బాల్యం నుండి కా. భగత్‌సింగ్‌లా విప్లవ రాజకీయాలను అలవర్చుకున్నాడు. కా. సూర్యం తండ్రి కా. సుబ్బయ్య పీపుల్స్ వార్ పార్టీ ఆర్గనైజర్ కావటంతో తన అభిప్రాయాలను ఒక మిత్రుడిలా అతనితో పంచుకునేవాడు. విప్లవ వీరుల చరిత్రలు అధ్యయనం నిరంతరం కొనసాగించాడు. ఇంటర్‌మీడియట్ వరకు చదువుకున్న శ్రమను ఏనాడు విడవకుండా కుల వృత్తియైన బట్టలు ఇస్త్రీ చేయటం, తండ్రితో పాటు వ్యవసాయ పనులు చేసి, విద్యార్థులకు శాస్త్రీయ విద్యా విధానం, కావాలని స్కాలర్‌షిప్‌ల కోసం, విద్యార్థుల హక్కుల కోసం ఉద్యమించాడు. బాల్యంలోనే ఓట్ల కోసం వచ్చే రాజకీయ నాయకులను ప్రజలకు మీరు ఏం చేశారో చెప్పాలని నిలదీసాడు. అస్థిత్వ ఉద్యమాలపై తన అవగాహనను వ్యక్తం చేస్తూ వర్గపోరాటం ద్వారానే దోపిడి నిర్మూలన సాధ్యమవుతుందన్నాడు. కా. భగత్‌సింగ్ వర్థంతి నాడు తన గ్రామంలో తోటి విద్యార్థులతో కాగడాల ప్రదర్శన నిర్వహించి కా. భగత్‌సింగ్ ఆశయసాధనకై ఉద్యమిద్దామని ప్రతిన బూనాడు. యువతరం క్లబ్బులకు, పబ్బులకు, క్రికెట్ బెట్టింగులకు, సామ్రాజ్యవాద విషసంస్కృతికి గురౌతున్న దశలో వాటి ప్రభావం తనపై పడకుండా నిరంతరం దండకారణ్య సాహిత్యాన్ని, పోరాటాలను అధ్యయనం చేస్తూ పేదల విముక్తికి విప్లవోద్యమమే మార్గమని భావించాడు. తన తండ్రి విప్లవ కార్యచరణ నుండి వైదొలిగినా, తన మేనత్త, ఆమె భర్త ప్రభుత్వానికి లొంగిపోయినా ఆ ప్రభావం తనపై పడకుండా వారి బలహీనతలు ఎత్తి చూపాడు.

తెలుగు రాష్ట్రాలలో జరిగిన అనేక ఉద్యమాలలో పాల్గొని తన చైతన్యాన్ని పెంచుకున్నాడు. ఖమ్మం జిల్లా చర్లలో గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా జరిగినా ప్రచార క్యాంపెయిన్‌లో, సభ నిర్వహణలో చురుకైన పాత్ర పోషించాడు. కా. భగత్‌సింగ్, ఉద్ధంసింగ్, అల్లూరి సీతారామరాజు. సంస్మరణ సభలు ఎక్కడ జరిగినా పాల్గొని తన అభిప్రాయాలు మొహమాటం లేకుండా చెప్పేవాడు. కా. భగత్‌సింగ్ సంస్మరణ సభలకే పరిమితం కాకుండా ఆయన చేసిన పోరాటాలు చేయాలని సామ్రాజ్యవాద దోపిడి సంస్కృతి మునుపెన్నడూ లేనంత నేడు సమాజంపై ప్రభావం చూపుతుందని తేటతెల్లంగా తన అభిప్రాయాలు వ్యక్తం చేసేవాడు. అందమైన తన రాతలతో ఎన్నో కవితలను అల్లటం అలవర్చుకున్నాడు. ఎందరో తన తోటి విద్యార్థి మిత్రులపై తన ప్రభావాన్ని వేశాడు.

2014 జూన్‌లో ఇంటి నుండి కనిపించకుండా పోయిన కా. సూర్యం సరిగ్గా 12 నెలల అనంతరం ఆంధ్రా, ఒరిస్సా బోర్డర్‌లో ఉన్న విశాఖజిల్లా, ముచంగిపుట్ట మండలం, రంగబయలు అటవీ ప్రాంతంలో 2015 జూన్ 20 ఉదయం 8 గంటల ప్రాంతంలో దళానికి సెంట్రీగా ఉన్న కా. సూర్యంపై 100 మందికి పైగా గ్రౌహైండ్స్, సి.ఆర్.పి.ఎఫ్. బలగాలు ఎలాంటి ముందస్తు హెచ్చరికలు లేకుండా తల పై భాగంపై గురి చూసి కాల్చి చంపి ఎప్పటిలాగే ఎన్‌కౌంటర్ జరిగింది, గుర్తు తెలియని మావోయిస్టు ఒకరు మృతి చెందాడు అని ప్రకటించారు. మృతి చెందిన ఫొటోని విశాఖ జిల్లాకే పరిమితం చేయటం వలన కుటుంబ సభ్యులకు వారం రోజుల వరకు ఈ వార్త తెలియలేదు. జూన్ 24వ తేదీన గుర్తు తెలియని మావోయిస్టుని పాడేరులో పోలీసులు ఖననం చేసినట్లు ప్రకటించారు. జూన్ 27వ తేదీన కా. సూర్యం అమరత్వం చెందినట్లు మావోయిస్టు పార్టీ ప్రకటించటంతో కుటుంబ సభ్యులు, అమరుల బంధుమిత్రుల సంఘం, నాయకులు వెళ్ళి శవాన్ని వెలికి తీసి గుర్తు పట్టలేని విధంగా ఉన్న మాంసం ముద్దను ప్రకాశం జిల్లా కొరిశపాడు గ్రామానికి తెచ్చుకొని జూన్ 28వ తేదీన వందలాది మంది ప్రజలు విప్లవ నినాదాలతో కా. సూర్యం అంత్యక్రియలు జరిపారు. పోలీసు నిర్బంధాన్ని, ఆంక్షలను తెంచుకొని రాష్ట్రవ్యాప్తంగా ఉన్న విప్లవ అభిమానులు పెద్ద ఎత్తున పాల్గొని నివాళులు అర్పించారు.

ప్రభుత్వం కొత్త రాజధాని కోసం సింగపూర్ కంపెనీల వెంట పడుతూ మూడు పంటలు పండే 34 వేల ఎకరాల రైతుల భూములను బలవంతంగా సేకరించి రాజధాని నిర్మాణం చేస్తామని బహుళజాతి కంపెనీలను ఆహ్వానిస్తూ, మరో వైపు ఎర్ర చందనం కూలీలను, మావోయిస్టులను ఎన్‌కౌంటర్ల పేరుతో హత్యలు చేయిస్తూ ఆంధ్ర రాష్ట్రాన్ని పెట్టుబడిదారుల పీస్‌జోన్‌గా చంద్రబాబునాయుడు ప్రకటిస్తున్నాడు. 10 సంవత్సరాల తరువాత అధికారం చేపట్టిన చంద్రబాబు నాయుడు మునుపటి వాసనలు పోకుండా ప్రపంచ బ్యాంకు జీతగాడిగా వ్యవహరిస్తూ, ప్రజా ఉద్యమాలను అణచివేస్తూ ఇదే నవ్యాంధ్రప్రదేశ్ అని వక్కాణిస్తున్నాడు. ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాలలో విప్లవోద్యమం అణచివేతకు గురైనా దండకారణ్య విప్లవోద్యమ ప్రభావం దేశ ప్రజలను ఆకర్షిస్తోంది. కా. సూర్యం, వివేక్‌లాంటి విద్యార్థులు విప్లవోద్యమంలోకి వెళ్ళి అమరత్వం చెంది పాలకులకు సవాల్ విసిరారు. దేశ సహజ వనరులు, ఖనిజాలు, భూములు సామ్రాజ్యవాద కంపెనీలకు అప్పజెప్పటం కోసం విప్లవోద్యమంపై గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో యుద్ధం ప్రకటించి లక్షలాది మంది సైన్యాన్ని ప్రయోగించి అటవీ ప్రాంతాల నుండి ఆదివాసులను ఖాళీ చేయించే ప్రయత్నాలు ఒకవైపు జరుగుతూ ఉంటే, మరోవైపు జనతన సర్కార్‌ను కాపాడుకోవటం కోసం ఆదివాసులు విప్లవోద్యమ నాయకత్వంలో తెగించి పోరాడుతున్నారు. దండకారణ్య విప్లవోద్యమానికి ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు సంఘీభావం ప్రకటిస్తున్నారు.

కా. సూర్యం విద్యార్థి ఉద్యమంలో భాగస్వామియై తన జీవితాన్ని పీడిత ప్రజల విముక్తి కోసం అర్పించాడు. ఉద్యమ జీవితంలో అనేక ఒడిదుడుకులు, ఊగిసలాటలు, మధ్య తరగతి బలహీనతలు పొడ చూపినా విప్లవ చైతన్యంతో వాటిని అధిగమించాడు. విప్లవోద్యమాన్ని బలపరుద్దాం. కా. సూర్యం స్ఫూర్తిని కొనసాగిద్దాం.



# నల్లమల నవల చదివేక...

- భూసారం శివన్న

'నల్లమల' నవల చదవడం ముగించి, గుండెలు బరువెక్కి, వేదనతో చ లాసేపు కదలకుండా బిగుసుకుని ఉండిపోయాను. శాంతక్క అనే ఉద్యమ సజీవ పాత్ర, నవలా రచయిత పి. చంద్ ద్వారా చెప్పిన 419 పేజీల నల్లమల నవలా కథనం విప్లవ మానవుల త్యాగాల చరిత్ర. వీరోచిత ప్రజా గాథ. నూతన ప్రపంచం గురించి, దోపిడీ రహిత సమసమాజ స్థాపన గురించి కలలు గని, సాధారణ ప్రజలు అసాధారణ వీరులుగా, నూతన మానవులుగా, విప్లవ ప్రజా నాయకులుగా రూపాంతరం చెందిన క్రమాన్ని ఈ నవల మనకు చెబుతుంది.

నిండు జీవితాలను, యవ్వనాలను విప్లవోద్యమానికి ధారబోసి, పిన్న వయస్సులోనే మహోన్నత త్యాగాలను ఆవిష్కరించిన ధ్రువతారల అద్భుత గాథల సమాహారం 'నల్లమల' నవల. రక్తసిక్త విప్లవోద్యమం, నల్లమల ప్రకృతి సౌందర్యం, దాని పచ్చని సొబగు, లాలిత్యం, కాఠిన్యం, చెంచు ప్రజల ప్రాకృతిక జీవన విధానం ఓ దృశ్య కావ్యంగా మలచి చెప్పడానికి చేసిన గొప్ప ప్రయత్నం ఈ నవలా రచన.

అరక పట్టడం, తాటి చెట్లెక్కి కల్లు గీయడం, ఇంటిపట్టునో, పొలం గట్టునో పనిచేసుకుంటూ, బుద్ధిగా ఒద్దికగా ఉండటం తప్ప వేరే ప్రపంచం తెలియని ఓ చక్కని చిన్నయ్య విప్లవ పథంలో ఓ మల్లన్నగా, ఓ మాధవ్‌గా, భారత విప్లవ రథసారథుల్లో ఒకరిగా ఎదిగిన వైనాన్ని ఎవరు చెప్పాలి మనకు? ఎలా తెలియాలి మనకు?

ఓ సాధారణ శ్రామిక కుటుంబంలో పుట్టిన మహిళకు అమ్మానాన్నలు ఓ చక్కని చిన్నయ్యున్నాడు పెళ్ళి చేసుకోమంటే బుద్ధిగా ఒప్పుకుని, అతని భార్యగా కాపురానికొచ్చి, కరీంనగర్ రైతాంగ విప్లవ పవనాలు వారి ఇంటిని తాకి, కుటుంబ రూపు రేఖలనే మార్చివేసిన కథనాన్ని ఎవరు చెప్పాలి? ఆ ఉద్విగ్నమైన మార్పుల క్రమం మనకెలా తెలియాలి?

నికార్సైన శ్రమజీవి, సౌమ్యుడు, మితభాషి, పట్టిన పట్టు విడవని మనస్తత్వం గలవాడు అయిన తన భర్త చిన్నన్న పరిణామ క్రమాన్ని, తమ కుటుంబంలో చోటుచేసుకున్న విప్లవాత్మక మార్పులను, ఉత్తుంగ తరంగాలై ఉవ్వెత్తున ఎగసిపడిన యువకిశోరాలు తమ జీవితాల్లోనికి ప్రవేశించి తమ జీవన విధానాన్ని, తమ ఆలోచలనలు విప్లవీకరించిన వైనాన్ని, బతుకే విప్లవం - విప్లవమే బతుకని, మనసా-వాచా-కర్మేణా కఠోర విప్లవ మార్గాన్ని ఎంచుకుని, నల్లమలకు పయనమైన జీవితాల గురించి మనకెవరు చెప్పాలి? మనకెలా తెలియాలి?

ఓ పసి మొగ్గ, చెంచు బాలిక, దళంలో చేరుతానని నసపెడుతూ, దళాన్ని విడవకుండా వెంబడిస్తే; ఇంకా చిన్న పిల్లవు.. కొంత కాలం తరువాత చేరుదువులే అన్నా వినక విప్లవకారులతో పోట్లాడి, చివరకు నాయకుడైన మల్లన్నను కూడా మృదువుగా దబాయించి గెలిచి, అతనికి ముద్దుబిడ్డై కదన రంగంలో అసమాన ధైర్య సాహసాలు, సమయస్ఫూర్తి, మొక్కవోని విప్లవ దీక్ష, నిబద్ధత, త్యాగనిరతి గల వీర గెరిల్లా యోధగా ఎదిగి, దళాలను రక్షించడంలో శత్రువుతో పోరాడుతూ ఎలా అసువులు బాసిందో, నేల కొరిగిందో ఎవరు చెప్పాలి మనకు? అటువంటి మహోన్నత ఆదర్శాల గురించి, త్యాగ నిరతి గురించి ఎలా తెలియాలి మనకు?

నల్లమల
పి. చంద్
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 225/-

ఇలా ఎందరో అసమాన శూరుల, త్యాగ ధనుల విప్లవ పోరుగాథల సమాహారంగా నల్లమల నవల మనలను నిలబెట్టి ప్రశ్నిస్తుంది. కుదిపేస్తుంది. నువ్వెటు వైపని నిలదీస్తుంది. బాధిస్తుంది. వేధిస్తుంది. కలచి వేస్తుంది. కన్నీరు తెప్పిస్తుంది, గుండెలను పిండేస్తుంది. నిద్ర లేకుండా చేస్తుంది. ఇప్పటి యువతరమంతా తప్పక చదవాల్సిన నవల నల్లమల.

ఎప్పుడూ ఊగిసలాడుతూ, ఏవో వంకలు వెదుక్కుంటూ, తత్వాల మాటున తారాడుకుంటూ, దాక్కుంటూ కాలం వెళ్ళబుచ్చే మధ్య తరగతి బుద్ధి జీవులకు నల్లమల నవలా పాత్రలు చెంపలు చెళ్ళుమనిపిస్తాయ్. విప్లవమంటేనే యుద్ధమని, యుద్ధమంటే త్యాగమని, త్యాగమే విజయానికి పునాదని తెలియచెబుతుంది నల్లమల. ఆనవాళ్ళు ఉండొచ్చు, చెరిగిపోవచ్చు. పోరాట చరిత్ర ముగిసిపోదు. ఒడ్డున కూర్చుని, మడత నలగకుండా తీరికగా తప్పొప్పుల పట్టికలు తయారు చేసే వాళ్లకు కొదవలేదు ఈ దేశంలో - వీళ్ళు పార్లమెంటుకూ పెట్టుబడికి మంచి కావలి కుక్కలుగానే మిగులుతారని మన దేశ చరిత్ర చెబుతూనే ఉంది.

సాహిత్యపరంగా, రచనాపరంగా, భాషా వ్యాకరణ పరంగా ఈ నవలా రచనలో లోపాలు ఉన్నప్పటికీ అటువంటి లోపాలు ఉద్యమాభిమానులైన పాఠకులకు పెద్ద అడ్డంకులు కావని నా అభిప్రాయం. అయితే పఠనాశక్తిని దెబ్బకొట్టే, పాఠకుల ఓపికకు పరీక్ష పెట్టే రిపిటీషన్స్ నవల పొడుగూతా చాలానే ఉన్నాయి. ఇవి లేకుండా రచయిత జాగ్రత్తపడాల్సింది. అదేమంత కష్టమైన పనేమీ కాదు. ఎందుకనో అది జరగలేదు. నల్లమల గాథ పేరున ఈ నవలకు ముందుమాట రాసిన పాణి చాలా విషయాలే చర్చకు పెట్టాడు. అవి తప్పక చర్చించాల్సిన విషయాలే. అయితే ఈ నవలకు అటువంటి థీసిస్‌ను కేంద్ర బిందువుగా రచయిత గాని, కథనం నడిపించిన ప్రధాన పాత్రగాని పెట్టుకున్నట్లు కనిపించదు. అలా చేసి ఉండినట్లయితే ఈ నవలకు మరింత పరిపుష్టత చేకూరేదనడంలో సందేహం లేదు.





## ప్రస్తుతం మా వద్ద అందుబాటులో ఉన్న విరసం, ఇతర ప్రచురణలు, వాటి ధరలు

### కథ, నవల, కవిత్వం, సాహిత్య విమర్శ

| | | |
|---|---|---|
| 1. | కొడవటిగంటి కుటుంబరావు - 1 (కథలు) | 200-00 |
| 2. | కొడవటిగంటి కుటుంబరావు - 2 (కథలు) | 200-00 |
| 3. | కొడవటిగంటి కుటుంబరావు - 3 (కథలు) | 200-00 |
| 4. | కొడవటిగంటి కుటుంబరావు - 4 (కథలు) | 200-00 |
| 5. | కొడవటిగంటి కుటుంబరావు - 5 (గొలుసు కథలు) | 200-00 |
| 6. | కొడవటిగంటి కుటుంబరావు - 6 (నవలలు) | 200-00 |
| 7. | కొడవటిగంటి కుటుంబరావు - 7 (నవలలు) | 250-00 |
| 8. | కొడవటిగంటి కుటుంబరావు - 8 (నవలలు) | 250-00 |
| 9. | కొడవటిగంటి కుటుంబరావు - 9 (నవలలు, కథలు నాటికలు) | 250-00 |
| 10. | కొడవటిగంటి కుటుంబరావు - 10 (సైన్స్ వ్యాసాలు) | 300-00 |
| 11. | కొడవటిగంటి కుటుంబరావు - 11 (చరిత్ర వ్యాసాలు) | 150-00 |
| 12. | కొడవటిగంటి కుటుంబరావు - 12 (రాజకీయ వ్యాసాలు) | 400-00 |
| 13. | కొడవటిగంటి కుటుంబరావు - 13 (సంస్కృతి వ్యాసాలు) | 300-00 |
| 14. | కొడవటిగంటి కుటుంబరావు - 14 (సినిమా వ్యాసాలు) | 300-00 |
| 15. | కొడవటిగంటి కుటుంబరావు - 15 (సినిమా వ్యాసాలు) | 250-00 |
| 16. | కొడవటిగంటి కుటుంబరావు - 16 ఎ (సాహిత్య వ్యాసాలు) | 300-00 |
| 17. | కొడవటిగంటి కుటుంబరావు - 16 బి (సంస్కృతి వ్యాసాలు) | 300-00 |
| 18. | కొడవటిగంటి కుటుంబరావు - 17 (తాత్విక వ్యాసాలు) | 150-00 |
| 19. | కొడవటిగంటి కుటుంబరావు - 18 (లేఖలు) | 125-00 |
| 20. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మొదటి భాగం) | 300-00 |
| 21. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (రెండవ భాగం) | 250-00 |
| 22. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మూడవ భాగం) | 250-00 |
| 23. | కె.వి.ఆర్. సామాజిక వ్యాసాలు (నాల్గవ భాగం) | 250-00 |
| 24. | కె.వి.ఆర్. మహోదయం | 200-00 |
| 25. | వసంతగీతం (అల్లం రాజయ్య) | 250-00 |
| 26. | కొమురం భీం (అల్లం రాజయ్య) | 150-00 |
| 27. | సృష్టికర్తలు (అల్లం రాజయ్య) | 150-00 |
| 28. | సాహిత్య సమాలోచన (కృష్ణాబాయి) | 300-00 |
| 29. | భావవిప్లవకారుడు కొకు | 80-00 |
| 30. | కొకు సమకాలీనత - విశ్లేషణా వ్యాసాలు | 75-00 |
| 31. | అక్షరతుణీరం (కె.వి.ఆర్. సాహిత్య విమర్శ వ్యాసాలు) | 20-00 |
| 32. | సుబ్బారావు పాణిగ్రాహి కవిత్వం, పాటలు | 25-00 |
| 33. | అంతస్సూత్రం (వరవరరావు కవిత్వం) | 40-00 |
| 34. | బీజభూమి (వరవరరావు కవిత్వం) | 100-00 |
| 35. | గుమ్మెటమోత (పాణి నవల) | 100-00 |
| 36. | కలిసి పాడాల్సిన గీతమొక్కటే (పాణి కవిత్వం) | 10-00 |
| 37. | తరాల పల్లె (కౌముది రచనలు) | 50-00 |
| 38. | చలసాని ప్రసాద్ రచనలు | 60-00 |
| 39. | దండకారణ్య కథలు | 100-00 |
| 40. | తెలుగు భాష - కొన్ని సంగతులు (వి.చెంచయ్య) | 15-00 |
| 41. | సామాజికం (వి. చెంచయ్య) | 30-00 |
| 42. | సాహిత్యధోరణులు - విప్లవ దృక్పథం | 30-00 |
| 43. | విరసం సాహిత్య విమర్శ | 150-00 |
| 44. | కథల పంట-3 | 120-00 |
| 45. | కదిలే కథ | 80-00 |
| 46. | తీత్వాల్ కుక్క మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో) | 60-00 |
| 47. | జాజిపూల పరిమళం (షహీదా కథలు) | 150-00 |
| 48. | ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) | 75-00 |
| 49. | సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) | 60-00 |
| 50. | ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) | 30-00 |
| 51. | నల్లమల (పి. చంద్ నవల) | 225-00 |
| 52. | లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం (ఎన్కె దీర్ఘ కవిత) | 25-00 |
| 53. | ముదిమనిషి (అరుణతార కథలు 1) | 30-00 |
| 54. | చేపలు (అరుణతార కథలు 2) | 30-00 |
| 55. | కథ అద్దం తిరిగింది (అరుణతార కథలు 3) | 30-00 |
| 56. | కో...బలి (అరుణతార కథలు 4) | 30-00 |
| 57. | అడవిలోని వెన్నెల (అరుణతార కథలు 5) | 30-00 |
| 58. | నెలవు (అరుణతార కథలు 6) | 30-00 |
| 59. | ఒక వీరుడు మరణిస్తే (అరుణతార కథలు 7) | 30-00 |
| 60. | తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) | 100-00 |
| 61. | ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) | 10-00 |
| 62. | కాంత, పున్నం, వెన్నెల (పద్మకుమారి కథ) | 20-00 |
| 63. | రేపు (వెర్నన్ గొంజాల్వెజ్ కథ) | 20-00 |
| 64. | మిగిలెటోళ్లు (బాసిత్ కథలు) | 50-00 |
| 65. | రెండు పోరాట గాథలు (భారతి కథలు) | 50-00 |
| 66. | కిటికీ పిట్ట (పి. మోహన్ కవిత్వం) | 10-00 |
| 67. | పిల్లనగ్రోవి తుఫాను (ఉదయభాను కవిత్వం) | 10-00 |
| 68. | మంజీరా మూడ్స్ (మంజీరా కవిత్వం) | 25-00 |
| 69. | కవితా ఝుంకార్ (విరసం కవితా సంకలనం) | 75-00 |
| 70. | ఎర్రనక్షత్రం (చైనా నవల) | 50-00 |
| 71. | సముద్రంతో సంభాషణ (పి. వరలక్ష్మి) | 20-00 |
| 72. | నెగడు (కథలు) | 90-00 |
| 73. | పరామర్శ (నల్లూరి రుక్మిణి) | 80-00 |
| 74. | ఒంద్రుమట్టి (నవల) | 170-00 |
| 75. | Wake of Telangana? - A docu-drama by basith | 10-00 |
| 76. | యంత్రాల మధ్య | 35-00 |
| 77. | అక్షర కిరణం (కె.వి.ఆర్.) | 50-00 |
| 78. | డావిన్సి (మోహన్) | 150-00 |
| 79. | మార్క్సిస్టు సాహిత్య విమర్శ (డా॥ శ్రీనివాస్) | 100-00 |
| 80. | అగ్నిశిఖ | 80-00 |
| 81. | కార్మిక వర్గ పుత్రుడు | 70-00 |
| 82. | బలహీనుడి బలం | 25-00 |
| 83. | పాలమూరు వలస బతుకు చిత్రాలు - గీతాంజలి | 150-00 |
| 84. | వాట్సప్ తరంలో యుద్ధగీతం | 30-00 |
| 85. | ఏది నేరం?! (హజారీబాగ్ జైలు గాథలు) - బి. అనూరాధ | 75-00 |
| 86. | వెలుగు రవ్వల జడి ఆలూరి భుజంగరావు | 70-00 |
| 87. | అరణ్య పర్వం | 120-00 |
| 88. | ప్రజలు అజేయులు | 25-00 |
| 89. | నైనా | 50-00 |
| 90. | గమ్యం దిశగా గమనం | 30-00 |
| 91. | దిక్కు మొక్కు లేని జనం | 30-00 |

### సంస్కృతి, చరిత్ర, రాజకీయార్థిక, సైద్ధాంతిక రచనలు

| | | |
|---|---|---|
| 1. | సామ్రాజ్యవాద సంస్కృతి (జేమ్స్ పెట్రాస్ వ్యాసాలు) | 125-00 |
| 2. | మావో రచనలు - 1 | 220-00 |
| 3. | మావో రచనలు - 2 | 220-00 |
| 4. | రివిజనిజం (మావో) | 75-00 |
| 5. | మార్క్సిజం, లెనినిజం, మావోయిజం | 125-00 |

| | | |
|---|---|---|
| 6. | మార్క్సిస్టు తత్వశాస్త్రం | 80-00 |
| 7. | చారుమజుందార్ 8 డాక్యుమెంట్లు | 50-00 |
| 8. | మంద్రస్థాయి యుద్ధం | 100-00 |
| 9. | విద్యార్థి యువజనోద్యమాలు (లెనిన్) | 30-00 |
| 10. | రాజకీయ కృషి - మన కృషి అంతటికీ జీవనాడి (చైనా విప్లవోద్యమన పత్రిక హొంకీ వ్యాసాలు) | 35-00 |
| 11. | నక్సల్బరీ వెలుగులో (భారతదేశ నక్సలైట్ ఉద్యమ చరిత్ర) | 125-00 |
| 12. | జగిత్యాల జంగల్‌మహల్ (1) | 75-00 |
| 13. | జగిత్యాల జంగల్‌మహల్ (2) | 100-00 |
| 14. | స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో | 15-00 |
| 15. | అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటుపోట్లు | 60-00 |
| 16. | భారతదేశంలో ఉత్పత్తి విధానం - ఉత్పత్తి సంబంధాలు | 20-00 |
| 17. | ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తి సంబంధాలు | 30-00 |
| 18. | నేటి రాయలసీమ | 100-00 |
| 19. | గతాన్ని సమీక్షించుకుందాం | 50-00 |
| 20. | చూటే ఏరిన రచనలు | 125-00 |
| 21. | మావో సే టుంగ్ | 80-00 |
| 22. | గెరిల్లా యుద్ధం | 60-00 |
| 23. | చైనా ప్రజా విముక్తి సైన్యం | 40-00 |
| 24. | భూమి సంస్కృతి నాగరికత | 15-00 |
| 25. | స్త్రీవాద ఉద్యమం (అనురాధ గాంధీ) | 25-00 |
| 26. | In Search of Method (Mudunuri Bharati) | 200-00 |
| 27. | On Education (Mudunuri Bharati) | 180-00 |
| 28. | Crisis and Development in Marxian Frame Work (Mudunuri Bharati) | 80-00 |
| 29. | Individual, Sub-Groups, Groups and Freedom (Mudunuri Bharati) | 75-00 |
| 30. | Methodology of Social Enquiry (Mudunuri Bharati) | 150-00 |
| 31 | Fifty Years of Andhra Pradesh 1956-2006 | 300-00 |
| 32. | చైనా కమ్యూనిస్టు పార్టీ మౌలిక అవగాహన | 100-00 |
| 33. | జనతన సర్కార్ కావాలి మేక్ ఇన్ ఇండియా కాదు | 15-00 |
| 34. | విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు | 30-00 |
| 35. | ఐక్య సంఘటన సిద్ధాంత వ్యాసాలు | 35-00 |
| 36. | బాలగోపాల్ తాత్విక గందరగోళం | 70-00 |
| 37. | జాతుల సమస్య రిజర్వేషన్లు కార్మిక వర్గ దృక్పథం | 25-00 |
| 38. | తత్వశాస్త్రం మాయాజాలం కాదు | 20-00 |
| 39. | వైరుధ్యాలు | 20-00 |
| 40. | చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949-64 | 20-00 |

**వర్తమాన సమాజం, ప్రజా ఉద్యమాలు**

| | | |
|---|---|---|
| 1. | ముజఫర్‌నగర్ మరో మానని గాయం | 20-00 |
| 2. | నేటి రాయలసీమ | .100-00 |
| 3. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 4. | దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | 60-00 |
| 5. | ఉద్యమ ఆకాశంలో సగం | 15-00 |
| 6. | తూర్పు మధ్య భారతంలో విస్థాపన-ప్రజా ప్రతిఘటన | 20-00 |
| 7. | జనతన జైత్రయాత్ర | 20-00 |
| 8. | ఫిలిప్పినో ఉద్యమం | 15-00 |
| 9. | ఖైదీల సైరన్ | 60-00 |
| 10. | విముక్తిబాటలో నారాయణపట్నా | 20-00 |
| 11. | జ్ఞానం అందరిది | 30-00 |
| 12. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 13. | లక్ష్మింపేట | 25-00 |
| 14. | గ్రీన్‌హంట్ ఉత్పాదాలు | 25-00 |
| 15. | నిత్య జీవితంలో సోషలిజం (భూసారం శివన్న) | 100-00 |
| 16. | ఆకుల భూమయ్య రచనలు | 40-00 |
| 17. | అమలు కానీ హామీల చరిత్ర (శశికళ) | 100-00 |
| 18. | ది ఫ్లేమ్స్ ఆఫ్ నారాయణ పట్నా | 60-00 |
| 19. | దాక్షిణ్య వాదం నుంచి దండకారణ్యం దాకా (రత్నమాల) | 200-00 |
| 20. | నూతన సంభాషణ (రత్నమాల) | 80-00 |
| 21. | జర్నలిజం ప్రొఫెషన్ (రత్నమాల | 50-00 |
| 22. | సాహిత్య ధోరణులు విప్లవ ధోరణులు | 30-00 |

**స్మృతి సాహిత్యం**

| | | |
|---|---|---|
| 1. | ఖాన్‌దాదా (ఎం.టి.ఖాన్ స్మృతి) | 10-00 |
| 2. | ఆదర్శజీవులు అమరులు | 30-00 |
| 3. | నేనున్నాను కామ్రేడ్ (గంటి ప్రసాదం స్మృతిలో) | 30-00 |
| 4. | గంటి ప్రసాద్ రచనలు | 25-00 |
| 5. | సూర్యుడు మరణించడు | 60-00 |
| 6. | చిరునవ్వు సితార | 80-00 |
| 7. | గెరిల్లా డైరీ | 10-00 |
| 8. | మన్యం వెలుగులు | 15-00 |
| 9. | అక్షర కిరణం | 20-00 |
| 10. | అడవి పుత్రుడు మంగన్న | 10-00 |
| 11. | గజ్జెల సరోజ | 15-00 |
| 12. | మహిత | 10-00 |
| 13. | కోటి జ్ఞాపకాలు | 50-00 |
| 14. | పువర్తి అమరులు | 20-00 |
| 15. | అమరుల యాదిలో | 30-00 |
| 16. | అమరుల జీవిత చరిత్ర | 30-00 |
| 17. | వెగుచుక్కల వెలుతురులో | 10-00 |
| 18. | లంకపల్లి అమరులకు విప్లవ జోహార్లు | 10-00 |
| 19. | అజ్ఞాత విప్లవ యోధుడు అమరుడు కొండన్న | 50-00 |
| 87. | శారద స్మృతి శకలాలు | 30-00 |

**డివిడిలు**

| | |
|---|---|
| అరుణతార సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక (1977-2013) | 125-00 |

మరిన్ని వివరాలకు సంప్రదించండి : డి.వి. రామక్రిష్ణారావు, అరుణతార వర్కింగ్ ఎడిటర్,
ఫోన్ : 99891 89250 (ఉదయం 9 లోపు సాయంత్రం 8 తరువాత మాత్రమే) ఈమెయిల్ : arunatara1977@gmail.com
పుస్తకాల ధరకు సరిపడా డబ్బులతో పాటు, పోస్టింగ్ ఖర్చులను జతచేసి ఎం.ఓ. లేక డిడి ద్వారా పంపి పుస్తకాలను పొందవచ్చు.
ఆన్‌లైన్‌లో డి.వి.రామక్రిష్ణారావు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, లాలాగూడ బ్రాంచ్, హైదరాబాద్, ఎకౌంట్ నెం. 10243583773,
ఐఎఫ్‌ఎస్‌సి కోడ్ : ఎస్.బి.ఐ.ఎన్.0007112కి చెల్లించి పుస్తకాలను పొందవచ్చు.
పి. వరలక్ష్మి, విరసం కార్యదర్శి, 5-1820, గీతాశ్రమం వీధి, ప్రొద్దుటూరు. ఫోన్ : 81799 13123, ఈమెయిల్ : varalurwa@gmail.com
*మా ప్రచురణలు నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్‌లోనూ లభిస్తాయి. ఫోన్ నెం: 040-24652387*

పుస్తక సమీక్ష

# ఎక్కడిదీ ఒంద్రుమట్టి?

- మాతంగి

'ఒంద్రుమట్టి' నవల రాయడం ఒకింత సాహసమే. ఇది నల్లూరు రుక్మిణి రెండో నవల. ఇలాంటివి రాయడం అంత సులభం కాదు. రుక్మిణి ఎంత కష్టపడ్డారో ఈ నవల్లో తెలుస్తోంది. ఇందులో ఆమె సొంతం సఫలమయ్యారని ఉదారంగా అనాల్సిన పని లేదు. అలా అనడం వల్ల ఆమె చాలా ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. అంత కంటే ఇది రాయడానికి ధైర్యం చేసి, పరిశ్రమించి సృజనాత్మక రచయితగా చాలా ఎక్స్‌టెన్షన్ సాధించారని చెప్పడం బాగుంటుంది. ఆమెలోని సామాజిక దృక్పథం వల్లే ఇది సాధ్యమైంది. సరిగ్గా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, సమైక్య వాద గొడవ ముమ్మరంగా ఉన్న కాలమంతా ఈ నవల ఆమె రాసి ఉంటారు.

కోస్తా ప్రాంతంలో మేట వేసిన సారవంతమైన ఒంద్రుమట్టి ఎక్కడి నుంచి కొట్టుకొని వచ్చింది? అనే ప్రశ్న వేయడం ఈ నవల ప్రత్యేకత, విశిష్టత. రెండు తరాల వెనక్కి వెళ్లిపోయి కోస్తా ప్రాంత సామాజిక పరిణామ చరిత్రను సాహిత్యంలోకి తేవడం ఒక ముఖ్యమైన విషయం. అంతే కాదు. రచయిత్రి తాను ఒక ప్రాంతంలో నిలబడి ఆ ప్రాంతంలోని పరిణామాలను పక్క ప్రాంతాల శ్రమతో, సంపదతో, రాజకీయాలతో కూడా ముడిపెట్టి చూడగలిగారు. దీని వల్లే పైన చెప్పిన ప్రశ్న ఈ నవల వేయగలిగింది. దీనికి చాలా చారిత్రక దృష్టి ఉండాలి. వేర్వేరు ప్రాంతాల్లో జరిగిన మార్పులన్నిటినీ విడిగానేగాక వాటి మధ్య పరస్పర సంబంధాలనూ చూడాలి. వాస్తవికతను పట్టుకోవడం తప్ప మరే రాగద్వేషాలు, పక్షపాతాలు ఉండకూడదు. నవల కాబట్టి ఆ రెండు ప్రాంతాల్లోని ఆనాటి జీవితాన్ని పునర్నిర్మాణం చేయాలి. ఈ చివరి పని అంత సులభం ఏమీ కాదు.

ఒంద్రుమట్టి
నవల
నల్లూరి రుక్మిణి

ఒంద్రుమట్టి నవల
. ఓ తీర గ్రామం - యాభై యేళ్ళ కథ
నల్లూరి రుక్మిణి
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 170/-

రుక్మిణి అలనాటి కోస్తా ప్రాంత జన జీవితాన్ని ఇప్పుడు చెప్పడానికి ఎలా తెలుసుకున్నారోగాని ఆ వర్ణన, వివరాలు మొదలైనవన్నీ చదవడానికి బాగున్నాయి. వాటిని ఆమె ఎంతగా చెప్పారంటే.. వాటి వల్ల ఒక్కోచోట నవల నడక ఆగిపోయిందా అనే అనుమానం చురుకైన పాఠకులకు కలుగుతుంది. అంతగా ఆనాటి ఆచార వ్యవహారాలు, పని పాటలు విరివిగా చెప్పుకుంటూపోయారు. తెలంగాణ గురించి చెప్పిన భాగాల్లో సహజంగానే ఆ విషయాలు అంతగా తెలియవు కాబట్టి లోపం కనిపిస్తుంది. అయినా మనకు ఆమె తెలంగాణ సంబంధంలో ఎందుకు నవల నడిపారో తెలుస్తుంటుంది కాబట్టి ఆ సంగతి పెద్ద ఇబ్బందిపెట్టదు.

ఆనాటి కోస్తా ప్రాంత వ్యవసాయ రంగ పరిణామాలను, కుల సమీకరణాల్లో వచ్చిన మార్పులను, జాతీయోద్యమమనే చట్రంలో భాగంగా ముందుకు వచ్చిన రాజకీయ ధోరణులను, కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావాలను.. ఇలా ఎన్నిటినో నేరుగా నవలలోకి తీసుకొని వచ్చారు.

గతానికి సంబంధించిన ఇతివృత్తం తీసుకున్నప్పుడు పాత్రల చిత్రణలో సంయమనం అవసరం. దీన్ని కూడా రుక్మిణి చాలా వరకు పాటించారనే చెప్పవచ్చు. కాలాన్ని దృష్టిలో పెట్టుకొని ఆనాటి మనుషుల ప్రవర్తనపట్ల అనుమానం రాకుండా రాయాల్సి ఉంటుంది. ఇది అన్నిటికంటే చాలా కష్టమైన పని. సృజనాత్మక సాహిత్యంలో మాత్రమే ఆనాటి మానవులను పునర్దర్శించడానికి వీలవుతుంది. దీనికి తగినట్టు నవల రాయాలంటే జీవితం పట్ల అవగాహన, అప్రమత్తత తప్ప మరే దగ్గరి దారి లేదు. ఈ దారి వేసుకోడానికి రుక్మిణి చాలా కష్టపడ్డారని పాఠకులకు తెలుస్తూ ఉంటుంది. కోస్తా ప్రాంత అభివృద్ధి వికాసాలను జీవిత చిత్రణలోంచి ఎత్తి చూపడానికి ఆమె ప్రదర్శించిన నైపుణ్యం పట్ల నమ్మకం కలుగుతుంది.

బహుశా కోస్తా ప్రాంతంలో ఇవాళ బాహాటంగా కనిపిస్తున్న అనేక జీవన ధోరణుల వెనుక అప్పట్లో ఏం జరిగి ఉంటుంది? అనే కోణంలో సాహిత్య అధ్యయనం చేయడానికి కూడా ఈ నవల బాగా ఉపకరిస్తుంది. ముఖ్యంగా గుంటూరు-ప్రకాశం జిల్లాల(సారూప్యత ఉన్న ప్రాంతాల) గత జీవిత చిత్రణను ఒక చారిత్రక, రాజకీయార్థిక దృష్టితో ఇంత విస్తారంగా రాసిన నవల ఇదే కావచ్చేమో. ఈ ప్రాంత పరిణామాల్లోని పురోగామి శక్తులను, అట్టడుగు కులాల వికాస క్రమాలను మాత్రం ఈ నవలలోనే చూస్తాం.

కారంచేడు ఘటన జరిగాక మార్క్సిస్టు రాజకీయార్థిక వేత్తలు చాలా లోతైన సామాజిక రాజకీయార్థిక విశ్లేషణలు అందించారు. దళిత శిబిరం నుంచి కూడా కొన్ని ముఖ్యమైన పరిశీలనలు వెలుగులోకి వచ్చాయి. నవలా రచయితగా రుక్మిణి మీద ఇవన్నీ ఉన్నాయి.

నవల కేవలం జీవిత చిత్రణకేగాక... ఆ ప్రక్రియకున్న విస్తృతి వల్ల మానవ సంబంధాల సంఘర్షణను ఆ కాలపు సామాజిక సంబంధాల పునాదిపై నుంచి వెలికి తీస్తుంది. అందుకే నవల సామాజిక విశ్లేషకులను అమితంగా ఆకర్షిస్తుంది. ఒంద్రుమట్టి అలాంటి నవల.

సాహిత్యంగా ఉండవలసిన కళా ప్రమాణాలపట్ల బాధ్యతాయుతమైన పట్టింపుతో సామాజిక చరిత్రకు కాల్పనిక రూపాన్ని ఇస్తున్నాననే ఎరుక ఆమెకు పుష్కలంగా ఉందనే విశ్వసనీయతను నవల చాటుకుంటుంది. రచయితల పట్ల గౌరవం పెంచే విషయం ఇదే. దీనికి ఆమె విప్లవ సాహిత్య వ్యక్తిత్వం కారణం.

ఈ నవలను ఇంతకంటే ఇంకా బాగా ఎలా రాయవచ్చో చాలా చెప్పవచ్చు. కానీ రుక్మిణి ఇలా రాశారు. ఇందులో పూర్తిగా సాహిత్య కోణంలో చర్చించేవి ఎన్నో ఉన్నాయి. పైన చెప్పినట్లు సామాజిక రాజకీయార్థిక పరిభాషలో విశ్లేషించాల్సినవీ మరెన్నో ఉన్నాయి. రెంటినీ కలిపి మార్క్సిస్టు సాహిత్య, సామాజిక విమర్శ రాయదగ్గ బలం ఇందులో ఉంది. విప్లవ నవలా సాహిత్యంలో చాలా గాఢమైన, ప్రభావశీలమైన నవలగా ఇది మిగిలిపోతుంది.



# అల్లం రాజయ్య కథలు -రాజ్యాంగ నైతికత

- కాత్యాయనీ విద్మహే

రాజ్యంగ నైతికత అనే భావన ప్రాతిపదికగా సాహిత్య విమర్శను అభివృద్ధి చెయ్యాలన్న మంచి ఆలోచనతో రూపొందించ బడిన సదస్సు "రాజ్యాంగ నైతికత - స్వాతంత్ర్యానంతర తెలుగు సాహిత్యం" అనే ఈ సదస్సు. సాహిత్యాన్ని సామాజిక శాస్త్రాల వెలుగులో పరిశీలించటం వలన కలిగే ప్రయోజనాల గురించి ఎరుక కలిగించటం ఈ సదస్సు లక్ష్యం.

నిజానికి సామాజిక శాస్త్రాల వెలుగులో సాహిత్య పరిశీలన అవసరాన్ని, సామాజిక శాస్త్ర విజ్ఞాన విస్తరణలో సాహిత్య పరిశీనకు ఉన్న ప్రాధాన్యతను గుర్తించిన ముప్పై ఏళ్ల చరిత్ర తెలుగు సమాజానికి ఉంది. సామాజిక రాజకీయ ఆర్థిక పరిణామాల సంబంధంలో సాహిత్య అధ్యయనం మార్క్సిస్ట్ తత్వ శాస్త్ర ప్రభావం వల్ల అలవాటైనప్పటికీ అర్థశాస్త్రం రాజకీయ శాస్త్రం, న్యాయ శాస్త్రం వంటి శాస్త్రాలు అభివృద్ధి పరచిన సిద్ధాంతాలు, భావనలు సాహిత్యానికి అనువర్తిప చేసి చేసే అధ్యయనాలు 1980లలో నిర్దుష్టంగా ఆరంభం అయ్యాయి. పంచాయతీ రాజ్య రాజకీయ విధానాల సబంధంలో రాబందులు - రామచిలుకలు నవలను - వాసిరెడ్డి సీతాదేవి రాసిన నవలను - పరిశీలించటం (1981) దానికి ప్రారంభం అనుకోవచ్చు. స్థానిక స్వపరిపాలనా సంస్థల నిర్మాణం గడ్డి వేళ్ళ స్థాయి నుండి ప్రజలను రాజకీయ నిర్ణయాలలో భాగస్వాములను చేసేందుకు రూపొందింది. స్థానిక స్వపరిపాలనా సంస్థల నిర్మాణం, విధివిధానాలు అన్నీ పాలనా శాస్త్రం అనే సామాజిక శాస్త్రంలో చర్చించబడతాయి. రాబందులు-రామచిలుకలు నవల పాఠం చెప్పటానికి పాలనా శాస్త్రం ఆ మేరకు తెలియాలని ఆ దిశగా బల్వంత రాయ్ మెహతా కమిటీ రిపోర్ట్ వంటివి చదవటం, పాలనాశాస్త్ర విభాగపు మిత్రులతో కలిసి చర్చించటం - ఫలితంగా వచ్చిన చిన్న పుస్తకం అది. నాతో పాటు పాలనా శాస్త్ర విభాగంలో అధ్యాపకు రాలైన వి. శోభ ఆ పుస్తక రచనలో భాగస్వామి. సాహిత్యానికి సామాజిక శాస్త్రాలకు విభజన రేఖలు చెరిపేసే ప్రయత్నాలు ఆ రకంగా కాకతీయ విశ్వ విద్యాలయంలో ప్రారంభం అయ్యాయి. అప్పుడే (1982) గణిత శాస్త్ర అధ్యాపకుడైన కే. బాలగోపాల్ రావిశాస్త్రి రచనల్లో రాజ్యాంగ యంత్ర స్వభావాన్ని వివేచిస్తూ వ్యాసం రాసి ఆ రకమైన అధ్యయనాలకు ప్రామాణికతను సమకూర్చారు. మిగులు విలువ సిద్ధాంతాన్ని రావిశాస్త్రి బల్లచెక్క కథకు అన్వయించిన నా వ్యాసం కూడా అప్పుడే వచ్చింది. జి. హరగోపాల్, వకుళాభరణం రామకృష్ణ, డి. నరసింహారెడ్డి, సి. వి. సుబ్బారావు,. శివలింగ ప్రసాద్ వంటి సామాజిక శాస్త్ర వేత్తలు సాహిత్యాన్ని సామాజిక రాజకీయ ఆర్థిక పరిణామాలను చలనంలో అధ్యయనం చేయటానికి పనికి వచ్చే ముడిసరుకుగా సంభావించారు 1986లో సి.వి. సుబ్బారావు సంపాదకత్వంలో వచ్చిన "విభాత సంధ్యలు" వ్యాస సంకలనం ఆ పద్ధతిని ఒక విధానంగా ఉద్యమస్థాయిలో అధ్యయనపరుల దృష్టికి తీసుకొని వచ్చింది.

ఈ ఇరవై ఎనిమిదేళ్లుగా సామాజిక శాస్త్రాల వెలుగులో, సామాజిక రాజకీయ సిద్ధాంతాల సహాయంతో సాధికారత వంటి ప్రభుత్వ విధానాల పథకాల సంబంధంలో సాహిత్యాన్ని విశ్లేషించే వాళ్ళు, అధ్యయన అధ్యాపనాలు చేసే వాళ్ళు కళాశాలలో విశ్వవిద్యాలయాలలో కొందరైనా లేక పోలేదు. అయితే అలాంటి వాళ్ళ సంఖ్య పెరగటం, సాహిత్య విమర్శలో ఇది ఒక ధోరణిగా బలపడటం అవసరం. ఆ అవసరాన్ని గుర్తు చేసి, ఆ వైపుగా కొత్తతరం అధ్యయనపరులకు ప్రేరణ ఇవ్వటానికి ఇప్పుడు ఈ సదస్సు. "రాజ్యంగ నైతికత" అనే ఒకే ఒక్క భావన అనేక మంది రచయితల రచనలలో ఏయే కోణాల నుండి ప్రతిఫలించిందో పరిశీలించే పని ఒక వేదిక పైన జరిగినప్పుడు ప్రభావం గుణాత్మకంగా ఉంటుందనటంలో ఎలాంటి సందేహం లేదు.

ఇంతకూ రాజ్యాంగ నైతికత అంటే ఏమిటి? నీతి నియమాలు అనే ద్వంద్వ సమాసం మనకు తెలిసిందే. మనుషులు సమూహంగా జీవిస్తూ పరస్పర సహకారం, సౌఖ్యం లక్ష్యంగా చేసుకొనే సర్దుబాట్లు కాలాంతరంలో నీతి నియమాలుగా స్థిరీకృతం అవుతూ వచ్చాయి. వ్యక్తిగతమైన నడవడికి సంబంధించిన బాధ్యతాయుతమైన మానవ ఆదర్శం నీతి. మనుషుల మధ్య సంబంధాలు ఎలా ఉండాలో, జీవితంలో ఆచరించదగిన ఆమోదయోగ్యమైన సూత్రాలు నియమాలు ఏమిటో నిర్దేశించే క్రమంలో నీతి నియమాలు నిర్దిష్ట రూపం తీసుకొంటాయి. మొత్తం మీద సమష్టి శ్రేయస్సు, సమాజాభివృద్ధి వాటికి లక్ష్యం. కష్టం లో ఉన్నవాళ్ళకు సహాయపడటం, ఎదుటివారి మేలు కోరటం, పరుల సంపదకు ఆశించక పోవటం, ఇతరులకు హాని తలపెట్టక పోవటం, పెద్దలను గౌరవించటం వంటి నీతులు, ఎవరుజేసిన కర్మ వాడనుభవించక తప్పదు, ఇతరులకు అన్యాయం చేస్తే ఆ పాపం ఊరికే పోదు వంటి విశ్వాసాలు మానవ ప్రవృత్తులను నియంత్రించి సంస్కారాలను అభివృద్ధి పరచటానికి మొదలై క్రమంగా జీవితపు విలువలుగా స్థిరపడతాయి. సాధారణ మానవ నైతికత లేదా సామాజిక నైతికతగా అవి ప్రజా జీవన సంస్కారంలో భాగమై పోతాయి. ఇదొక నిరంతర ప్రక్రియ. రాజ్యాంగ నైతికత ఇంతకంటే విశిష్టమైనది.

రాజ్యం అనే వ్యవస్థ చారిత్రకంగా పాతదే. కానీ రాజ్యాంగం అనేది మాత్రం నవీనం. బారతదేశంలో మగధ వంటి ప్రాచీన రాజ్యాల నుండి బ్రిటిష్ వలస పాలనలో క్రమక్రమంగా క్షీణించి పోయిన చిన్న చితక రాజ్యాల వరకు అన్నీ రాజ్యాంగ రహిత రాజ్యాలే. రాజ్యానికి ప్రజలకు మధ్య సంబంధాలను నిర్దేశించిన కౌటిల్యుని అర్థ శాస్త్రం, మను ధర్మ శాస్త్రం వంటివి రాజ్యానికి ఉన్న దండనాధికారం గురించి చెప్పినంత ప్రజల పట్ల ఉండవలసిన బాధ్యతను గురించి చెప్పలేక పోయాయి. భారత దేశానికి అన్నివర్గాల ప్రజల భాగస్వామ్యంతో కూడిన జాతీయోద్యమం వల్ల బ్రిటిష్ వలస పాలన నుండి స్వాతంత్ర్యం లభించాక ప్రజాస్వామ్య రాజ్య వ్యవస్థను నిర్మించుకొనే క్రమంలో రూపొందింది రాజ్యాంగం. బాబా సాహెబ్ అంబేద్కర్ నాయకత్వంలో ఏర్పడిన రాజ్యాంగ సభ ఈ రాజ్యాంగాన్ని రచించింది. జాతీయోద్యమ

కాలంలో ముందుకు వచ్చిన భిన్న వర్గాల ప్రజల ఆకాంక్షల పరిపూర్తికి రాజ్యం కల్పించవలసిన హక్కులు, అవకాశాలు ఇందులో ప్రధానమైనవి. ఒక మనిషికి ఒక ఓటు ప్రాతిపదిక మీద ఏర్పడిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రతి మనిషికి సమానంగా ఒకే విలువనిచ్చే ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి, సామాజిక వ్యవస్థ నిర్మాణానికి దారి తియ్యాలన్నది అంతిమ లక్ష్యం. దానిని సాధించటం కోసమే రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలు చోటు చేసుకొన్నాయి. అయితే కుల మత లింగ వర్గ అసమానతలు ఉన్న సమాజంలో రాజ్యాంగం ప్రకారం లభించిన సమానత్వం ఆచరణ వాస్తవం కానేరదు. అందువల్ల ఈ వైరుధ్యాన్ని పరిష్కరించటం తక్షణ కర్తవ్యం అవుతుంది. అందుకొరకే అంబేద్కర్ రాజ్యాంగ నైతికత అనే భావనను ప్రవేశ పెట్టాడు.

రాజ్యాంగం వాగ్దానం చేసిన సమానత్వ ఆదర్శం. భిన్న అసమానతలు వేరునుకొని ఉన్న సమాజం వాస్తవం. ఈ వైరుధ్యం పరిష్కరించ బడటానికి అటు ప్రభుత్వాలు, ఇటు ప్రజలు చెయ్యవలసినది చాలా ఉంది. ప్రభుత్వాలు రాజ్యాంగం ప్రకారమే రాజకీయ అధికారాన్ని పొందుతాయి కనుక, రాజ్యాంగం ప్రకారం నడవవలసినవి కనుక రాజ్యాంగం చెప్పిన సమానత్వ విలువను సామాజిక వాస్తవంగా మార్చటానికి తగిన విధానాలు రూపొందించాలి. అందుకు అనుగుణమైన కార్యక్రమాలు చేపట్టాలి. తరతరాలుగా అసమానతలకు, అసలు అవి అసమానతలే అనిపించనంతగా అలవాటు పడిపోయిన ప్రజలలో సమానత్వ స్పృహను పెంచే పనిచెయ్యాలి. జీవిత సంబంధాలలో, ఆచార వ్యవహారాలలో, విశ్వాసాలలో, సంస్కృతిలో భాగమై ఆచరణలో కొనసాగుతున్న అసమానత రూపాలను, విలువలను ధ్వంసం చేస్తూ నూతన సమానతా సంస్కృతిని నిర్మించాలి. హక్కుల ఉల్లంఘనకు ఎవరూ పాల్పడకుండా హెచ్చరికగా ఉండాలి. ఇక ప్రజలు వ్యక్తులుగా తాము భాగమైన కుటుంబం, గ్రామం, కులం, మతం, బడి, గుడి పొలం, కర్మాగారం తదితర పని స్థలం ఏదైనా అన్ని వ్యవస్థలలోనూ సమానత్వం ఒక జీవన విలువగా ప్రజాస్వామిక సంబంధాలు ఏర్పరచుకోనటానికి ప్రయత్నపరులు కావలి. విమర్శ ఆత్మవిమర్శలతో స్వార్థాన్ని, అధికారాన్ని, దురహంకారాన్ని వదిలించుకొంటూ, తమ వలనే అవకాశాలు, సౌఖ్యాలు పొందే హక్కు అందరికి ఉన్నదన్న ఉత్తమ మానవీయ సంస్కారాన్ని అభివృద్ధి పరచుకోవాలి. ఈవిధమైన సంకల్పం, కార్యక్రమం, చొరవ "రాజ్యాంగ నైతికత"ను అభివృద్ధి పరుస్తుంది.

అయితే ఈ రాజ్యంగ నైతికతను గురించిన స్పృహ రాజ్యాంగం అమలులోకి వచ్చిన ఈ అరవై నాలుగేళ్ల కాలం మీద ఎంత అభివృద్ధి చెందింది అన్నది అసలు ప్రశ్న. దీనిని కొలవటానికి సాహిత్యాన్ని మించిన ముడిసరుకు మరొకటి లేదు అన్నది స్పష్టం. రాజ్యాంగం ఉల్లంఘించ బడుతున్న సమయాలను, స్థలాలను, సందర్భాలను - చట్టం కనిపెట్టలేని వాటిని - గమనించి విమర్శకు పెట్టటం ద్వారా రాజ్యంగ నైతికతను సజీవం చేస్తుంది సాహిత్యం. రాజ్యం గురించి విమర్శనాత్మకం ఉండే నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమ గతి క్రమాన్ని వస్తువుగా చేసుకొన్న అల్లం రాజయ్య కథలు అందుకు మరింత సాధికార వనరు అవుతవి.

అల్లం రాజయ్య భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అయిదేళ్లకు 1952 జూన్ 5 వ తేదీన తెలంగాణాలోని కరీంనగర్ జిల్లా మంథని తాలూకా గాజులపల్లి గ్రామంలో పుట్టాడు. భారత రాజ్యాంగం అమలులోకి వచ్చి అప్పటికి రెండేళ్ళ అయిదు నెలలు. నీటి వసతి లేక సరిగా పంటలు పండని వ్యవసాయ కుటుంబం ఆయనది. మంథని లో హైస్కూల్ చదువు పూర్తయ్యేసరికి రాజయ్యకు ఆర్థిక వ్యత్యాసాలు, సామాజిక, కుల అసమానతలు అర్థం కాసాగాయి. అంబేద్కర్ రచనలు, బెంగాలీ సాహిత్యం, చలం, గోపీచంద్ కొడవటిగంటి కుటుంబరావు, రంగనాయకమ్మ మొదలైన వారి సాహిత్యాన్ని చదువుతూ సామాజిక అసమానతలకు, ఆర్థిక వ్యత్యాసాలకు కారణాలు తెలుసుకొనాలన్న తపనలో పడ్డాడు. తనలోని ఆర్తికి సమాధానం దొరుకుతుందేమోనని 1969 తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో క్రియాశీల కార్యకర్త అయ్యాడు. కరపత్రాలు రాయటం, ఉపన్యాసాలు ఇవ్వటం విద్యార్థి సంఘ నాయకత్వం - అన్నీ భుజాన వేసుకొని పని చేసిన ఆయనకు ఆ ఉద్యమం అర్థాంతరంగా ఆగి పోవటం అశనిపాతం అయింది. చదువు వదిలి గాజుల పల్లికి వెళ్లి వ్యవసాయం చేసి, అదీ కలిసిరాక మళ్ళీ చదువుకు వరంగల్ చేరాడు. 1975లో బియ్యస్సీ చదువు పూర్తయ్యేటప్పటికి వరంగల్ సాహితీ మిత్రులతో సంభాషణ, శ్రీశ్రీ, పాణిగ్రాహి తదితరుల సాహిత్య అధ్యయనం శ్రీకాకుళ పోరాటం వైపు అతని చూపును మరల్చాయి. మార్క్సిస్ట్ తత్వశాస్త్ర అధ్యయనానికి ప్రేరేపించాయి. మంచిర్యాల ఎ సి సి లో టైం కీపర్ ఉద్యోగం లో చేరినా సమాజంలో కొనసాగుతున్న దోపిడీ సంబంధాలు ఆయనను కలవర పెడుతూనే ఉన్నాయి. తత్ఫలితంగానే 1978 జగిత్యాల జైత్ర యాత్రకు ఉత్తర తెలంగాణా ను సంసిద్ధం చేయటంలో అతి సహజంగా భాగం అయ్యాడు. ఆ తరువాత విప్లవోద్యమ గతి క్రమంలో తానొక విడదీయరాని భాగమయ్యాడు. విప్లవోద్యమ దశలన్నిటితోనూ తనను తాను అనుసంధానించుకొన్న సాహిత్య సృజనకారుడు కూడా అయ్యాడు. ఆ క్రమంలోనే 1973 నుండే తెలంగాణ గ్రామీణ సమాజాన్ని నిశితం గా పరిశీలిస్తూ, భూ సంబంధాలలోని, ఉత్పత్తి సంబంధాలలోని అసమానతలను, దోపిడీని, సంఘర్షణ ను వ్యాఖ్యానిస్తూ అనేక కథలు రాసాడు. ఉద్యమ అవసరాలరీత్యా తానొక్కడే అనేకమై అనేక మారు పేర్లతో రాసాడు. రాజ్యంగ నైతికత అనే ఒక భావన ఆధారంగా అధ్యయనం చేయటం వలన అల్లం రాజయ్య కథలను మరొక కొత్త కోణం నుండి అర్థం చేసుకొనే అవకాశం ఎంతగా ఉందో నిరూపించటం ఈ ప్రసంగ పత్రం ఉద్దేశం.

ఇందుకోసం 1973 నుండి 1998 మధ్య పాతిక సంవత్సరాల కాలం మీద అల్లం రాజయ్య రాసిన కథల నుండి పదమూడింటిని ప్రతినిధి కథలుగా ఎంపిక చేసుకొనటం జరిగింది. అవి - 1. శివసత్తిశక్తి(1973) 2. హీరో (1977) 3. చిలుకా!నువ్వెటు వెళ్ళావు (1978) 4. రాజీ (1978) 5. ముసురు (1978) 6. అడవిమనిషి (1979) 7. సృష్టికర్తలు (1979) 8. తుడుం (1981) 9. తుఫాను (1985) 10. జైలు (1988-89) 11. కమల (1991) 12. మ దేవుని కల (1993) 13. ప్రత్యర్థులు (1998) అడవి, గ్రామం, కుటుంబం మొదలైన భిన్న వ్యవస్థలలో వ్యవసాయం, పరిశ్రమ మొదలైన భిన్న రంగాలలో రాజ్యాంగం హామీ ఇచ్చిన ప్రాథమిక హక్కుల ఉల్లంఘన ఎలా కొనసాగుతున్నదో వాటికి వ్యతిరేకంగా వచ్చే ప్రజా పోరాటాలు రాజ్యాంగ నైతికతను ప్రచారం చేయటంలో ఎలాంటి పాత్రను నిర్వహిస్తున్నవో నిరూపించటానికి, ఆర్థికంగా సామాజికంగా దోపిడీకి హింసకు గురి అవుతూ హీనంగా, దీనంగా బతుకీడుస్తున్న సన్న చిన్నకారు రైతులు పాలేర్లు, దళితులు స్త్రీలు, పిల్లలు హక్కుల నిరాకరణకు ఎలా గురి అవుతున్నారో వారి ధిక్కార ప్రకటన రాజ్యాంగ

నైతికత నిర్మాణంలో ఎలా భాగమవుతుందో నిరూపించటానికి సరిపోయే ప్రత్యేకత గల కథలు కనుక అధ్యయనానికి వీటిని ఎంచుకొనటం జరిగింది.

ఈ కథలను విషయాన్ని బట్టి ఆరు రకాలుగా వర్గీకరించి పరిశీలించవచ్చు. - శివసత్తిశక్తి, ముసురు, తుడుం - కథలకు కేంద్రం అడవి. అడవిమనిషి, సృష్టికర్తలు, మహాదేవుని కల కథలకు భూమి సమస్య కేంద్రం. రాజీ కథ సింగరేణి బొగ్గు గనులకు సంబంధించినది. చిలుకా! నువ్వెటు వెళ్ళావు?, కమల స్త్రీ సమస్య ప్రధాన కథలు కాగా హీరో పిల్లల సమస్యకు సంబంధించినది. ఇక మిగిలిన మూడు కథలు తుఫాను, జైలు, ప్రత్యర్థులు "రాజ్యాంగ నైతికత"అలవడని సమాజంలో ఏ స్థాయి మనుషులైనా ఎంత అంతః సంఘర్షణకు సంక్షోభానికి అనివార్యంగా లోనవుతారో చూపిస్తాయి. ఈ ఉప శీర్షికలతోనే ఆయా కథలలో రాజ్యాంగ నైతికత ప్రతిఫలించిన తీరును విశ్లేషించవచ్చు.

1. అడవి - రాజ్యంగ నైతికత :విస్తీర్ణమైన అడవులు ఉన్న పది దేశాలలో భారతదేశం ఒకటి. దేశ భూభాగంలో అడవి 24శాతం ఉంది. అక్కడ నివసించే ప్రత్యేక జీవన విధానం, సంస్కృతి, భాషా కలిగిన ప్రజా సమూహాలను ఆదివాసీలు అంటారు. రాజ్యాంగం ప్రకారం వాళ్ళు షెడ్యూల్డ్ ట్రైబ్స్. దేశ జనాభాలో 8. 6శాతంగా ఉన్న మైనారిటీలు వీళ్ళు. రాజ్యాంగం ప్రాథమిక హక్కులలోని 29 వ అధికరణం భాష సంస్కృతులను పరిరక్షించుకొనే హక్కు వాళ్లకు ఉందని చెప్తున్నది. ఆదేశిక సూత్రాలలోని 46 వ అధికరణం వాళ్ళు దోపిడీకి గురి కాకుండా కాపాడాలని, వాళ్ళ ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించాలని చెప్పింది. అధికరణం 48 అడవులను, వన్యప్రాణులను సంరక్షించటం ద్వారా పర్యావరణాన్ని సంరక్షించటానికి ప్రభుత్వం కృషి చేయాలి అని చెప్పింది. ఇదిలా ఉండగా స్వాతంత్ర్యానతర భారత ప్రభుత్వం బ్రిటిష్ పాలకులు అడవిలోని కలప పై కన్నేసి అడవి పై ప్రభుత్వ యాజమాన్యాన్ని స్థిరీకరిస్తూ 1927లో చేసిన భారత అటవీ చట్టాన్ని అలాగే ఉంచి కొత్త అటవీ ప్రాంతాలను చేరుస్తూ అడవిపై అధికారాన్ని విస్తరింపచేసింది. రిజర్వడ్ ఫారెస్ట్, రక్షిత ఫారెస్ట్, కన్సర్వేషన్ ఫారెస్ట్, కమ్యూనిటీ రిజర్వ్ ఫారెస్ట్ వంటి రకరకాల పేర్లతో అడవి ప్రభుత్వ అధికారంలోకి, ప్రభుత్వ ఉద్యోగుల, ప్రైవేటు వ్యక్తుల ఆధిపత్యంలోకి వచ్చింది. రాజ్యాంగ విరుద్ధమైన పరిణామాలకు ఇది దారి తీసింది. ఇది ప్రజల జీవితంపై ఎలాంటి ప్రభావం వేసిందో ఎంపిక చేసుకొన్న అల్లం రాజయ్య కథలు చెప్తాయి.

'శివసత్తిశక్తి' రాజయ్య మొదటి కథ. మేకలను, గొర్రెలను పెంచటమే జీవనాధారమైన గొల్లలకు అడవితో సంబంధం నిత్యం. ఆ క్రమం లోనే తన మేకలమందను మేపుకోనటానికి ఊరిని ఆనుకొని ఉన్నఅడవిలోకి వెళ్ళిన గొల్ల "కత్తెరసాల"అటవీ అధికార వ్యవస్థ లో భాగమైన వాచర్, చౌకీదారుల దాష్టీకానికి గురి అయిన ఘటన రాజ్యంగహక్కుల ఉల్లంఘన సమాజంలో ఎలా అలవాటుగా చలామణి అవుతున్నదో స్పష్టం చేస్తుంది. మూడు రోజులలో రానున్న సద్దుల బతకమ్మకు ఒక మేకను అమ్మి వచ్చే యాభయ్ రూపాయలతో భార్యాపిల్లలకు బట్టలు, కప్పుకోను గొంగడి కొనాలని కలలు కనే అతి పేద కష్ట జీవి కత్తెరసాల. అతను మేకలను మేపుకొంటున్న అడవికి రక్షకులుగా వాచర్, చౌకీదార్ ఉన్నారు. చెట్టుమండలు నరికి మేకలకు వేస్తుంటే వాచర్ వచ్చి ''రాలసెట్టు నీ యవ్వ బూమిలదనుకున్నవా" అని గద్దించాడు. అడవిల బుట్టిన దానికి ఎవరూ నీళ్ళు పోసి పెంచలేదు కనుక ఆ చెట్టు మీద అందరికీ హక్కు అన్న సామాన్య మానవ నైతికత ఉన్నవాడు కనుక అతను వాచర్ గద్దింపులకు బెదరకపోగా ఊరికనె మేపు కుంటానమా అని ప్రశ్నించ గలిగాడు. ఈ సందర్భంలో మేకకు నాలుగు రూపాయల చొప్పున పుల్లర పేరు మీద వాళ్ళు వసూలు చేస్తున్నట్లు కూడా తెలుస్తుంది. దసరాకు మేకపిల్లను ఒక దానిని వసూలు చేయటానికి వాళ్ళుచేసిన విఫల యత్నం చుట్టూ ఈ కథ నడిచింది.

దోపిడీ నుండి రక్షణ పొందటం పౌరుల ప్రాథమిక హక్కులలో ఒకటి. ఆ హక్కుకు కత్తెరసాల నిరాకరింపబడ్డాడు. ఆ హక్కును ఉల్లంఘించినది ప్రభుత్వ ఉద్యోగవర్గం. ఈ హక్కులో భాగంగానే శ్రమశక్తిని దోపిడీ చెయ్యరాదని 23 వ అధికరణం చెప్తుంది. కత్తెరసాల శ్రమ సంపద మేకలమంద కాగా ప్రతిఫలం ఇవ్వకుండా మేకను బలవంతంగా తీసుకుపోవాలని ప్రయత్నించిన ప్రభుత్వోద్యోగులు నిస్సందేహం గా శ్రమ దోపిడీకి పాల్పడ్డట్లే. ఏ రాజ్యాంగం ప్రకారం పాలన నడపటానికి ప్రభుత్వం ఏర్పడిందో ఆ ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖలో ఉద్యోగులకే రాజ్యంగ నైతికత లేకపోవటం, వారిలో ఆ స్పృహను, హక్కుల పరిరక్షణ బాధ్యతను పెంచి పోషించే శిక్షణ వ్యవస్థ ఏదీ రాజ్యాంగం అమలులోకి వచ్చిన 23ఏళ్లకు కూడా రూపొందక పోవటం ఒక విషాదం. ఉద్యోగుల కంటే ముందు వాళ్ళు పౌరులు. పౌర స్పృహలో తన సౌఖ్యం ఇతరుల సౌఖ్యం పరస్పరం కలిసి ఉంటాయి. ఉద్యోగం మానవీయ బాధ్యతగా కాక అధికారంగా అర్థమై, ఆచరణలో భాగమైనప్పుడు కొత్త ప్రభుత్వం - ప్రజా ప్రభుత్వం కూడా పూర్వపు దోపిడీ ప్రభుత్వాలకంటే భిన్నంగా ఉండదు. రాజ్యాంగ నైతికత లోపించిన పాలన వైపు పాఠకుల దృష్టిని మళ్లించటం ఈ కథ సాధించిన ప్రయోజనం.

"ముసురు" కథ గ్రామంలోనే మొదలైనా అడవి ఇతివృత్తంలో ప్రధాన పాత్ర వహిస్తుంది. అడవిలో కలప అక్రమ రవాణా కాకుండా కాపాడవలసిన అటవీ అధికారులు స్వంత ఆస్తులను అమ్ముకున్నట్లు ఏదో ఒక ధర కట్టి పెద్దలకు అక్రమంగా అమ్మెయ్యగలరు. దొరలు అటవీ అధికారులతో లాలూచిపడి చౌకగా అక్రమ పద్ధతిలో తమ అవసరాలకు కావలసిన కలప సంపాదించుకోగలరు. ఆ రకంగా ఇరు వర్గాలు శ్రమతో సంబంధం లేకుండా సంపదలు పెంచుకుంటారు. ముసురు కథలో రామయ్య దొర మరీ ఘటికుడు. ముసురు పట్టిన రోజులలో నాగళ్ళు కట్టియ్య లేక పన్నెండు మంది పాలేర్లను పని లేకుండా కూర్చోబెట్టటం ఎందుకని అటవీ అధికారికి ఇవ్వవలసిన వెయ్యి పదిహేనువందలు మిగులుతాయని బండ్లు గట్టుకొని అడవికి బోయి పన్నెండు దూలాలకు సరిపడా టేకు కొట్టుకొని రమ్మని పురమాయించాడు. అదే సమయంలో మూడు రోజుల ఆముసురులో పనిలేక ఇంట్లో తిండిగింజలు లేక అడవికి వెళ్లి పోయిలోకి కట్టెపుల్లల తో పాటు అమ్ముకొని గింజలు కొనుక్కోవాలని ఒక టేకు తుంట కొట్టుకన్న మైసయ్య సైకిదారు చేతి దెబ్బలకు చావాల్సి వచ్చింది. అడవి మైసయ్యలాంటి బీదా బిక్కీ ప్రజల కనీస అవసరాల నుండి రక్షింప బడుతూ దొరల, అటవీ ఉద్యోగుల భక్షణకు సిద్ధాన్నమవుతున్న స్థితి రాజ్యాంగ హక్కులసలు అనుభవంలోకే రాని వాళ్ళు, రాజ్యాంగ సూత్రాలనసలే పట్టించుకోని వాళ్ళు రెండు భిన్న వర్గాలుగా ఎదురెదురుగా నిలబడిన సామాజిక వైరుధ్యాన్ని మన కళ్ళ ముందు ఉంచుతుంది.

(మిగతా వచ్చే సంచికలో..)



సీరియల్

(కార్ల్‌మార్క్స్ కాపిటల్‌పై ఫ్రాన్సిస్ వీన్ ఇంగ్లిష్‌లో రాసిన విశ్లేషణాత్మక పుస్తకానికి ముక్తవరం పార్థసారథి తెలుగు అనువాదం ఈ సంచిక నుంచి అరుణతార పాఠకులకు అందిస్తున్నాం - సం.)

# మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం

- ఫ్రాన్సిస్ వీన్

## 1
## అజ్ఞాత కళాఖండం

1867 ఫిబ్రవరిలో, తన "పెట్టుబడి" మొదటిభాగం రాతప్రతిని ప్రింటింగ్‌కు పంపించటానికి ముందు ఓనోరే దు బాల్జాక్ కథ The unknown Masterpiece చదవమని ఫ్రెడ్రిష్ ఎంగెల్స్‌ను కోరాడు కార్ల్‌మార్క్స్. "ఈ కథ కూడా ఒక మాస్టర్ పీస్. అద్భుతమైన వ్యంగ్య రచన" అని సిఫార్సు చేశాడు.

మార్క్స్ సలహాను ఎంగెల్స్ పాటించాడో లేదో మనకు తెలియదు. చదివి ఉంటే, తన మిత్రుని కోరికలోని వ్యంగ్యం అతనికర్థమయ్యేది. ఇది తన మీద తాను జోకులు వేసుకోవాల్సిన సమయమా! ఒక ప్రముఖ చిత్రకారుడు ఫ్రెన్‌హోఫర్ కథ The unknown Masterpiece. పదేళ్లు శ్రమించి ఒక చిత్రం పూర్తి చేశాడు. కళా ప్రపంచంలో ఇదో విప్లవం సృష్టించబోతున్నది. ఇంతవరకు చిత్రకళా చరిత్రలో వాస్తవికతను ఇంత ప్రతిభావంతంగా రంగులు, రేఖల్లో పట్టుకున్న వాళ్లు లేరు. ఒకనాడు తన మిత్రులు, సాటి కళాకారులు పూసాన్, పోర్బస్‌లకు తన అపురూప చిత్రం చూపిస్తాడు. కాని వాళ్లు ఏం చెప్పాలో తెలియక కళ్లు తేలేస్తారు. కాన్వాస్ మీద వెదజల్లిన కొన్ని రంగులు. అడ్డదిడ్డంగా గీసిన గీతలు. వాళ్లు నోరు మెదపక పోవటం చూసి, తన కళాద్భుతానికి అవాక్కయ్యారనుకున్నాడు ఫ్రెన్‌హోఫర్.




"నేనింత గొప్పగా వెయ్యగలనని మీరూహించలేదు గదూ!"

ఆ తర్వాత, తన మిత్రులిద్దరూ ఏదో గుసగుసలాడుకోవటం వినిపిస్తుంది. చేదు నిజం ఫ్రెన్‌హోఫర్ అంగీకరించక తప్పదు. కాన్వాస్ మీద రంగులెంత ఎక్కువయ్యాయంటే, ఏదేమిటో కూడా పోల్చుకోవటం వీలుపడదు. అసలు, చూడటానికక్కడ ఏమైనా స్పష్టంగా కనిపిస్తే గదా!

"ఏమీ చూడలేకపోతున్నారా?" నమ్మలేకపోతున్నట్టుగా అడిగాడు ఫ్రెన్ హోఫర్.

"ఏముందక్కడ?" అని తనలో తను మాట్లాడుకున్నట్టుగా పూసాన్‌ను అడిగాడు పోర్బస్.

"ఏమీ కనిపించడం లేదా?" అని పిచ్చిగా అరుస్తూ "కళ్ల మీద పొర కమ్మిందా? మూర్ఖుడా. చవకబారు వెధవా, నీచుడా" అంటూ పూసాన్‌ను వెనక్కుతోసి, "ఈ చవటనెందుకు వెంటతెచ్చావు - పోర్బాస్? ఏమిటి? నీకూ కనిపించటం లేదా? నీకు కూడా నేను చులకనైపోయానా? నేను నీ ఫ్రెండుని. బొమ్మ పాడు చేశానా నేను?' అంటూ హతాశుడై గద్గద స్వరంతో అడిగాడు ఫ్రెన్‌హోఫర్.

పోర్బస్‌కు ఏం చెప్పాలో తోచలేదు. కాని రక్తహీనమై పాలిపోయిన తన మిత్రుడి మొహం చూస్తుంటే జాలేసింది. కాన్వాస్ వైపు వేలు చూపుతూ, "చూడు!" అన్నాడు.

ఫ్రెన్‌హోఫర్ తన కళాఖండం వైపు దిగాలుగా చూశాడు.

"అంతేనా? అంతేనా? దీని మీద పదేళ్లు పని చేశాను!" అంటూ కుర్చీలో కూలబడి వెక్కివెక్కి ఏడ్చాడు.

ఆ తర్వాత, మిత్రులిద్దర్నీ బయటికి గెంటివేసి, తాను వేసిన చిత్రాలన్నీ తగలబెట్టి, ఆత్మహత్య చేసుకున్నాడు ఫ్రెన్‌హోఫర్.

మార్క్స్ అల్లుడు పాల్ లఫార్గ్ ప్రకారం బాల్జాక్ కథ మార్క్స్ మీద గాఢమైన ముద్ర వేసింది. అది తన గురించి రాసిందే "అనుకొన్నాడు". మార్క్స్ కూడా తన మాస్టర్ పీస్ మీద అనేక సంవత్సరాల పాటు కృషి చేశాక ఎవరెప్పుడడిగినా ఫ్రెన్‌హోఫర్‌లాగే సమాధానాలిచ్చేవాడు. "ఇంకొంత పని బాకీ ఉంది", "చిన్న చిన్న మార్పులు చేయాలి". "రాసింది మరొక్కసారి చదవాలి కదా". "ఒక చోట పొరబాటు జరిగింది ఇవాళ ఉదయమే తెలుసుకున్నాను. సరిచేయాలి." - ఇలా.

మార్క్స్ తొలుత చేసిన ప్రకటన ప్రకారం, 1846 నాటికే పుస్తకం ప్రచురణ కావలసిన గడువు ముగిసింది. "రాతప్రతి మొత్తం మరోసారి పరిశీలించకుండా ప్రచురణకు అంగీకరించలేను. వస్తువు విషయంలోనూ, శైలీ పరంగానూ కొన్ని మెరుగులు దిద్దాల్సి ఉంది. ఆర్నెల్లు వరుసగా రాశాను. ఇప్పుడు యథాతథంగా ప్రచురించటం సబబు కాదు" అని





ప్రచురణకర్తకు రాశాడు మార్క్స్. పన్నెండేళ్ల తర్వాత కూడా ముగింపు కనుచూపు మేరలో కనిపించలేదు.

"నత్త నడక నడుస్తోంది. అధ్యయనం చెయ్యాల్సిన కొత్త సబ్జెక్టుల వల్ల కొంత ఆలస్యం జరుగుతున్న మాట నిజమే," మార్క్స్ మహా పర్ఫెక్షనిస్టు. ఏదీ ఆషామాషీగా రాయడు. ఫ్రెన్‌హోఫర్‌లాగ ఎప్పుడూ కొత్త రంగులద్దుతూనే ఉంటాడు. పెట్టుబడి రాసే క్రమంలో మొదట గణితం నేర్చుకున్నాడు. తర్వాత ఖగోళశాస్త్రం అధ్యయనం చేశాడు. రష్యాలోని భూ సమస్య గురించి తెలుసుకోవడానికి రష్యన్ నేర్చుకున్నాడు. మరోసారి ఫ్రెన్‌హోఫర్‌నుదహరిద్దాం. 'ఇక ముగిసింది' అనుకున్న క్షణంలో ఏదో మిస్సయిందని తెలుస్తుంది. ఎక్కడో ఒకచోట రంగు అలా ఉండకూడదనిపిస్తుంది. "లోపం గమనించింతర్వాత సరిచెయ్యకుండా ఎలా ఉంటాం? అసలు మనశ్శాంతి కూడా ఉండదే. ప్రకృతిని వివిధ రకాలుగా అధ్యయనం చెయ్యటానికి టర్కీ, గ్రీస్, ఏషియా కూడా పోవాలనుకుంటున్నాను."

తన మాస్టర్‌పీస్, పాఠకుల చేతుల్లో పెట్టేముందు మార్క్స్‌కు బాల్జాక్ కథ ఎందుకు గుర్తుకొచ్చింది? ఇన్నేళ్ల తన శ్రమ వృథా అవుతుందను కున్నాడా? వాస్తవికతను సంపూర్ణంగా దర్శింప చెయ్యాలనే తన ప్రయత్నం పాఠకులు అర్థం చేసుకోలేరేమోనని సందేహించాడా? ఆత్మవిశ్వాసమూ, ఆత్మశంకా కలసిన వ్యక్తిత్వం మార్క్స్‌ది. రాబోయే విమర్శను ముందుగానే ఊహించి, ముందుమాటలో "కొత్త విషయాలు తెలుసుకోవాలనుకునే పాఠకుడు, స్వంతంగా ఆలోచించగలిగిన పాఠకుడి కోసం ఈ పుస్తకం" అని జాగ్రత్తపడ్డాడు. అంతా బాగానే ఉంది గాని మార్క్స్ తనను తాను ఫ్రెన్‌హోఫర్‌తో పోల్చుకోవడమే అసంబద్ధమని పిస్తుంది. ఫ్రెన్‌హోఫర్ ఆర్టిస్టు. పొలిటికల్ ఎకానమిస్టు, తాత్త్వికుడు, చరిత్రకారుడు, వివాదస్పద రాజకీయాలు చేస్తున్న వాడు కాదు.

అయితే The unknown Masterpieceను పెట్టుబడితో పోల్చడంలో మరో వ్యంగ్యార్థం దాగి ఉందంటాడు అమెరికన్ మార్క్సిస్ట్ రచయిత మార్షల్ బెర్మాన్. ఫ్రెన్‌హోఫర్ చిత్రాన్ని బాల్జాక్ వర్ణించిన పద్ధతి చూస్తే అది ఇరవయ్య శతాబ్దంలో బాగా ప్రచారం పొందిన నైరూప్య చిత్రం (Abstract Paining) లాగుంది. కేవలం గజిబిజి రంగుల గందరగోళం మాత్రమే పాత తరం అందులో చూస్తే, తరువాతి తరానికి అందులో అంతర్లీనంగా ఒక అద్భుత సౌందర్యం, అర్థవంతమైన రంగుల మేళవింపు కనపడ్డాయి. ఏ విషయమూ స్పష్టంగా ఇదమిద్ధంగా చెప్పకపోవడం మార్క్స్ ప్రత్యేకత. ఆయన వాదనలు open-endedగా ఉంటాయి. ఏదైనా ఖచ్చితంగా చెప్పాలనుకునే పందొమ్మిదో శతాబ్ది మేధావులు దీన్ని అర్థం చేసుకోలేదు. మార్క్స్ సమకాలీనుల అభ్యంతరాలను అధిగమించి అత్యంత సంక్లిష్టమైన ఇరవయ్యవ శతాబ్ది మాదర్నిజంలోకి దూసుకొచ్చింది దాస్ కాపిటల్. ఫ్రెన్‌హోఫర్ ప్రయోగాత్మక చిత్రకారుడైనట్టే, మార్క్స్ ప్రయోగాత్మక రచయిత. "ధృడంగా, సాలిడ్‌గా కనిపించేదంతా కరిగి గాలిలో కలసిపోతుంది" అంటాడు కమ్యూనిస్ట్ మేనిఫెస్టోలో. ఈ వాక్యం T.S.Eliot రాసిన Hollow Menను గుర్తు చేస్తుంది. Yeats "Things fall apart; The Centre Cannot Hold" కు కూడా ప్రేరణ కావచ్చు. దాస్ కాపిటల్ రాసే నాటికి, మార్క్స్ సాంప్రదాయిక కథన పద్ధతులను దాటుకొని రాడికల్ సాహిత్య పద చిత్రాల వైపు కదిలాడు. పురాణగాథల నుండీ, ప్రపంచ సాహిత్యం నుండీ, ఫాక్టరీ ఇన్‌స్పెక్టర్ల రిపోర్టులు, జానపద కథల దాకా పలు ఉదాహరణలు "పెట్టుబడి"లో కనిపిస్తాయి. ఒక రకంగా Ezra Pound Cantos, లేదా T.S. Eliot Waste Land ఇలాగే ఉంటాయి. Schoerberg సంగీతం లాగా, ఖాఫ్కా కథల్లాగా అదో అపరిచిత వింత, భీతావహ ప్రపంచం.

తనను తాను సృజనాత్మక కళాకారుడిగా Poet of dialectic గా భావించుకొన్నాడు కార్ల్‌మార్క్స్. 1865 ఎంగెల్స్‌కు రాసిన ఒక లేఖలో, "ఈ పుస్తకంలో ఎన్ని లోపాలుండనీ సాహిత్యపరంగా, కళాత్మకంగా పర్ఫెక్ట్‌గా వచ్చింది" అంటాడు. ప్రజల భౌతిక ప్రయోజనాలు, వాళ్లను ఆచరణకు ప్రేరేపించే కారణాలు తెలుసుకోవటానికి తత్త్వవేత్తల్నీ, రాజకీయ విశ్లేషకుల్నీ ప్రశ్నించి లాభం లేదు. కవులూ, నవలా రచయితలే ఈ విషయంలో ఎక్కువగా ఉపయోగపడతారనుకున్నాడు. 1868 డిసెంబర్‌లో ఎంగెల్స్‌కు రాసిన ఒక లేఖలో బాల్జాక్ నవల The village Priest నుండి ఒక పేరా కాపీ చేసి పంపిస్తూ తన ఆర్థిక పరిజ్ఞానం ప్రకారం బాల్జాక్ పరిశీలన వాస్తవికంగా ఉందో లేదో చెప్పమన్నాడు. (సాంప్రదాయికవాదీ, రాచరిక పాలననూ సమర్థించే బాల్జాక్ మార్క్స్‌కు ఆదర్శం కాగూడదు కాని "తమ వ్యక్తి గత ఇష్టాయిష్టాలను అధిగమించి సామాజిక వాస్తవికతను చిత్రిస్తారు గొప్ప రచయితలు" అన్నాడు మార్క్స్.) కేవలం ఆర్థిక శాస్త్ర గ్రంథం రాయదలచుకుంటే సులభంగానే ఆ పని పూర్తి చేయగలిగేవాడు. కానీ ఆయన లక్ష్యం దానికి మించింది. "పందొమ్మిదవ శతాబ్దంలో మానవ సమాజ శ్రేయస్సు గురించి తీవ్రంగా కలత చెందిన మహోన్నత వ్యక్తుల్లో ఒకడు దాస్ కాపిటల్ రచయిత. బీథోవెన్, గోయా, టాల్‌స్టాయ్, దొస్తోయేవస్కీ, బెచ్నెన్, నీచె, వాన్‌గోల సరసన ఉంటాడు. వాళ్లు ప్రశాంతంగా బతకలేదు. మననూ బతకనివ్వలేదు. వారి కృషి పునాదుల మీద నిల్చున్నామీనాడు మనం" అంటాడు బెర్మాన్ మార్షల్. అయినా ఎంత మంది మార్క్స్‌ను గొప్ప రచయితల, కళాకారుల జాబితాలో చేర్చటానికిష్టపడతారు? ఈ ఆధునికానంతర కాలంలో కూడా, సాంప్రదాయక పద్ధతులను ధిక్కరించిన 'పెట్టుబడి' కథనం తలా తోకా లేకుండా, అర్థం కాని శైలిలోనే సాగింది అంటారనేక మంది. 'పెట్టుబడి'ని మరోసారి, సరికొత్తగా పరిశీలించమని పాఠకులను కోరటమే రచయిత (ఫ్రాన్సిస్ వీన్) ఉద్దేశం. బీథోవెన్ సంగీతాన్ని వినగలిగినవాళ్లు, గోయా చిత్రాలను ఆనందించగలిగిన వాళ్లు, టాల్‌స్టాయ్ పుస్తకాలతో కుస్తీ పట్టగలిగిన వాళ్లు దాస్ కాపిటల్ చదివి అనేక కొత్త విషయాలు నేర్చుకుంటారు. మార్షల్ బెర్మాన్ అందర్నీ ఒకే ప్రశ్న అడిగాడు. "పెట్టుబడి (దారీ వ్యవస్థ) ఉన్నంత కాలం దాస్ కాపిటల్ ప్రాధాన్యత ఎలా తగ్గుతుంది?"

తన మాస్టర్‌పీస్‌ను ముగించలేకపోయాడు మార్క్స్. ఆయన జీవితకాలంలో మొదటి భాగం మాత్రమే ప్రచురితమైంది. మరణానంతరం ఆయన కాగితాలు, నోట్స్ ఆధారంగా తరువాతి సంపుటాలను ప్రచురణకు సిద్ధం చేశారు. మార్క్స్ ప్రతిసారీ, ఇలా జరిగే అవకాశముందనే చెబుతాడు తప్పకుండా జరిగి తీరుతుందని చెప్పడు. అంటే, ఆయన కృషిలో ఓపెన్ ఎండెడ్‌నెస్ ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ స్వభావం కూడా ఇంచుమించు ఇలాంటిదే. లక్ష్య సాధనా క్రమంలో తనను హింసించుకున్న మహానుభావుడు మార్క్స్. ఆయన మాస్టర్ పీస్ గురించి తెలుసుకునే ముందు ఎందుకాయన హింసించుకున్నాడు, ప్రేరణ ఏమిటో తెలుసుకుందాం.

## కొటేషన్స్...



### బాల్జాక్ గురించి మార్క్స్

"పారిశ్రామిక ఉత్పత్తుల్ని రెట్టింపు ధరకు అమ్మలేకపోతే వాణిజ్యమనేదే సాధ్యం కాదు" అంటాడు బాల్జాక్ తన The Village Priestలో. మీ అభిప్రాయం ఏమిటి?"

### డిసెంబర్ 14, 1868 నాడు ఎంగెల్స్‌కు రాసిన లేఖ నుండి

"The unknown Masterpiece, Melmoth Reconciled చదవండి. రెండూ మాస్టర్ పీసెస్. గొప్ప వ్యంగ్య రచనలు."

ఫిబ్రవరి, 25, 1867 నాటి ఎంగెల్స్‌కు రాసిన ఉత్తరం నుండి ... "మనుషులలోని దురాశను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు బాల్జాక్. వడ్డీవ్యాపారి గోబ్‌సెక్ తన వృద్ధాప్యంలో వినియోగ వస్తువులన్నీ విలువ చేసుకుని మహదానందపడిపోతాడు."

*పెట్టుబడి రెండవభాగం పేజీ 645 (ఫుట్‌నోట్)*

"పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థలో, పెట్టుబడిదారుకాని ఉత్పత్తిదారుడు కూడా పెట్టుబడిదారీ సంప్రదాయాలకు బద్ధుడై ఉంటాడు. వాస్తవిక పరిస్థితుల్ని యథాతథంగా చిత్రించగల" బాల్జాక్ తన The Peasants నవలలో ఇలా రాస్తాడు. ఒక పేద రైతు, వడ్డీ వ్యాపారిని సంతోషపెట్టడానికి అతడికి చిన్న చిన్న పనులన్నీ చేసి పెట్టి ఇవన్నీ నేను ఊరికే ఏం చెయ్యటం లేదులే అని తనకు తాను నచ్చచెప్పుకుంటాడు. ఎందుకంటే అతడు శ్రమను మాత్రమే ఉచితంగా ఇస్తున్నాడు. డబ్బు ఖర్చుపెట్టడం లేదు. వడ్డీ వ్యాపారి, కేవలం కూలీ మాత్రమే డబ్బు రూపంలో ఇచ్చి మిగతా పనులన్నీ వెట్టిచాకిరీ లాగ చేయించుకుంటాడు. ఫలితంగా రైతు మరింతగా వడ్డీ వ్యాపారి అల్లిన సాలెగూటిలో చిక్కుకుంటాడు. చివరకు, తన సొంత పొలంలో పని చేసుకునే సమయం కూడా చిక్కదతడికి.

*పెట్టుబడి మూడవ భాగం పేజీ 52*

'మా దేశంలో కూలీలున్నారు గానీ కార్మిక వర్గం లేదు. వీళ్ల పరిస్థితి కార్మికుల కన్న అధ్వాన్నం' అంటాడు రష్యన్ రచయిత "ఫెరోవెస్కీ".

ఫిబ్రవరి 10, 1870 నాడు ఎంగెల్స్‌కు మార్క్స్ రాసిన లేఖ

### షెల్లీ, బైరన్‌ల గురించి

"వీళ్లిద్దర్నీ అర్థం చేసుకున్న వాళ్లకూ, ఆరాధించే వాళ్లకూ ఒక విషయం స్పష్టంగా తెలుస్తుంది. బైరన్ తన ముప్పై ఆరవ ఏట మరణించటం మంచిదైంది. అతను మరికొంత కాలం బతికితే రియాక్షనరీ బూర్జువాలాగ మారిపోయేవాడు. ఇరవై తొమ్మిదవ ఏట షెల్లీ మరణించటం ఒక నిజమైన విషాదం. అతడు విప్లవకారుడు. బతికితే సోషలిస్టు పోరాట యోధుల ముందు వరుసలో నిలబడేవాడు."

మార్క్స్ కూతురు ఎలినార్ మార్క్స్ "సోషలిస్టుగా షెల్లీ"లో మార్క్స్ మాటల్ని ఇలా ఉదహరించింది (1888)

### కొందరు ఇంగ్లిష్ నవలా రచయితల గురించి

"ఇటీవల ఇంగ్లిష్ నవలా రచయితలను చదివితే, రాజకీయ నాయకులు, సంస్కరణవాదులు వగైరాల నుండి తెలుసుకున్న దాని కన్నా చాలా ఎక్కువ తెలుస్తుంది. ముఖ్యంగా మధ్య తరగతి జీవితాలను వాళ్లు అత్యంత వాస్తవికంగా చిత్రించారు. డికెన్స్, థాకరే, షార్లట్ బ్రాంటీ, మిసెస్ గాస్కెల్‌లు ఈ దిశగా అద్భుతమైన కృషి చేశారు. "ఈ మధ్య తరగతి వాళ్లు, తనపై వర్గం వాళ్ల దగ్గర ఎంత వినయ విధేయతలు ప్రదర్శిస్తారో, తమకన్నా కిందివాళ్ల దగ్గర అంత క్రూరంగా, నిరంకుశంగా ఉంటారు," అని రుజువు చేశారు."

మార్క్స్ The English Middle Class పేరుతో New York Tribuneలో ఆగస్టు 1, 1854 నాడు రాసిన వ్యాసం నుండి.

### ఫ్రాన్సిస్ వీన్



ప్రముఖ బ్రిటిష్ రచయిత ఫ్రాన్సిస్ జేమ్స్ బేర్డ్ వీన్ (జననం 1957) విద్యాభ్యాసమంతా లండన్‌లోనే స్కూళ్లలోనే కొన సాగింది గాని పదహారవ ఏటనే 'ప్రత్యామ్నాయ సమాజం'లో చేరాలనే ఆశయంతో స్కూలు జీవితానికి వీడ్కోలు చెప్పాడు. తరువాతి రోజుల్లో జర్నలిజంను వృత్తిగా ఎంచుకుని గార్డియన్, న్యూ స్టేట్స్‌మెన్ పత్రికల్లో పనిచేశాడు.

ఈయన రాసిన కార్ల్‌మార్క్స్ జీవిత చరిత్ర, 1999లో Deutscher Memorial Prize గెల్చుకొని ఇరవై భాషల్లోకి అనువాదితమైంది. ఆ తర్వాత Das Capital జీవిత చరిత్ర రాశారు వీన్ (ఈ సీరియల్‌కు మూలమిదే). వివిధ పత్రికల్లో వీన్ రాసిన వ్యాసాలు Hoohahs and Passing Frenzies పేరుతో పుస్తకంగా వెలువడి 2003లో ఆర్వేల్ ప్రైజ్ గెల్చుకున్నాయి. BBC Radio 4 లో వీన్ పలు కార్యక్రమాలు నిర్వహించాడు. రేడియో కోసం ఈయన The Lavender List పేరుతో ఒక డాక్యుడ్రామా రాశాడు.

బ్రిటిష్ ప్రభుత్వ విదేశాంగ విధానం పట్ల పలుసార్లు తన నిరసన తెలియజేశాడు చేశారు వీన్.

ప్రముఖ రచయిత క్రిస్టఫర్ హిచెన్స్‌కు ఈయన మంచి మిత్రుడు.

**వీన్ ఇతర పుస్తకాలు :**

- ది సిక్స్‌టీస్
- టెలివిజన్ ఎ హిస్టరీ
- బాటిల్ ఫర్ లండన్
- హు వాస్ డాక్టర్ చార్లెటి బాచ్
- హౌ మంబో జంబో కాన్‌కర్డ్ ది వరల్డ్ వగైరా...



# సంస్కృతి ముసుగులో మార్కెట్ శక్తుల అరాచకత్వం

- ఎం.కె. కుమార్

సంస్కృతి పేరుతో ఆధిపత్య సంస్కృతి చేస్తున్న దాడిని ఎదుర్కోవడం అభ్యుదయకర శక్తులకు, ప్రజాస్వామిక వాదులకు ఒక సవాలుగా మారింది. మార్కెట్ వ్యవస్థ తన అవసరాల మేరకు సంస్కృతికి నూతన అర్థాలను చెపుతూ, తన మాధ్యమాల ద్వారా విస్తృతంగా ప్రజల మెదళ్లలోకి బలవంతంగా చొప్పిస్తూ, అదే సంస్కృతి అనే భావనను అందరికీ కలుగజేస్తోంది. వినోదం పేరిట టీవీలు, సినిమాలు, ఇంటర్నెట్లు అందిస్తున్న ప్రసారాలలో బలమైన రాజకీయ అభిప్రాయాలను చెలామణీ చేస్తున్నారు. రైతు నుండి సైంటిస్ట్ వరకు వాస్తును, మతాన్ని, దేవుణ్ణి, మూఢ నమ్మకాలను నమ్ముతున్నారు. శ్రీహరికోటలో ప్రయోగించే ప్రతి శాటిలైటుకు కుంకుమ, పసుపు, కొబ్బరికాయ తప్పనిసరి. మార్కెట్ సంస్కృతి ఈ మధ్య కాలంలో శృంగారం పేరుతో బూతును యువత మెదళ్లలోకి చొప్పిస్తోంది. మూడు నెలల పసికందు నుండి 70 ఏళ్ల వృద్ధురాలి వరకు అత్యాచార బాధితులవుతూనే వున్నారు. మరోవైపు మతంపేరిట ఉన్మాదాన్ని, జాత్యహంకారాన్ని, కుల దురహంకారాన్ని ఇదే ప్రచార మాధ్యమాలు ప్రచారం చేస్తున్నాయి. ఇవన్నీ ప్రజలలో వినిమయతత్వాన్ని పెంచడమనే ఒకే ఒక్క ఆర్థికపరమైన సూత్రీకరణతో పని చేస్తున్నాయి. సామ్రాజ్యవాదం సహజ నిక్షేపాల సొంతానికై చేస్తున్న అనైతిక, అక్రమ యుద్ధాలకు సాధికారితను, ఆమోదాన్ని సంపాయించుకోవడానికి ఆధిపత్య సంస్కృతిని వ్యాపింపజేస్తున్నది. పెట్టుబడి లాభాల కోసం మాత్రమే కాదు, ప్రజల చైతన్యాన్ని తమకు అనుకూలంగా మార్చుకోవడానికి, తమ చర్యలకు పెద్ద ఎత్తున సామాజిక బృందాల ఆమోదాన్ని పెంచుకోవడానికి పనిచేస్తోంది. అందుకే అమెరికా ఉగ్రవాద నిర్మూలన పేరుతో సద్దాంహుస్సేన్‌ను చంపినా, బిన్‌లాడెన్‌ను చంపినా సమాజంలో ఆమోదం దొరికింది. ఇరాక్, పాకిస్తాన్‌లపై ఆ దేశ మెజారిటీ ప్రజల ఆకాంక్షలకు వ్యతిరేకంగా అమెరికా ఏకపక్ష, అక్రమ దాడులను చేస్తుందని, తద్వారా వేలమంది సాధారణ ప్రజలు చనిపోతున్నారనే విషయం చర్చనీయాంశం కావడం లేదు.

ఆధిపత్య సంస్కృతిలో పెట్టుబడి, మెజారిటీ మతతత్వం కవల పిల్లల్లా ఒదిగిపోతాయి. దీన్ని మనదేశంలో మోడీ సేన అఖండ హిందూ రాజ్యస్థాపన పేరుతో, ప్రజలందరూ ఒక్కటే అనే పేరుతో అమలుపరుస్తున్నది. భిన్నమైన సంస్కృతులను, ఆచారాలను, జాతులను, మతాలను నిర్మూలించేసి ప్రతి ఒక్కరూ రాముడ్ని భగవంతుడిగా, భగవద్గీతను రాజ్యాంగంగా ఆచరించేలా చేయాలని వారు ప్రయత్నిస్తున్నారు. ముస్లిం దేశాలలో వారు ఖురాన్ మతగ్రంథం ప్రాతిపదికన వారి రాజ్యాంగాలను రూపొందించుకున్నప్పుడు, మనదేశంలో హిందూ మతగ్రంథాల పేరుమీద రాజ్యాంగాన్ని పునర్ నిర్మించుకుంటే తప్పేముంది? అని హిందూత్వ శక్తులు వాదిస్తున్నాయి. లౌకికవాద విలువల ప్రాతిపదికన రూపొందించుకున్న మన రాజ్యాంగం అన్ని మతాలకు, సంస్కృతి వైవిధ్యాలకు సమాన హోదా కల్పిస్తూ, పరిపాలనలో మతవాదుల పెత్తనం, దాని భావజాలం పని చేయకూడదని చెప్పినప్పటికీ, హిందూత్వశక్తులు సుమారు 70 కోట్ల ప్రజల(19 కోట్ల ముస్లింలు, 26 కోట్ల దళితులు, 30కోట్ల వెనుకబడిన వర్గాల) ఆకాంక్షలకు, అభిప్రాయాలకు, సంస్కృతికి భిన్నంగా నడుచుకోవాలని భావిస్తోంది. ఈ భావనే గుజరాత్ మారణకాండకు దారితీసింది. అదే విధ్వంసకర నమూనా దేశవ్యాప్తమవబోతోంది.

సంస్కృతి దైనందిన జీవితంలో భాగం. అట్లని సంస్కృతి భిన్న జాతులకు సంబంధించి భిన్నమైనప్పటికీ, వాటి మధ్య అంతస్సారంలో ఒక సాధారణ అంశం వుంటుంది. అస్తిత్వాలు భిన్నమైనప్పుడు సంస్కృతి భిన్నంగా వుండాలని వాదించేవారు, సారంలో వాటన్నిటి మధ్య వున్న విశ్వజనీనతను చూడ నిరాకరిస్తారు. అట్లని సంస్కృతి మతానికి మాత్రమే సంబంధించింది కాదు. అది ప్రధానంగా మానవ సామాజిక కార్యక్రమాలకు, ఉత్పత్తి సంబంధాలకు సంబంధించినది. నాగరికత అభివృద్ధిలో సంస్కృతి విడదీయరానిది. ప్రకృతి-మానవుడి మధ్య జరుగుతున్న నిరంతర ఘర్షణే మానవ వికాసానికి బాటలు వేసింది. ప్రకృతికి మానవ మేధస్సు తోడవడంతో విభిన్న సాధనాలు, సాంకేతికలు అభివృద్ధి చెందాయి. ఆ క్రమంలో సృజనాత్మకమైన ఆలోచనలు, భావ వ్యక్తీకరణలు అభివృద్ధి చెందాయి. వీటినే మనం సంస్కృతి అనంటున్నాం. మానవుడు తన భౌతిక అవసరాల కోసం తన జ్ఞానాన్ని నిరంతరం మెరుగుపర్చుకుంటున్నాడు. అందులో భాగంగా విభిన్న ఉత్పత్తి విధానాలు చెలామణిలోకి వచ్చాయి. ఉత్పత్తి, పునరుత్పత్తి సామాజికాంశాలను విపరీతంగా ప్రభావితం చేస్తాయి. ఈ ఉత్పత్తి సాధనాలను చేతుల్లో పెట్టుకున్న శక్తులే సంస్కృతిని అదుపులో పెట్టుకుంటాయి. ఆ సంస్కృతిని వ్యతిరేకించే శక్తులు తమ భావజాలాన్ని సామాజీకరించే ప్రయత్నం చేస్తూనే వుంటారు. ఈ ఘర్షణ పూరిత వాతావరణమే సంస్కృతీ అభివృద్ధికి దారితీస్తుంది. రాజ్యం, పాలకవర్గాల చేతుల్లో సంస్కృతి వాటికనుకూలమైన రూపాలను తీసుకుంటుంది. దాన్ని ఆధిపత్య సంస్కృతిగా స్థిరీకరింప జేయడానికి రాజ్యం ప్రాపకం కోసం తపనబడే మార్కెట్, మతతత్వశక్తులు నిరంతరం ప్రణాళికాబద్ధమైన ఆచరణను చేపడుతాయి. మానవ జీవితాన్ని సంస్కృతి చాలా బలంగా ప్రభావం చేస్తున్నందువల్ల, పాలకవర్గాలు, మార్కెట్ శక్తులు ప్రజల ప్రశ్నించే చైతన్యాన్ని, హేతుబద్ధతను తగ్గించేందుకు ఆ సంస్కృతినే బలమైన ఆయుధంగా వాడుకుంటాయి. మానవుడిలో మెదడు క్రమానుగతంగా అభివృద్ధి చెందుతున్న ప్రతి దశలోను సంస్కృతి అవిభాజ్యంగా అభివృద్ధి చెందుతూనే వుంది.

వస్తువు పట్ల వ్యామోహాన్ని, దాన్ని స్వంతం చేసుకోవాలనే

పిచ్చిని, అది లేకపోతే జీవితం వృథా అనే భావనను నిరంతరం మార్కెట్ సంస్కృతి బోధిస్తుంటుంది. ఆ వస్తువును కొనుగోలుచేసే శక్తిని ప్రజలకు రాజ్యమే చిన్న చిన్న ఉపాధిల ద్వారా కల్పిస్తుంది. బ్యాంకులు లోన్ల ద్వారా మానవుని శక్తికిమించిన కోరికలను తీర్చడానికి ఉపయోగపడుతుంటాయి. అందుకే వ్యక్తుల అభిరుచులను, ఇష్టాలను, వ్యక్తీకరణలను సైతం ప్రభావితం చేయడానికి ఆధిపత్య సంస్కృతి ప్రయత్నిస్తుంటుంది. ఒక యువకుడు తనకు రేస్‌బైక్, టచ్‌స్క్రీన్ సెల్‌ఫోన్, బ్రాండెడ్ దుస్తులు, వాచ్‌లు, షూలు వుండాలని, అలాగే అందమైన గర్ల్‌ఫ్రెండ్ ఉండాలని వినిమయ సంస్కృతి వల్ల కోరుకునేలా మార్కెట్ చేస్తుంది. ఆ వస్తువుల పట్ల ఇష్టాన్ని కలగజేయడానికి ప్రచార మాధ్యమాలు పనిచేస్తుంటాయి. గర్ల్‌ఫ్రెండ్ లేకపోతే బలవంతంగానైనా ఆమెను సాధించుకోవడానికి యాసిడ్ దాడులను, అత్యాచారాలను దారులుగా వాడుకోవడానికి కావలసిన ముడిసరుకును ఇదే ప్రచార మాధ్యమాలు అందిస్తాయి. ఇక్కడ బలవంతపు ప్రేమ, పెళ్లిళ్లు ఫక్తు ఫ్యూడల్ భావజాలానికి సంబంధించిన పాత సంస్కృతైనప్పటికీ, అది ఇంకా కొనసాగుతోంది. దీనికి కారణం పెట్టుబడి.. ఫ్యూడల్ శక్తులతో చెలిమిచేయడమే. అందుకే అలనాటి సామాజిక దురాచారాలైన కుల, వర్ణ, ప్రాంతీయ, జెండర్, మత వివక్షలు కొనసాగుతున్నాయి. వీటి అవసరం మార్కెట్‌కు ఉన్నంత కాలం ఇవి సజీవంగానే వుంటాయి. ఇవి నిజమైన అభివృద్ధికి అడ్డంకి అయినప్పటికీ అమానవీయమైన సంస్కతి చెలామణి కావడానికి పెట్టుబడి రాజీధోరణిని అవలంబిస్తోంది. జనాభా పెరగాలని, తద్వారా లభించిన చౌకశ్రమతో త్వరగా పారిశ్రామిక అభివృద్ధి సాధించాలని పాలకవర్గాలు కోరుకుంటున్నారు. చైనాలో అత్యధిక మానవశ్రమ అతి చౌకగా దొరుకుతున్నందువల్లే అభివృద్ధి చెందిందని చెప్తూ, వారు సాంకేతికతను వికేంద్రీకరణ చెందించిన విషయాన్ని మరుగు పరుస్తున్నారు.

ఉత్పత్తి క్రమంలో ప్రజలు నిర్దిష్టమైన సంబంధాలలో వారి అభీష్టంతో సంబంధం లేకుండా కలిస్తుంటారు. ఈ సంబంధాలే సామాజిక వ్యవస్థను శాసిస్తాయి. ఉత్పత్తి శక్తులను చేతుల్లో పెట్టుకున్న వర్గం రాజకీయ నిర్మాణాలను, సంస్కతిని, తనకు తగ్గ భావజాలాన్ని రూపొందించుకుంటుంది. అనివార్యంగా ఇవి మానవ చైతన్యాన్ని బలంగా ప్రభావితం చేస్తాయి. వివిధ సామాజిక చట్రాలలో ఒదిగున్న వ్యక్తులు ఆ సామాజిక చైతన్యాన్ని, జ్ఞానాన్ని కల్గివుంటారు. ఆధిపత్య సంస్కృతికి వ్యతిరేకంగా, ప్రత్యామ్నాయంగా ప్రజా సంస్కృతి పేద ప్రజల పక్షాన ఊపిరి తీసుకుంటుంది. ఇది నిరంతరం తనను కాపాడుకుంటూ, వ్యాప్తిచేసుకుంటూ ఆధిపత్య సంస్కృతికి వ్యతిరేకంగా కొనసాగుతుంటుంది. మానవ ప్రయత్నం ద్వారానే ఆధిపత్య భావజాలాన్ని ప్రశ్నించగలం. భిన్న జాతులు, నాగరికతలు, సంస్కృతులు మేళవింపుగా భారతదేశం వుంది. విభిన్నమైన సాంస్కృతిక వ్యక్తీకరణలు ఈ దేశ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. సామ్రాజ్యవాద, హిందూ మతతత్వ సంస్కృతులు ఈ రోజు ఆధిపత్య సంస్కృతులుగా మన మీద పెత్తనం చెలాయిస్తున్నాయి. నిరంతర దోపిడీని కొనసాగించడానికి, ఉత్పత్తి సాధనాలపై పెత్తనం వహిస్తున్న పాలకవర్గాల కూటమికి సంస్కృతిపై ఆధిపత్యం అవసరం. పాలకవర్గాలు తమ భావజాలాన్నే ప్రజల భావజాలంగా మార్చివేస్తాయి. మతతత్వానికి పునాది 1915 ప్రాంతాల్లోనే పడింది. ముస్లింలీగ్, హిందూ మహాసభ తమ మతరాజ్యాలను ఏర్పాటు గావించడానికి తమ శక్తులను వినియోగించాయి. అదే క్రమంలో కుహనా లౌకికత్వం, కుహనా సోషలిజం కూడా విరివిగా ప్రచారమయ్యాయి. స్వాతంత్ర్యం తర్వాత దేశాన్ని పరిపాలించిన ప్రతి పార్టీ సామ్రాజ్యవాదుల, పెట్టుబడిదారుల, భూస్వామ్య వర్గాల ప్రయోజనాల కోసమే పనిచేశాయి. పెట్టుబడికి చట్టబద్ధ దళారీగా వ్యవహరించాయి. అభ్యుదయకర శక్తుల పోరాటాల వల్ల పాలకవర్గాలు విధిలేక అనేక సంస్కరణలు చేపట్ట వలసి వచ్చింది.

వ్యవసాయంలో మొదట గుడ్డిలో మెల్ల మాదిరి సంస్కరణలను చేపట్టాయి. ఈ సంస్కరణలు కొద్ది శాతం ప్రజల్లో ఆర్థిక ప్రయోజనాలను కల్గించినప్పటికీ, వారి చైతన్యాన్ని మసకబర్చాయి. జాతీయవాదం, దేశభక్తి, అఖండ భారత్, భరతమాత, వివిధ పండగల పేర ప్రచారం చేస్తున్న హిందూత్వ సంస్కృతే అసలైన భారత సంస్కృతిగా చెలామణి అవుతోంది. ఈ సంస్కృతిని చెలాయించడానికి చరిత్రను వక్రీకరించడమేగాక, విద్యను కాషాయీకరించే పనిలో మోడీ సేన పడింది. వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడం వల్ల, ఆ రంగంపై ఆధారపడి, కఠిన దారిద్ర్యాన్ననుభవిస్తున్న 70 శాతం ప్రజలు పాలకవర్గం సంస్కృతినే తమ సంస్కృతిగా పొరబడుతున్నారు. వీరిని చైతన్యపర్చాల్సిన, ప్రత్యామ్నాయ భావజాలాన్ని అందించాల్సిన శక్తులు బలహీనపడ్డం పాలకవర్గాలకు కలిసొచ్చింది. నూతన సాంకేతికత సాధించిపెట్టిన అతి వస్తు వినిమయాన్నే ఆధునికతగా చెలామణి చేస్తున్నారు. పెట్టుబడిదారీ దేశాల్లోని పాశ్చాత్య సంస్కృతిని దిగుమతి చేసుకుంటూ, దానికే ఆధునిక సంస్కృతి అని పేరుపెట్టారు. ఈ ఆధునికత దేశీయ ఫ్యూడల్ సంస్కృతిని ధ్వంసం చేస్తుందని మతవాదులు ఘోషిస్తున్నారు. నిజానికి రెండు సంస్కృతులు మేళవించిన విచిత్ర సంస్కృతి మనదేశంలో రాజ్యమేలుతోంది. పబ్‌లకు వెళ్లే ఆధునిక యువత తన వేళల్లో రాళ్ల ఉంగరాలు పెట్టుకుంటుంది. లాప్‌ట్యాబ్‌ను ఉపయోగించే యువత, అదే లాప్‌ట్యాబ్‌లో దిన, వార ఫలాలను వెతుక్కుంటోంది. ఎంత ఆధునికత దిగమతి అయినా వివాహాలు కుల, మత ప్రాతిపదికనే జరుగుతున్నాయి. చదువుకున్న యువతే పితృస్వామిక భావజాలాన్ని మోస్తున్నారు. అత్యాచారాలు దేశ రాజధానిలో రికార్డుస్థాయిలో జరుగుతున్నాయి. మహిళ పిల్లల్ని కనే యంత్రంగా, శృంగార వస్తువుగా, సెక్స్ సింబల్‌గా, వినిమయ వుస్తువుగా ఆధిపత్య సంస్కృతి చేసేసింది. పెట్టుబడిదారీ పూర్వ సంబంధాలే ఇంకా కొనసాగడానికి కారణం అభివృద్ధంతా ఫ్యూడల్ పునాదులపైనే కేంద్రీకృతం కావడం. సంస్కృతిలోను ఇదే తరహా తిరోగమన దశ కొనసాగుతోంది. ఒకవైపు మూఢనమ్మకాలు, సాంఘిక దురాచారాలు, మరోవైపు వస్తువుల పట్ల మోజు, వినిమయదారీతత్వం, నూతన సాంకేతికత, భిన్న అంశాలు కలగలసిన సంస్కృతి అమలవుతోంది.

కుటుంబం యూనిట్‌గా నిర్మితమైన సామాజిక సంబంధాలు సంక్లిష్టమైన నిర్మాణాలను కల్గివున్నాయి. ఇవి విభిన్న ఉపరితల అంశాలైన రాజకీయం, చట్టం, న్యాయం, మతం, నమ్మకం, మీడియా, కళారూపాలు తదితర అన్నిటితో సంబంధాలను నెరుపుతుండటంతో భిన్న ప్రాంతాలలో విభిన్న పోకడలు వస్తున్నాయి. దీన్ని ఉమ్మడి

సంస్కృతిగా పాలకులు ఒకవైపు కీర్తిస్తూ, అందులో వున్న పెడ ధోరణులకు సాధికారత చేకూర్చే ప్రయత్నం చేస్తున్నారు. ఇందులోని ప్రత్యేకత ఏంటంటే, ఏ అంశాన్నైనా ఇది తనలో సమ్మిళితం చేసుకుంటుంది. స్వాతంత్ర్యానంతరం గాంధీని, నెహ్రూను మహనీయులుగా కీర్తించిన ఈ సంస్కృతే ఇప్పుడు పటేల్‌ను, గాంధీని చంపిన గాడ్సేను మహనీయులను చేస్తోంది. పాలకవర్గ సంస్కృతిలో ఉన్న వెసులుబాటుకు ఇది నిదర్శనం. పెట్టుబడికి అనుకూలంగా ప్రజల భావాలను మరలించడమే దీని పని.

ప్రతి వస్తువును సరుకును చేసినట్టే, సంస్కృతిని సరుకును చేసే శక్తి సామ్రాజ్యవాదానికుంది. అంతర్జాతీయ స్వభావం పెట్టుబడికి ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాదంగా మారాక సంస్కృతి సమస్య జటిలమైంది. సామ్రాజ్యవాదం యుద్ధాలను ప్రేరేపించడమేగాక, అసమానతలను సృష్టిస్తుంది. భారీ ఉత్పత్తి, భారీ నష్టాలకు కారణమవుతుంది. ఈ యుద్ధాలు మొదట్లో ధనికదేశాల నుండి వర్ధమానదేశాలకు బదిలీ అవుతాయి. లేదా బలవంతంగా ఆయా దేశాలపై మార్కెట్ ప్రయోజనాల రీత్యా రుద్దబడతాయి. ఎప్పుడైతే వస్తువు ఉపయోగ విలువ కన్నా మారకపు విలువ ప్రధానమైన అంశమవుతుందో అది ఉత్పత్తిలేకుండానే పెట్టుబడులు పెట్టే నూతన తరహా ఆర్థిక విధానాలను రూపొందిస్తుంది. షేర్‌మార్కెట్ వ్యాపారం ఈ కోవలోకే వస్తుంది. ఫ్యూచర్ ట్రేడిరగ్ దీనికి పరాకాష్ట. స్పెక్యులేషన్ వల్ల ద్రవ్య పెట్టుబడి దేశాల సరిహద్దులను దాటి, ఆ దేశ అంతరంగిక వ్యవహారాలలోను జోక్యం చేసుకుంటుంది. ఇది ఒక జాతి సంస్కృతిని రక్షించేపేరుతో మరోజాతి నిర్మూలనకు ఎక్కుపెట్టినదే. రాజ్యం ఒక నామమాత్రపు యంత్రాంగం గానే మిగులుతుంది. రాజ్యం ఈ దశలో దళారీ స్వభావాన్ని సంతరించుకుని మెజారిటీ ప్రజలకు వ్యతిరేకంగా పనిచేస్తుంది. ప్రశ్నిస్తున్న సామాజిక బృందాలపై తీవ్ర అణచివేతను ప్రయోగిస్తుంది. ఈ బృందాలన్నీ ఆధునిక సోకాల్డ్ సమాజానికి, నాగరికతకు దూరంగా వున్నవే. నాగరికతలో మగ్గుతున్న ప్రజల చైతన్యాన్ని నీరుగార్చేందుకు ఆధిపత్య సంస్కృతి తన మాధ్యమాల ద్వారా విస్తృత ప్రయత్నాలను నిరంతరం చేస్తూనే వుంటుంది. ప్రత్యామ్నాయ సంస్కృతిపై ప్రజల్లో అవగాహన కల్పించే మేధావులును అభివృద్ధి నిరోధకులుగా చిత్రిస్తూ, వారిపైన రాజ్యం నిర్బంధాన్ని ప్రయోగిస్తుంటుంది. దేశంలో హిందూత్వవాదం ఏకీకృత జాతీయ సంస్కృతి పేరుతో చేస్తున్న ప్రయోగం, సామ్రాజ్య వాదం ఏకీకృత ఆహారపు అలవాట్లను అంతర్జాతీయంగా అమలుచేస్తున్న తీరు, రెండిటిలోను సారూప్యత వుంది. ఇవి రెండూ వారి రాజకీయ ప్రయోజనాలను నెరవేర్చడానికి అమలుపరుస్తున్న సాంస్కృతిక విధానాలే. ప్రజల అభిరుచులను, ఇష్టాలను మార్కెట్‌కు అనుగుణంగా మార్చడానికి వారి లాభాల్లో సుమారు 25 శాతం వెచ్చిస్తున్నారంటే వారు ఆ రంగానికిచ్చిన ప్రాధాన్యత అర్థమౌతుంది. అందుకే మనం మర్చిపోయిన పండగలను మనకు గుర్తుచేస్తూ, పిల్లల రోజు నుండి జంతువుల రోజు వరకు ప్రతి రోజును పండగను చేస్తూ, వినిమయదారీ తత్వాన్ని పెంపొందిస్తున్నారు. ప్రజల అసలైన సంస్కృతిని మరుగున పరిచి, వారిని దోపిడీ, వివక్షకు, వెనుకబాటుతనానికి అలవాటు చేయడమే వీరి ప్రధాన ఉద్దేశం. ఈ సందర్భంగా కార్పొరేట్ మీడియా పోషిస్తున్న పాత్ర అగ్రభాగాన వుంది. గుజరాత్ మారణకాండలో భాగంగా మోడీకి వీసా నిరాకరించిన అమెరికా, భారత ప్రధానిగా ఇప్పుడు అతనికి బ్రహ్మరథం పట్టడంలో, సామ్రాజ్యవాద సంస్కృతి అసలు కిటుకు వ్యాపారమేనని తెలుస్తుంది. ఆధిపత్య సంస్కృతి కొనసాగడానికి ప్రధాన కారణం ప్రజా సంస్కృతినీ తనలో సంలీనం చేసుకోవడమే. భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు, కొమరం భీం, శ్రీశ్రీ ఇలా ప్రజల మెచ్చే సంస్కృతిని తనలో విలీనం చేసుకుని ప్రజల తరుపున నిలిచే మేధావులను ఆలోచనలో పడవేయడమే దాని గతితర్కం. దోపిడీ విధానాలను ప్రశ్నించకుండా ప్రజలు ఎల్లకాలం ఆధిపత్య సంస్కృతికి తలొగ్గివుండరనే విషయం దానికి తెలుసు. అందుకే మేధావులకు అవార్డులను, పథకాలను, రివార్డులను, పదవులను ఇచ్చి కొంతకాలం మభ్యపెడుతుంది. నిజమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు, స్వయంపరిపాలన, స్వావలంబన కోసం జరుగుతున్న పోరాటాలు వెల్లువ దీనికి కొంతమేర అడ్డుకట్టవేయ గలవు. ఈ నేపథ్యంలో మేధావులు, అభ్యుదయకర వాదులు తాము ఏ సంస్కృతి వైపు నిలుస్తామనే విషయం వారి నిబద్ధత, నిజాయితీ, ఆచరణ, వారు నమ్మిన సిద్ధాంతబలంపై ఆధారపడివుంటుంది.

సంస్కృతిలో క్రమంగా మతం చొరబడటం, దాని ప్రాధాన్యత రోజురోజుకి పెరగడం వల్ల సాంస్కృతికరంగం మొత్తాన్ని మతం తన గుప్పెట్లో పెట్టుకునేసింది. దీనికి కొన్ని మినహాయింపులు ఉన్నప్పటికీ, ఆధిపత్యవర్గాలు ఈ మత సంస్కృతినే ఆలంబనగా చేసుకుని పెద్ద సామాజిక బృందాలనే తయారుచేయడం మొదలుపెట్టారు. ఈ బృందాలు సగగు మతతత్వపార్టీకి ప్రధానమైన మద్దతుదారుగా వుండటమే గాక, బహిరంగంగానే మతతత్వ పార్టీలను శాసిస్తున్నాయి. ముఖ్యంగా ఎన్నికల్లో మతమరమైన సంస్కృతి విభజనకు గురై మెజారిటీ మతోన్మాదంగా మారిపోతుంది. ఇది ఎన్నికల్లో పెద్ద ఎత్తున ఓట్లను కొల్లగొట్టడానికి పాలకవర్గాలకి ఆయుధంగా మారుతోంది. ప్రజల చైతన్యాన్ని ఒక మతపరమైన విధ్వంస సంఘటన బలంగా మార్చివేస్తుందని చెప్పడానికి గత ఎన్నికలే నిదర్శనం. మతపరమైన ఉన్మాదంలోకి మెజారిటీ ప్రజానీకాన్ని ఫాసిజం చాలా సులభంగా కొంత కాలంపాటు తీసుకెళ్లగలుగుతుంది. సమస్త ఆలోచనా పద్ధతుల్ని తీవ్రంగా ప్రభావితం చేయగల శక్తి సామ్రాజ్యవాద సంస్కృతికుంటుంది. సామ్రాజ్యవాద సంస్కృతికి గలగలపారే గోదావరి ఒడ్డున మంచినీళ్ల ప్యాకెట్లను అమ్మగలిగే శక్తి వుంటుంది. సమస్త వైవిధ్యాల్ని, వస్తువుల్ని, ఆలోచనల్ని, సంస్కృతిని మార్కెట్ చేయగలిగే సత్తా వుంటుంది. పాత సంస్కృతిని ధ్వంసం చేస్తూ, కొత్త సంస్కృతిని సామ్రాజ్యవాదం ప్రేరేపిస్తుందా అనే విషయంలో కొంత గందరగోళం వుంది. కొబ్బరినీళ్లకు పోటీగా కూల్‌డ్రిరక్స్ రావడాన్ని కొబ్బరినీళ్ల మార్కెట్‌ను ధ్వంసం చేస్తూ కూల్‌డ్రింక్స్ మార్కెట్ రావడమా లేదా కొబ్బరినీళ్లను సరుకుగా మార్చి, దాని ఉపయోగవిలువ కన్నా ఎక్కువగా మారకపు విలువను పెంచడమా అనే విషయాన్ని లోతుగా చర్చించాల్సిన అవసరం వుంది. కొబ్బరినీళ్లను బాటిళ్లలో పెట్టి సూపర్‌మార్కెట్లలోనే అమ్మడాన్ని చూస్తూనే వున్నాం. కొబ్బరినీళ్ల మార్కెట్‌ను సంప్రదాయ మార్కెట్ శక్తుల నుండి కార్పొరేట్ మార్కెట్ లాక్కోవడాన్ని మనం గమనిస్తున్నాం. కొబ్బరినీళ్లు, మజ్జిగ, కల్లు, అనేక పాత సంప్రదాయ

మార్కెట్లను ధ్వంసం చేయకుండా వాటిని కార్పొరేట్ మార్కెట్ చేజిక్కించుకోగల్గింది. జీన్స్ వచ్చినప్పటికీ ధోవతి కనుమరుగు కాకుండా పెళ్లిళ్లలోను, డ్రెస్ కాంపిటేషన్లలోను సరుకుగా ఉపయోగపెట్టుకుంటూనే వున్నారు. అందుకనే పెట్టుబడిదారీ సంబంధాలే ఇక్కడ నెలకొనివున్నాయని చెప్పగలుగుతున్నాం. ప్రతివిషయాన్ని సరుకుగా మార్చడమే గాక, దాన్ని కొనే భావజాలాన్ని సమాజంలో వ్యాపింపజేయగలడమే సామ్రాజ్యవాద సంస్కృతి ప్రధాన లక్ష్యం. ఉత్పత్తి సంబంధాల్లో వున్న వైరుధ్యాలే అంతిమంగా సంస్కృతి వారసత్వాన్ని కొనసాగిస్తాయి. ఫ్యూడల్ వ్యవస్థలోని చాలా విలువలు పురుషాధిక్యత, కుల అంతరాలు, పాతివ్రత్యం ఇప్పటికీ కొనసాగుతున్నాయి. దానితో పాటు సామ్రాజ్యవాదం తెచ్చిన వ్యక్తిపూజ, పోటీ, ప్రతిదీ సరుకుగా మారడం కొనసాగుతూనే వుంటాయి. ఈ ద్వంద్వ సంస్కృతులు అవసరం ఆధిపత్య వ్యవస్థలకు ఉన్నంతకాలం ఇవి కొనసాగుతూనే వుంటాయి.

సామాజిక విలువల్ని ఆర్థిక సంబంధాలు నిర్ణయిస్తాయి. ఈ సంబంధాలు ఉత్పత్తి చేస్తున్న సంస్కృతే సమాజపు సంస్కృతిగా చెలామణిలో వుంటుంది. ఆర్థికపోరాటాలతో పాటు సాంస్కృతిక పోరాటాలు జమిలిగా జరగాల్సిన అవసరం వుంది. ప్రత్యామ్నాయ సంస్కృతిని ఉత్పత్తి చేయడంలోను, ప్రచారం చేయడంలోను ప్రజాస్వామిక శక్తులు ముందుండాలి. రాజ్యం ఈ చిన్న భావవ్యాప్తికే బెంబేలెత్తిపోవడంలోను సాంస్కృతికరంగానికి రాజ్యం ఇస్తున్న ప్రాముఖ్యత అర్థం అవుతుంది. ఉపరితలంలో వున్న సంస్కృతి పాత్రను చిన్నదిగా చేసి చూడలేం. ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక సంబంధాలను మొత్తంగా కల్గివున్న సమాజం ఏదేని ఒక అంశంలో జరుగుతున్న భావజాల వ్యాప్తి అన్ని రంగాలను ప్రభావితం చేస్తుంది. జాతీయనాయకుల పేర్లుచెప్పి ఒక ఛాయ్‌వాలా దేశం మొత్తాన్ని ప్రభావితం చేస్తున్న సంగతిని మనం చూస్తూనే వున్నాం. ఒక్క చీపురుతో అవినీతి మొత్తాన్ని ఊడ్చేస్తాం అని చెప్పిన కేజ్రీవాల్ ఢిల్లీ ప్రజలకు ఎంత క్రేజీగా మారాడో చూశాం. ఉపరితలంలోని సంస్కృతి పునాదిలోని ఆర్థికశక్తులను ప్రభావితం చేస్తుంది. ఆర్థికనియతివాదం ఉపరితల అంశాలను విస్మరిస్తుంది. భావజాలరంగాన్ని ప్రభావితం చేయగల ఉద్యమాలే ఈ వ్యవస్థలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. వీటికి సరైన సైద్ధాంతికపునాది లేకపోయినప్పటికీ, వీరందరూ ఆర్థికశక్తుల ఆధిపత్యాన్ని సవాలు చేయనప్పటికీ, ఈ పోరాటాలు సామాజిక పునాదులను ప్రభావితం చేస్తున్నాయి. పశ్చిమదేశాలలోని జాస్మిన్ ఉద్యమం, సౌదీలోని ఉమన్ టు డ్రైవ్ ఉద్యమం, అమెరికాలోని జాతి వివక్ష వ్యతిరేక ఉద్యమం, భారత్‌లోని కిస్ ఆఫ్ లవ్ ఉద్యమం అన్నీ సాంస్కృతికోద్యమాలే. ఇవన్నీ వర్గపోరాటాలు కాకపోయినప్పటికీ, వాటిని బలంగా ప్రభావితం చేయడానికి, ఆ పోరాటాలకు కావలసిన ముడిసరుకును సమకూర్చడంలో ప్రధానభూమిక వహించాయి. వైవిధ్యపూరితమైన సంస్కృతి భారతదేశంలో విరాజిల్లుతోంది. వీటి రూపాలలో వైవిధ్యం వున్నప్పటికీ, అంతస్సారంలో ఏకసారూప్యత వుంటుంది. అన్ని మత సాంస్కృతిక రూపాలు భిన్నంగా వున్నప్పటికీ, సారంలో అవన్నీ ఆధిపత్య వ్యవస్థను కాపాడేవిధంగానే వుంటాయి. సంస్కృతి అనే భిన్న రూపాల ఆచార, ఆలోచనపద్ధతులను, వివిధ వైవిధ్యాలను సామ్రాజ్యవాదం అంతర్జాతీయ సంస్కృతిగా ప్రచారం చేస్తోంది. సంస్కృతిలో వున్న విభిన్న ఆలోచనసరళిని ఆమోదించడానికి సామ్రాజ్యవాదం నిరాకరిస్తోంది. ఏకీకృత సంస్కృతిని ప్రపంచవ్యాప్తంగా రుద్దడం వల్ల మార్కెట్‌శక్తుల వినిమయ సంస్కృతి ప్రభావంలోనికి సమాజపు అంచులలో వున్న అశేష ప్రజానీకాన్ని తీసుకొనిరావడం సులభం అవుతుంది. కెఫ్‌సి చికెన్, కోకోకోలా, పిస్తా, బర్గర్లు, బ్రాండెడ్ దుస్తులు, ఐ ఫోన్లు , బ్రాండెడ్ కార్లు, నైట్‌క్లబ్బు వీటిని ఉపయోగించడమే సమాజపు సంస్కృతిగా, ఆధిపత్య సంస్కృతిగా చెలామణి చేస్తుంది. మతతత్వశక్తులు ఆధునికత సంస్కృతి పేరుతో పాశ్చాత్య సంస్కృతిని దిగుమతి చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ, మోరల్ పోలీసింగ్‌కు పాల్పడుతూ, ఫక్తు ఫ్యూడల్ సంస్కృతే దేశీయ సంస్కృతిగా ప్రచారం చేస్తుంటారు. పెట్టుబడి దిగుమతి చేస్తున్న సంస్కృతిని మధ్య, ఎగువ మధ్యతరగతి ఆమోదిస్తున్న క్రమంలో, ఫ్యూడల్ సంస్కృతిలోనే అందరూ వుండాలని మతతత్వశక్తులు బలంగా కోరుకోవడంతో వీరి మధ్య ఘర్షణపూరిత వాతావరణం ఏర్పడుతుంది. ఇందులో భాగంగానే యువత మతతత్వశక్తుల భావజాల వ్యాప్తిని అడ్డుకునే ప్రయత్నం చేస్తుంది. అయినా వీరు మతాన్ని, మతసంప్రదాయాల్ని వ్యతిరేకించకుండా, కొంత రిలాక్సేషన్ మాత్రమే కోరుకోవడంతో వీరిమధ్య మిత్రవైరుధ్యమే వుంటుంది. ఈ వైరుధ్యాల్ని అభ్యుదయకరశక్తులు ఉపయోగించుకోగలిగినట్లేతే ఉద్యమరూపాలు వేరేరూపాలలో వుండగలిగేవి.

సమాజంలోని ఫ్యూడల్, పెట్టుబడిదారీశక్తులు ఆధిపత్య సంస్కృతిని ప్రజలపై రుద్దుతున్నాయి. ఇదే అసలైన సంస్కృతని ప్రజలందరూ నమ్మే స్థాయిలో వీటి ప్రచారం వుంది. ఏ వ్యవస్థలోనైనా సంస్కృతంటే ఆధిపత్యశక్తుల సంస్కృతే. దీనికి వ్యతిరేక సంస్కృతులను తనలో కోఆప్ట్ చేసుకునే శక్తుంటుంది. గాంధీ, అంబేద్కర్‌ను, భగత్‌సింగ్, కొమరంభీమ్‌లను శ్రీశ్రీని సైతం తనలో ఇముడ్చు కుంటాయి. ప్రత్యామ్నాయ, భిన్నమైన సంస్కృతుల గొంతునొక్కడానికి, వాటి గుర్తులను చరిత్రలో చెరిపేయడానికి ఆధిపత్యసంస్కృతికి ఈ కోఆప్ట్ అత్యంత అవసరం. ఆశ్చర్యం ఏంటంటే ప్రజల్ని ఈ సంస్కృతిని నమ్మమని, కొట్టరు, అరెస్టు చేయరు, అస్సలు బలవంతం చేయరు. ప్రచార మాధ్యమాల ద్వారా వారిని నమ్మిస్తారు. నమ్మించడమే వీరి ఆయుధం. ప్రాంతీయ ఉద్యమాల్ని, ప్రాంతీయ మాండలికాల్ని, అస్తిత్వాల్ని సామ్రాజ్యవాదం ప్రోత్సహించినంతంగా ఇంకే శక్తులు ప్రోత్సహించవు. ఈ భిన్న సంస్కృతులు ఆ జాతి జన్మహక్కని ప్రచారం చేస్తాయి. ఆ ప్రచారాన్ని తమ మార్కెట్ శక్తులకు ప్రయోజనకరంగా మార్చుకుంటాయి. అభ్యుదయకరశక్తులు సైతం వాటిని కాదనలేని స్థితిని కల్పిస్తాయి. ఫక్తు పెట్టుబడి, ఫ్యూడల్ శక్తులు భుజాన వేసుకున్న ఉద్యమాల్ని అభ్యుదయకరశక్తులు భుజాన మోస్తాయి. ఇందులోకి అట్టడుగు ప్రజానీకాన్ని పెద్ద ఎత్తున కలుపుకోడానికి అభ్యుదయకరశక్తులను ఆహ్వానించడానికే సామ్రాజ్యవాద శక్తులు ఉద్యమాలను ఆ విధంగా ప్రేరిపిస్తాయి. తమ ప్రయోజనాలు నేరవేరిన తక్షణం ఆ ఉద్యమాల్ని నిరంకుశంగా అణచి వేస్తాయి. ప్రపంచ కుగ్రామంలో సరుకు స్వేచ్ఛగా ఎక్కడైనా మార్కెట్ కాబడాలి. అదే సంస్కృతి పేరిట చెలామణి అవుతోంది. స్థానిక ఉత్పత్తులను నాశనం

చేయకుండానే వాటిని తనలో కోఆప్ట్ చేసుకోవడం ద్వారా తన మార్కెట్ విస్తృతిని పెంచుకోవడమే తన కర్తవ్యం.

సాంస్కృతిక సామ్రాజ్యవాదం ఈ రోజు బలమైన పాత్రను పోషిస్తోంది. ఆర్థిక, రాజకీయ సంక్షోభాలను అది ఎదుర్కొంటున్నప్పటికీ, అది తిరిగి ఉవ్వెత్తున లేవడానికి కారణం దాని ప్రాణం సాంస్కృతిక సామ్రాజ్యవాదంలో వుండటమే. ప్రతిదాన్ని సరుకును చేయడం, మార్కెట్ చేయడమే దాని సంస్కృతి. ఎక్కడో సంస్కృతికి దూరంగా వున్న అండమాన్ నికోబార్ దీవుల్లోని ఆదివాసుల సంస్కృతిని ప్రపంచవ్యాప్తంగా ప్రచారం చేసి, ఆ దీవుల్ని టూరిజం హబ్‌లుగా మార్చివేస్తాయి. సెలబ్రిటీల వ్యక్తిగత విషయాల్ని ప్రచారం చేసి పత్రికల్ని అమ్ముకుంటాయి. భక్తి పేరుతో దొంగస్వాములను తయారుచేసుకుని తమ భావజాల వ్యాప్తిని ప్రచారం చేసుకుంటాయి. భాషను సరుకుగా చేసి, వాటిని నేర్చుకోవడానికి వేలరూపాయల డబ్బులను కుమ్మరించడానికి ప్రజలన్ని సిద్ధం చేసుకుంటాయి. తాజాగా జపాన్ భాష నేర్చుకుంటే లక్ష ఉద్యోగాలొస్తాయని ప్రచారం చేస్తున్నారు. తెలుగుభాష నేర్చుకుంటే ఉద్యోగాలు గ్యారంటీ అని చెప్పగలిగినాడే తెలుగుభాష బ్రతికుంటుంది. లేనిపక్షంలో ఉద్యోగాల కోసం ఇంగ్లీషు, హిందీ లాంటి ఆధిపత్య భాషలు మార్కెట్‌లేని ప్రాంతీయ భాషలను చంపేస్తాయి. ఇప్పటికే పదుల సంఖ్యలో భాషలు దేశంలో చంపబడ్డాయి. సామ్రాజ్యవాదం సంస్కృతిని ఉత్పత్తి చేస్తుంది. ఇది యంత్రాల ద్వారా జరగనప్పటికీ, సినిమా, టివీల ద్వారా నిరంతరం జరుగుతుంటుంది. ఇది ఏ భౌతికఉత్పత్తి సరుకుకు తీసిపోదు. ఈ భావజాల ఉత్పత్తే, తదనంతరం భౌతికశక్తిగా మారి వస్తువులను సరుకులను చేసి మార్కెట్‌పరిధిని విస్తృతం చేస్తుంది. సలహాలు, సూచనలు, విశ్లేషణలు, కవితలు, కథలు అన్నీ ఉత్పత్తవుతుంటాయి. బాగా తయారుచేసినవారికి అవార్డులు, బిరుదులు, సన్మానాలు జరుగుతుంటాయి. దానివల్లనే మేధావులకు గుర్తింపు నిచ్చే కార్యక్రమం మొదలవుతుంది. వాటికోసం మేధావులు క్యూలైన్లలో నిలబడటానికి సిద్ధపడ్డారు. అంటే సంస్కృతిని ఉత్పత్తి చేయడానికి మేధో రిజర్వుడ్ సైన్యాన్ని సామ్రాజ్యవాదం తయారుచేసుకుంటుంది. సాహిత్యఅకాడమీ అవార్డులు, నోబుల్ ప్రైజులను అందుకే ఏర్పాటుచేస్తారు. ప్రతి మేధావి జీవితకాల ఆశయాన్ని వారు ముందే తయారుచేసిపెడతారు. దానికోసం మేధావి అహర్నిశలు తన మేధోశక్తిని ధారపోసేవిధంగా ప్రోగ్రామ్ తయారుచేయబడుతుంది. అలాగే పిల్లల మనసుల్ని ప్రభావితం చేస్తారు. ఆడపిల్లలు నాజూకు ఆడబొమ్మలను, మగపిల్లలు స్పైడర్‌మాన్‌లను, డోరెమాన్‌లను ఇష్టపడేటట్లు చేస్తార్లు, ఆ బొమ్మద్వారా ఆడపిల్లలా నాజుకుగా, అందంగా తయారుకావాలని నిరంతరం తపన పడేవిధంగా తయారుచేస్తారు. డోరోమాన్‌లా గాలిలో వస్తువుల సృష్టికోసం దేవున్ని ఆశ్రయించేవిధంగా పురికొల్పుతారు. ఆవిధంగా బావివినిమయదారులను తయారుచేసుకుంటారు. పాపులర్ పుస్తకాల్ని కొనడాన్ని సంస్కృతిగా మారుస్తారు. కార్పొరేట్ రంగానికి కావలసిన గుమస్తాలను తయారుచేయడానికి రచించిన పుస్తకాలే ఈ రోజు పుస్తకప్రపంచాన్ని శాసిస్తున్నాయి. ఎలా ఉద్యోగం పొందాలన్నదే జీవితపరమార్థం. తల్లిదండ్రులను ఎలా చూడాలి. కరుణ, జాలి ఎలా వుండాలో కూడా ఇదే సంస్కృతి నేర్పుతుంది. తనకున్న సంపాదనలో కొంత శాతం పేదలకు, అనాథలకు, అభాగ్యులకు దానం చేయమని చెపుతుంది. ఫలానా వస్తువు కొంటే వారే ఆ దానాలను చేస్తారని చెపుతుంది. మెక్‌డొనాల్డ్ కంపెనీ తాజాగా 100 గ్రాముల సాస్‌ను పదిలక్షలకు అమ్మింది. ఇందులో అధికశాతం డబ్బును దాతృత్వానికి వాడుతున్నట్టు ప్రకటించింది. మరో సెలబ్రిటీ తాను న్యూడ్‌యాడ్ ఇస్తున్నానని అందులో తాను తీసుకున్న పారితోషికాన్ని నల్గురు అనాథ పిల్లలని చదివించడానికి ఉపయోగిస్తానని ప్రకటిస్తుంది. మరో సుందరి క్రికెట్‌లో భారత్ గెలవాలని, గెలిచిన టీమ్‌తో తాను ఒకరాత్రి నిద్రిస్తానని ప్రకటించి తన దేశభక్తిని చాటుకుంటుంది. సంస్కృతి వినిమయసంస్కృతిగా మార్చివేయబడిరది. మనిషి 24 గంటలు సంస్కృతి ప్రభావంలో వుంటాడు. ప్రతిక్షణం మార్కెట్‌కు ఉపయోగపడుతూవుంటాడు. ఉద్యోగం తర్వాత, మిగిలిన సమయాన్ని అధిక డబ్బును సంపాయించడానికి, సెల్‌లు, కంప్యూటర్లు, సినిమాలకు వినియోగిస్తాడు. వీకెండ్లను ఖరీదైన హోటళ్లకు, షాపింగ్‌కు కేటాయిస్తాడు. విదేశీ టూర్ల పేరమీద జీవితాన్ని ఎంజాయ్ చేస్తాడు. మనిషి తనకుతెలియకుండానే పరాయీకరణ చెందుతాడు.

కుటుంబం యూనిట్‌గా ప్రత్యామ్నాయ సంస్కృతి బలపడాలి. నూతన సాంకేతికను తనకనుగుణంగా ఉపయోగపెట్టుకోవాలి. సాంస్కృతిక జాతీయవాదాన్ని ముందుకు తెస్తున్న హిందూత్వశక్తులకు వ్యతిరేకంగా పోరాడాలంటే అశేషప్రజానీకాన్ని ప్రత్యామ్నాయ సాంస్కృతిక తయారీదారులుగా చేయాలి. వ్యక్తివాదం బదులుగా సమిష్టివాదాన్ని ముందుకు తీసుకురావాలి. ఆధునికత ముందుకు తెస్తున్న ఉపయోగకర అంశాల్ని స్వీకరిస్తూనే, దేశంలో వున్న ప్రత్యేక సాంస్కృతిక వాతావరణంలోని ప్రయోజనకర విషయాల్ని గమనంలోకి తీసుకోవాలి. ఏ సంస్కృతిని గుడ్డిగా వ్యతిరేకించకుండా, వాటిలో చెడ్డ అంశాలకు వ్యతిరేకంగానే భావజాల వ్యాప్తి జరగాలి. అశేష ప్రజానీకానికి ఉపయోగపడే విధంగా వుండే అసలైన ప్రత్యామ్నాయ సంస్కృతిని ప్రచారం చేసుకునే క్రమంలో వివిధ శక్తులను, సామాజిక బృందాలను కలుపుకొనిపోవాలి.



**మీ రచనలను అరుణతారకు ఈ-మెయిల్ కూడా చేయవచ్చు!**

పేజ్‌మేకర్ ఓపెన్ ఫైల్, పి.డి.ఎఫ్. పద్ధతులలో (అను 6.0లో అయితే మేలు),

మైక్రోసాఫ్ట్ వర్డ్, ఎం.ఎస్. భాషాలో కూడా అరుణతారకు మెయిల్ చేయగలరు

ఈ-మెయిల్ : arunatara1977@gmail.com

**Like Page://arunatara viplava rachayitala sangham**

**Website : www. virasam. in**

వ్యాసం

# మోదీ దంతెవాడ వచ్చిందెందుకు?

- ప్రతాప్

'పాయక మోదీ దంతెవాడ బారి వాత్తోర్?' (పరాయి మోదీ దంతెవాడ ఎందుకు వచ్చిండు?) ఇదీ దండకారణ్యంలో ముఖ్యంగా దక్షిణ బస్తర్ (దంతెవాడ జిల్లాలో)లో ప్రజలడుగుతున్న ప్రశ్న. ఈ ప్రశ్నకు సూటిగా ప్రజలకు జవాబు చెప్పకుండా ఎవరూ దాటవేయకూడదు. ప్రధానమంత్రి మోదీ ఛత్తీస్‌గఢ్ పర్యటనకు చాలా ముందు నుంచే ఆయన అనుంగు సహచరుడు, రాష్ట్ర ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ మహా ఆర్భాటంగా తన యావత్తు మంత్రివర్గం, అధికార గణంతో సహా ఏర్పాట్లలో మునిగిపోయాడు. ప్రింటు, ఎలక్ట్రానిక్ మీడియాలో రన్నింగ్ కామెంటరీలా దేశ ప్రధాని డిసెంబర్ 9 నాటి దంతెవాడ కార్యక్రమం గురించి వెంట వెంట సెలవిస్తూ వచ్చారు. రావ్‌ఘాట్ రైల్వేలైను నిర్మాణ పనులను వేగవంతం చేయడానికి మోదీ వస్తున్నాడనీ, 24 వేల కోట్ల రూపాయల పెట్టుబడుల ఒప్పందాల పత్రాలపై (యంఓయు) సంతకాల పర్యవేక్షణకు ఆయన వస్తున్నాడనీ, పనిలో పనిగా యువతను మావోయిస్టులుగా మారకుండా నిరోధించే యత్నాల్లో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన లైవ్‌లీ హుడ్ కాలేజీ విద్యార్థులతో, "మావోయిస్టు పీడిత కుటుంబాల అనాథ పిల్లలతో" మాట్లాడి దంతెవాడ బహిరంగసభలో ప్రసంగిస్తారనీ విస్తృతంగా ప్రచారం చేశారు. ఆ రోజు జరిగిందంతే ఇదే.

అయితే ఇంత విస్తృత ప్రచారం జరిగినా అక్కడ ప్రజలకు తెలవనంతగా అక్కడి పరిస్థితులు వెనకబడి ఉన్నాయా? అని ఆశ్చర్యపోవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. కనెక్టివిటీ గురించి కశ్మీర్ నుంచి అస్సాం వరకు అలుపెరగని చందంగా ఈనాడు ప్రచారం చేస్తున్న మోదీ హయాం కన్నా ముందు నుంచే బృహత్ బస్తర్‌లో కమ్యూనికేషన్ వ్యవస్థను అత్యంత ఆధునికం చేయడంపై రమణ్‌సింగ్ ప్రభుత్వం, పోలీసులు ఎంతగానో కేంద్రీకరించారు. కాబట్టి ప్రజలకు ఆ మేరకు ప్రధాని పర్యటన విషయం విదితమే. ఈ దేశంలోని విశాల భూభాగంలో ప్రత్యామ్నాయ విప్లవ రాజ్యాధికార సంస్థలను మూడంచెలలో నిర్మించుకొని విప్లవిస్తున్న దంతెవాడ, సుక్మా, బీజాపూర్‌లతో సహా దండకారణ్య ప్రజలకు కావలసింది, వాళ్ళడుగుతోంది ఆ మేరకు జవాబు మాత్రం అసలే కాదన్నది గమనార్హం. వాళ్లకు ఆ వాస్తవాలపైనే ఆధారపడిన తుది పరిణామాల వివరాలు కావాలి. వాళ్ల ప్రశ్నలోని ఆంతర్యం అదే కాబట్టి ఆ ప్రజలకు పాయక మోదీ దంతెవాడ రావడంపై మావోయిస్టులు, పిఎల్‌జిఏ ఇచ్చిన జవాబును మీతో సంక్షిప్తంగా పంచుకోవడానికే ఈ వ్యాసం అందిస్తున్నాను. బస్తర్‌లోని ఆదివాసులు మావోయిస్టు విప్లవకారులను తప్ప బయటి వారినెవరినైనా పాయకగానే సంబోధిస్తారనేది పాఠకుల కోసం స్పష్టం చేస్తున్నాను.

దేశ ప్రధాని మోదీ దంతెవాడ పర్యటన రోజే దేశ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ మాస్కోలో రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీ ఫాసిజాన్ని ఓడించిన రష్యా విజయ సభలో పాల్గొని ఆ యుద్ధంలో అసువులు బాసిన 2 కోట్ల 70 లక్షలకు పైబడి అమరులయిన ఎర్ర సైనికులకు వందనాలు చెప్పడానికి వెళ్లి ఉన్నాడు. సరిగ్గా అదేరోజు నియో ఫాసిస్టు మోదీ పిఎల్‌జిఏ ఎర్ర సైనికులు తుపాకులను వదలాలని, తమ భుజాలపై నాగళ్లను మోయాలనీ దంతెవాడలో అహింసా హితవు పలికాడు. ఇవి రెండూ కాకతాళీయం కాకపోవచ్చు. మరోవైపు బస్తర్‌లో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, పోలీసు ఉన్నతాధికారులు కుమ్మక్కై ఒక అర దశాబ్ద కాలంపాటు కొనసాగించిన ఫాసిస్టు సల్వాజుడుంలో స్థానికంగా ప్రధాన పాత్ర పోషించి పరమ ప్రజా వ్యతిరేకిగా అపకీర్తిని మూటగట్టుకుని చివరకు 2013 మే 25 నాడు జీరంఘాటి వద్ద విప్లవ గెరిల్లాలు జరిపిన మాటు దాడిలో మట్టిగరిచిన మహేంద్రకర్మ పుత్రరత్నం ఛబీంద్రకర్మ ఆ సందర్భంగానే కొత్త అవతారంతో మరో సల్వాజుడుంకు తెర లేపడం ఎంత మాత్రం కాకతాళీయం కాదు. సల్వాజుడుంను దేశ అత్యున్నత న్యాయస్థానం (సుప్రీంకోర్టు) తప్పు పట్టిందన్న వాస్తవాన్ని పాఠకుల కోసం గుర్తు చేస్తున్నాను.

2005 జూన్ 5 దండకారణ్య విప్లవోద్యమంలో ఒక కొత్త పోరాట ఫ్రంటు సల్వాజుడుంను ప్రారంభించినట్లుగా చరిత్రకెక్కింది. కర్కెల్లి, తాడిమేంద్రిలలో ఫాసిస్టు సల్వాజుడుం గుండాలు ఆ రోజు దాడులు ప్రారంభమైనట్లుగా స్థిరపడిపోయింది. కానీ దానికి ముందస్తు ఏర్పాట్లు ఎంతో పథకం ప్రకారం పకడ్బందీగా అన్నీ జరిగిన తర్వాతే మహేంద్రకర్మ నాయకత్వంలో సల్వాజుడుం గుండాలు దాడులు ప్రారంభించారన్నది అందరెరిగిందే. ఇప్పుడు మోదీ సమక్షంలో 24 వేల కోట్ల రూపాయల పెట్టుబడుల యంఓయులపై కొన్ని ఒప్పందాలు జరిగినట్టే ఆ రోజు టాటా, ఎస్.ఆర్.లాంటి పెట్టుబడిదార్లకూ రాష్ట్ర ప్రభుత్వానికీ మధ్య ఎంఓయులు చోటు చేసుకున్నాయన్న సారూప్యతను ప్రత్యేకంగా ఇక్కడ గుర్తుచేస్తున్నాను. సల్వాజుడుం కాలంలో పెచ్చరిల్లిన హింస, విధ్వంసం, హత్యలూ, అత్యాచారాలూ, దొమ్మీలు, పంటనష్టాలు, ఆస్తుల నష్టాలూ వెలకట్టలేనివి. ఇంతటి విధ్వంసాన్ని సృష్టించిన సల్వాజుడుంకు ఫైనాన్షియర్లుగా నిలిచింది టాటా, ఎస్సార్లేనన్నది బహిరంగ రహస్యం. ఆ రోజులను గుర్తు చేసుకుంటే ప్రజలు ఎంతగానో చలించిపోతారు. తిరిగి ఆ రోజులు రాకూడదని వారు బలంగా కోరుకుంటారు. కానీ ఈ రోజు మోదీ సరిగ్గా అదే ఎజెండాతో రమణ్‌సింగ్‌ను వెంటబెట్టుకుని దంతెవాడ వచ్చాడని విప్లవోద్యమం ప్రజలకు స్పష్టం చేస్తున్నది. గ్రామ గ్రామాన ప్రజలతో బహిరంగ సభలు ఏర్పర్చి ఈ విషయాలను చర్చించింది. మోదీ రాక తిరిగి ఆ రోజులను తలపింపజేయడానికేననీ, ఇక ప్రజల భవిష్యత్తంతా ఆ కకావికలం కావడానికి ఇది సంకేతమని అసలు గుట్టు విప్పి చెప్పింది. ఏ ప్రాంతంలోనయితే గనులూ, ఖనిజాలూ అపారంగా ఉంటాయో ఆ రాజ్యం ఐశ్వర్యంతో తులతూగుతుందని కౌటిల్యుడు చెప్పింది పాలకులకు వరంగానూ, ప్రజలకు శాపంగానూ మారిందని కూడా వివరిస్తున్నది.

ప్రధాని మోదీ ఢిల్లీ విధానసభ ఎన్నికల ప్రచారం సందర్భంగా కేజ్రీవాల్‌ను దెప్పి పొడుస్తూ అరాచకులు బస్తర్ అడవుల్లోకి వెళ్లాలన్నాడు. బస్తర్ అడవుల్లోని నక్సలైట్లను ఆయన అరాచకులుగా పేర్కొన్నాడు. సరే! మోదీ గారు ఏం చెప్పినా 2009లో ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలయినప్పుడు ఒక సామాజిక కార్యకర్తగా దానిని వ్యతిరేకించిన అరవింద్ కేజ్రీవాల్ ఇప్పటి వరకూ బస్తర్ అడవుల ముఖం చూడలేదు. కానీ దంతెవాడ పర్యటనకు 55 వేల భద్రతా బలగాలు తుపాకులతో పహరా కాస్తుండగా గగనతలంలో మానవ రహిత విమానాలూ, హెలికాప్టర్లూ రక్షణ వలయంగా నిలిచిన వేదిక పైకి మోదీ మాత్రం వచ్చాడు. ఆయన 24 వేల కోట్ల రూపాయల పెట్టుబడుల యంఓయులపై సంతకాలు జరగటానికి సాక్ష్యంగా ఉన్నాడు. రావ్‌ఘాట్ ప్రజలు తమ మనుగడ కోసం, ఆ ప్రాంత పర్యావరణ రక్షణ కోసం గత మూడు దశాబ్దాలుగా దోపిడీ ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాలన్నింటినీ వ్యతిరేకిస్తూ చేస్తున్న జీవన్మరణ పోరాటాన్ని అర్ధసైనిక బలగాలతో అణచివేస్తూ కొనసాగిస్తున్న రైల్వే లైను నిర్మాణాన్ని మరింత వేగిరపరచడానికే మోదీ బస్తర్ వచ్చాడు.

వర్తమాన ప్రపంచంలోని యుద్ధ పరిశ్రమకు బాక్సైట్ ప్రధాన ముడిపదార్థంగా నిలిచింది. అలాంటి బాక్సైట్ మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలలో ఆదివాసీ ప్రజల సంరక్షణలో పుష్కలంగా ఉంది. కాంకేర్ జిల్లాలోని బురుబుర్శిలో బాక్సైట్ గనుల వెలికితీతకు అలాగే లోహండిగూడాలో టాటా తలపెట్టిన స్టీలు ఫ్యాక్టరీ నిర్మాణానికి, ఆమ్‌దాయ్ మెట్ట, తులామెట్టలలో దాగిన గనుల వెలికితీతకు, బోధ్‌ఘాట్‌లో జిందాల్ థర్మల్ విద్యుత్ ప్రాజెక్టు నిర్మాణానికి, గడ్‌చిరోలిలోని సూర్జాగఢ్, దంకోడిలలో లాయడ్, జిందాల్‌లు గనుల తవ్వకానికి ఉవ్విళ్లూరుతున్నారు. ఇంకా ఇలాంటివి దండకారణ్యంలో అనేక గనుల ప్రాంతాలున్నాయి. ఉత్తర ఛత్తీస్‌గఢ్‌లోని అనేక బొగ్గు క్షేత్రాలను (అదీ మావోయిస్టు ఉద్యమ ప్రాంతమే) అక్కడి ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నప్పటికీ ఈ మధ్యే వేలం వేశారు. ఇంకెన్నెన్నో ప్రాజెక్టుల కోసం 2009 నాటికే దాదాపు 7 లక్షల కోట్ల రూపాయల పెట్టుబడులను బస్తర్ సహా మావోయిస్టు ఉద్యమ ప్రాంతంలో టాటాలు, ఎస్సార్‌లు, జిందల్‌లు, లాయడ్‌లు, అంబానీలు, మిత్తల్‌లు, అదానీలు సహా విదేశీ కార్పొరేట్ సంస్థలు పెట్టుబడులుగా పెట్టి ఉన్నారన్న విషయం ప్రజలు మరిచిపోలేరు.

వారంతా ఛత్తీస్‌గఢ్ నూతనంగా ఏర్పడిన చిన్న రాష్ట్రం, అపార ప్రాకృతిక వనరులు ఉండడంతో స్వేచ్ఛగా దండుకోవచ్చన్న పగటి కలలతో తమ భారీ పెట్టుబడులను ఇక్కడికి తరలించారు. కానీ ఇప్పటికి ఏండ్లు గడచిపోతున్నా అవి వారాశించిన లాభాలను అందించడం లేదు. అందుకే వారిప్పుడు మోదీని తెచ్చారు. ప్రధాని మోదీ 'మేక్ ఇన్ ఇండియా'తో దంతెవాడ వచ్చాడు. ఆయన గతంలో ఏ ప్రధానీ చేయని విధంగా మేక్ ఇన్ ఇండియా జోలె పట్టుకుని ప్రపంచ పర్యటన చేస్తూ పరిశ్రమల స్థాపనకు మా దేశం రండంటూ నిస్సిగ్గుగా ఘరానా కార్పొరేట్ శక్తులను యాచిస్తున్నాడు. న్యూయార్క్ పారిస్, హానోవర్, ఒటావా, టొరంటో, బీజింగ్, షాంఘైలలో తన మేక్ ఇన్ ఇండియా గురించి ఘరానా కార్పొరేట్ శక్తుల సమావేశాలలో, బహిరంగ సభలలో రసవత్తరంగా ప్రసంగించడం, అక్కడి శివమెత్తిన నమోసేన భక్తులు ముందస్తు ఏర్పాట్లలో భాగంగానే "మోదీ, మోదీ" అంటూ అరవడం లాంటి సన్నివేశాలు కనిపిస్తే... స్వదేశంలోని 'అరాచక నక్సలైట్ల' దంతెవాడ అడవుల్లో మాత్రం 'మోదీ గో బ్యాక్'గా మారుమ్రోగాయి. అమెరికాలో, కెనడాలో మోదీ పర్యటనకు నిరసనగా ఎదురైన అనేక సంఘాల ప్రతిక్రియను దాదాపు మొత్తం మీడియా ఉద్దేశ్యపూర్వకంగానే మరుగునపరిచినా దంతెవాడలో మాత్రం ప్రజల తీవ్ర నిరసనే ప్రధానమై ప్రధాని మోదీని వెంటాడింది. మోదీ పర్యటనను బహిష్కరించాల్సిందిగా మావోయిస్టు పార్టీ దండకారణ్య స్పెషల్ జోనల్ కమిటీ ప్రజలకు పిలుపునిచ్చింది.

దండకారణ్యంలో పెట్టుబడులు పెట్టి తమ దీర్ఘకాల ఆర్థిక సంక్షోభం నుంచి గట్టెక్కడానికి టాటాలు, ఎస్సార్, జిందాల్‌లు, లాయడ్‌లు, మిత్తల్‌లు, అదానీలు సహా పలు విదేశీ ఎంఎన్‌సిలు కాచుక్కూచున్నాయి. గతంలో వీరికి మన్మోహన్ సింగ్ యుపిఏ ప్రభుత్వం ప్రాతినిధ్యం వహించగా ఇప్పుడు మరింత హీనంగా, నిస్సిగ్గుగా, ఏ దాపరికం లేకుండా కరుడు గట్టిన కాషాయశక్తి మోదీ దూకుడుగా ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. గతం కన్నా తీవ్రంగా వినాశకర వేగంతో వనరుల దోపిడీ కోసం వారంతా దండకారణ్య అడవులపై విరుచుకు పడనున్నారని విప్లవోద్యమం ప్రజలకు చెప్తుతూ వారిని జాగృతులను చేస్తోంది. మిడతల దండులా ఫణీంద్ర దండు కూడా వారికి ముందు నడవనున్నదన్నట్లు ప్రజలకు సల్వాజుడుం ప్రతిఘటనను గుర్తు చేస్తున్నది.

దేశ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేయడంలో వ్యవసాయ రంగాన్ని పునాదిగా చేసుకుని తీరాలి. కానీ మోది మార్కు అభివృద్ధి మేక్ ఇన్ ఇండియా నినాదంతో ఒంటి కాలుపై ఎలా స్వారీ చేయనున్నదో, రోజురోజుకూ వ్యవసాయాన్ని మరింత సంక్షోభంలోకి నెట్టుతున్న ప్రభుత్వాల వైనాన్ని ప్రజలకు చెప్తున్నాం. ఢిల్లీ చేరిన గజేంద్రసింగ్ లాంటి రైతుల ఆత్మహత్యలు ఈ దేశంలో ప్రభుత్వాల కార్పొరేట్ అనుకూల విధానాల ఫలితమేనని వివరిస్తున్నాను. భూమిపై పంటలు పండించే వ్యవసాయాన్ని సంక్షోభాల పాలు చేసి రైతులను ఆత్మహత్యలకు నెడుతున్నారు. ఇక భూమిలోపల నిక్షిప్తమై ఉన్న సహజ సంపదలను తవ్వి తీస్తూ మానవ జాతికే శాశ్వత నష్టాన్ని కలిగిస్తూ మట్టిదిబ్బలు మిగిలిస్తున్నారు. ఇప్పటికే మన దేశాన్ని దాదాపు నాలుగు వేల విదేశీ సంస్థలు కొల్లగొడుతూ సాధిస్తున్న "ఉద్యోగరహిత అభివృద్ధి"ని దంతెవాడకు కూతవేటు దూరంలోనున్న బైలదిల్లా, కిరందూల్‌లలో 1970ల నుండి సాగుతోన్న ఇనుపగనుల తవ్వకాల నేపథ్యంలో విప్లవోద్యమం సోదాహరణంగా విశ్లేషిస్తోంది. ఈ గనుల ప్రాంతంలో ఆదివాసీ స్త్రీ-పురుషులు దేహ వ్యాపారం మొదలు సారా అమ్మకం వరకూ, అధికారుల ఇండ్లల్లో అంట్లు తోమడం మొదలు వీధులు ఊడ్వడం వరకూ పరమ చాకిరీ పనులన్నీ చేస్తున్నారు తప్ప మరే రకమైన గౌరవప్రదమైన ఉద్యోగాలు వారికి దక్కలేదు. నష్టపరిహారంగా ముట్టిందేమీలేదు. 1971-72లో వారు జరిపిన ఆనాటి పోరాట అనుభవాలను ఎంతో ఆర్ద్రతతో గుర్తు చేసుకుంటున్నారు. ఆనాడు ప్రజలు పోరాడితే పోలీసుల తుపాకులు అనేక మంది ప్రాణాలను తోడేసి ప్రపంచంలోనే నాణ్యమైన అక్కడి ఇనుప ఖనిజాన్ని గత 40 సంవత్సరాలుగా నిరాటంకంగా జపాన్ సహా అనేక దేశాలకు తరలిస్తున్న వైనాన్ని మేమెలా మర్చిపోతామని జనం ప్రశ్నిస్తున్నారు.

ఆనాడు ఆ పోరాటానికి ఎర్రజెండాను ముందుపెట్టుకుని నాయకత్వం వహించిన "అరుణవీరులు" అసెంబ్లీకి రెండు సీట్లు

సునాయాసంగా గెలుచుకున్నారు. ఇప్పటికీ బస్తర్‌లో అక్కడక్కడా అధిక నష్టపరిహారం, పునఃస్థాపన డిమాండ్లతో ఆ వీరులు పోరాటాలంటూ ముందుకు వస్తున్నా ఇక జనం మోసపోమంటున్నారు. ఇది ఇప్పటి వాస్తవం. ఇక్కడే మరో ఘటనను ప్రజలు గుర్తు చేసుకుంటున్నారు. ఆదివాసీ ప్రజల ప్రేమాస్పదుడయిన విశ్రాంత కలెక్టర్ బిడి శర్మను 1991-92లలో మౌలిబాట ప్రాజెక్టును వ్యతిరేకించినందుకు ఆనాటి ముఖ్యమంత్రి సుందర్‌లాల్ పట్వా కాలంలో జగదల్‌పూర్ నగర వీథుల్లో మెడలో చెప్పుల మాల వేసి అర్ధనగ్నంగా ఊరేగించిన విషాద అనుభవం కూడా ప్రజల గుండెల్లో గూడుకట్టుకుని ఉంది.

నక్సలైట్లు హింసను వదులుకోవాలనీ, భుజాలపైనుండీ గన్నులు తీసి నాగళ్లు ధరించాలనీ మోదీ హితబోధ చేశాడు. మావోయిస్టు బాధిత పిల్లల మధ్య కొద్ది రోజులు మావోయిస్టులు గడిపితే హృదయ పరివర్తన జరుగుతుందని భాష్యం చెప్పాడు. అత్యంత నిష్ఠాపూర్వకంగా యశోదాబెన్‌ను సహితం నిర్దాక్షిణ్యంగా వదిలేసి తన జీవిత కాలాన్నంతా పరమ తిరోగమన భావాలు గల కాషాయ రాజకీయాలకు అంకితం చేసిన మోదీ 2002లో గుజరాత్‌లో దాదాపు 3 వేల మంది ముస్లిం ప్రజల మారణహోమానికీ, లక్షలాది ప్రజల పలాయనానికీ ప్రధాన కారకుడైన వాడు మావోయిస్టులకు అహింసా పాఠాలు బోధిస్తున్నాడు. దాదాపు దశాబ్ద కాలానికి పైగా దేశం బైట కాలు పెట్టడానికి వీలు లేకుండా అనేక దేశాల బహిష్కారానికి గురైన నరహంతక మోదీ దేశ ప్రధాని హోదాలో అనేక దేశాలు పర్యటిస్తూ అభివృద్ధి గురించీ, అహింస గురించీ చెప్తున్నాడు. ఆయనకు ఆ నైతిక అర్హతే లేదని విప్లవోద్యమం ప్రజల్లో ప్రచారం చేస్తున్నది. మావోయిస్టులు పశ్చిమ బెంగాల్ నుంచి నేర్చుకోవాలని మోదీ సెలవిస్తున్నాడు. 2011 వరకూ పశ్చిమ బెంగాల్‌లో సుదీర్ఘకాలం అధికారాన్ని వెలగబెట్టిన "ఎర్ర యోధులు" నేపాల్ నుంచి నేర్చుకోవాలని అన్నారు. వీరందరికీ గురువులు నేటి చైనా నాయకులే. మోదీ మేక్ ఇన్ ఇండియా కూడా వారి నుంచి కాపీ కొట్టిందే. అందుకే చైనా అధ్యక్షుడు ఝీజింగ్ పింగ్ మన దేశ పర్యటనకు వచ్చినపుడు "మా దేహాలు వేరుకానీ ఆత్మ ఒక్కటే" అంటూ మోదీ కొనియాడటం ప్రజలు మర్చిపోలేదు. వీరందరూ తోడు దొంగలే. నేపాల్ మావోయిస్టుల గతి ఏమైందో దండకారణ్యంలో చంటి బిడ్డలనడిగినా చరిత్ర సాక్షిగా చెపుతారు. భారతదేశంలో నూతన సరళీకృత ఆర్థిక విధానాలు ముమ్మరమయిన తర్వాత దేశంలోని వామపక్షాల దుస్థితి ఎంతటి హీనపక్షానికి దిగజారిందో తెలుసుకోవడానికి భారతదేశ ఓటర్లే సాక్ష్యంగా ఉన్నారు. విప్లవకారులను దిగజార్చడం, విప్లవోద్యమాలను రూపుమాపడమే వీరి అంతిమ లక్ష్యం కాబట్టి ఇంతకు మించి మరేం చెప్పగలరు?

వాస్తవానికి మోదీ తెలుసుకోవల్సిందే ఎంతో ఉందని ప్రజలు మండిపడుతున్నారు. బస్తర్‌లో భుజాలపైకి బందూకులెత్తుకుంది నాగళ్లు దున్నిన / దున్నుతున్న తమ కొడుకులూ కూతుళ్లేనన్నది మోదీ తెలుసుకోవలసిన ప్రాథమిక విషయమని ప్రజలంటున్నారు. తమను ఈ దేశంలో మోదీ నుంచి నెహ్రూ వరకు ప్రభుత్వాలు వెలగబెట్టిన వాళ్లెవ్వరూ ఉద్ధరించలేదనీ, తమను తీవ్ర నిర్లక్ష్యానికి గురి చేసిన ఫలితంగానే తాము పోరాట మార్గాన్నెంచుకోక తప్పలేదన్నది పాలకులు గ్రహించాలంటున్నారు. తమ అడవులను దోచుకోవడమే తప్ప ఆదివాసీల అభివృద్ధి గురించి నిజాయితీగా పాటుబడిన పాపాన పోని ఫలితంగానే ఆదివాసీ పిల్లల భుజాలపై బందూకులు మొలిచాయన్నది గుర్తించాలంటున్నారు. ఆ బందూకులే తమ జీవితాల్లో మౌలిక మార్పులకు దారులు చూపుతున్నాయని ప్రజలు దృఢంగా విశ్వసిస్తున్నారు. పూట గడువని కడుపేద జీవితాల్లో రెండు పూటలా తిండి దొరుకుతోందని, అనేక యాతనలను అనుభవించినా గుంటెడు భూమి దొరకని జీవితాలకు పంట భూముల దాహం తీరిందనీ తమ అర్ధ నగ్న జీవితాలను ప్రదర్శనలకు పెట్టే పాలకుల దుర్మార్గం ప్రజా పోరాటాల ద్వారానే కనుమరుగైందనీ ప్రజలు సంతోషంగా చెప్పుకుంటుంటారు. వీటన్నింటినీ మించి ఆత్మగౌరవంతో జీవిస్తున్నామని, తమ అధికారం తామే నడుపుకోవడానికి ఆ బందూకులే దారిచూపాయనీ ప్రజలు స్పష్టం చేస్తున్నారు. దోపిడీ పాలకులు సెలవిచ్చే అహింస వారు అనుసరించడానికి ఎంత మాత్రమూ కాదు. వారు హింసపైననే జీవిస్తూ ప్రజలకు అహింస బోధించడమే వారి పొలిటికల్ ఫిలాసఫీలోని పరమార్థం అని వర్గాల గురించి తెలిసిన వాళ్లకు విడిగా చెప్పే పనే ఉండదు.

'మావోయిస్టు పీడిత' పిల్లల గురించి అసలు నేరస్తులు పాలకులేనన్న విషయం గ్రహించనంత కాలం, టాటాలు ఎస్సార్లే దాని ప్రయోజకులన్నది గుర్తుపెట్టుకోనంత కాలం నిన్న మహేంద్రకర్మలు, నేడు ఛబీంద్ర కర్మలు పుట్టుకురావడం, బస్తర్‌లో వందలాది గ్రామాలను తిరిగి తిరిగి బుగ్గిపాలు చేయడం దోపిడీ పాలకులకే చెల్లుతుంది. 'మేమూ మా పిల్లలూ బందూకులే పట్టుకోకపోతే మీ ఆగడాలకు అంతమెక్కడుండేది? వేదికల పైకెక్కి మీరు మాట్లాడేదంతా విని ప్రజలెవరూ మోసపోలేరని గుర్తుపెట్టుకోవాలి. ఎల్లకాలం యావన్మందినీ ఎవరూ మూర్ఖులు చేయలేరన్న జ్ఞానోదయం మోదీకి గద్దె దిగిన్నాడే కలుగుతుంద'ని ప్రజలు అంటున్నారు.

మోదీ దంతెవాడ పర్యటన సందర్భంగా విప్లవోద్యమం ప్రజల్లో చర్చకు పెట్టిన మరో ముఖ్య విషయాన్ని చివర్లోనే అయినా మీతో తప్పక పంచుకోవాలి. ఈసారి పార్లమెంటు బడ్జెట్ సమావేశాలలో 24 బిల్లులు ఆమోదం పొందాయి. గడిచిన శీతాకాల సమావేశాల్లో 18 బిల్లులు ఆమోదం పొందాయి. కానీ ఈ రెండు విడతల్లో భూ సేకరణ బిల్లు (ఎల్ఎఆర్ఆర్) మాత్రం ఆమోదం పొందలేదు. నరేంద్ర మోదీ తలపెట్టిన భూసేకరణ బిల్లును దేశవ్యాప్త రైతాంగం, ఆదివాసీ ప్రజలతో కలిసి దండకారణ్య ఆదివాసీ ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. ఏప్రిల్ 25 నుండి మే 1 వరకూ వారం రోజులు భూసేకరణ బిల్లు వ్యతిరేక పోరాట వారాన్ని దండకారణ్య ఆదివాసీలు పాటించారు. గడ్‌చిరోలిలోని భామ్రాగఢ్‌లో ప్రజలు నాలుగు రోజులు రోడ్లపైనే వండుకుతింటూ బిల్లుకు వ్యతిరేకంగా వరుసగా నిరసన ప్రదర్శనలు జరిపారు. దండకారణ్య పోరాట చరిత్రలో ఓ కొత్త పోరాట రూపాన్ని ప్రజలు ఆవిష్కరించారు. దండకారణ్య ఆదివాసీ ప్రజలు తమ భూములనూ, అడవులనూ వదులుకోవడానికి ఏ మాత్రం సిద్ధంగా లేరని మోదీ తెలుసుకోవాలి. పంట భూములు వారికెంత ముఖ్యమో అడవులు వారికి అంతకన్నా ముఖ్యమని ప్రజలు నినదిస్తున్నారు. పెసా చట్టానికి ఎలాంటి తూట్లు పొడవకుండా అమలు చేయాలంటూ ఆదివాసీ రైతాంగం డిమాండ్ చేస్తున్నారు. లఘు అటవీ ఉత్పత్తులపైనే

కాకుండా భూమిలో నిక్షిప్తమై ఉన్న భారీ ఉత్పత్తులు కూడా భూయజమానులకే చెందుతాయని సుప్రీం కోర్టు సెలవిచ్చిందని ప్రజలు గుర్తు చేస్తున్నారు. మోదీ మేక్ ఇన్ ఇండియా అన్ని విధాల వినాశకరమైనదేనని యావత్తు ఆదివాసీ ప్రజానీకం గొంతెత్తి నినదిస్తున్నారు. మేక్ ఇన్ ఇండియా అంటూ అడవుల్లో చిచ్చురేపుతూ, రైతాంగ జీవితాలను అతలాకుతలం చేస్తూ హింసను ప్రేరేపించడాన్ని ఎదిరించి తీరతామంటున్నారు. పాలకవర్గాల రెండు నాల్కల ధోరణిని ప్రజలు ఎండగడుతున్నారు.

పెట్టుబడిదార్ల ప్రయోజనాల కోసం దంతెవాడ పర్యటించిన మోదీ కోసం కాకపోయినా దంతెవాడ వాస్తవాలను పాఠకుల ముందు ఉంచాలనుకుంటున్నా. ఆ వాస్తవాల ద్వారా ప్రజల వికాసానికి ఏం కావాలో ఎవరైనా సులువుగానే అర్థం చేసుకోవచ్చు. దంతెవాడ జిల్లాలో 1220 గ్రామాలున్నాయి. వీటిలో 75 శాతం గ్రామాలు పూర్తి ఆదివాసులతోనే నిండుకొని ఉన్నాయి. ఇక్కడ జనసాంద్రత ప్రతి చదరపు కిలోమీటరుకు 41 మందికి మించిలేదు. ఇక్కడ ప్రాకృతిక జలవనరులు పుష్కలంగా ఉన్నా ఆదివాసీల 2 శాతం పంట భూములకే అంతంత మాత్రం నీటి వసతి ఉండడంతో వారంత ప్రధానంగా వర్షాధారంపై ఆధారపడి ఏడాదికి ఒక్క పంట పండించుకోగల్గుతున్నారు. 1161 గ్రామాలకు దోపిడీ ప్రభుత్వాలు ఎలాంటి వైద్య సౌకర్యం కల్పించలేదు. జిల్లాలో కేవలం 26 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 26 ఉన్న మాధ్యమిక పాఠశాలలు, 4 డిగ్రీ కళాశాలలున్నాయి. తరతరాలుగా ఇక్కడి ప్రజలు సికిల్‌సెల్ వ్యాధితో బాధపడుతున్నారు. (దీని నివారణకు కూడా మోదీ జపాన్ వాళ్లను యాచించిన విషయం పాఠకులకు గుర్తుండాలి.) మరోవైపు దంతెవాడ జిల్లాలో పోలీసు స్టేషన్‌లు, క్యాంపులు అన్నీ కలిసి వందకు పైగానే ఉన్నాయి. ఇక ఇప్పుడు ప్రధాని పర్యటన తర్వాత అవి మరెన్ని పెరుగుతాయో చూడాల్సిందే. ఇంతటి హీనస్థితిలో ప్రజల జీవితాలుండగా మోదీ పెట్టుబడులు, మోదీ మౌలిక సదుపాయాల రూపకల్పన ఎవరి అభివృద్ధిని ఆశించి జరుగుతున్నాయని ప్రజలు అడుగుతున్నారు. మోదీ మేక్ ఇన్ ఇండియా యూరప్‌లో అత్యధిక నిరుద్యోగంతో సతమతమవుతున్న ఫ్రాన్స్‌కు కావాలి. దీర్ఘకాల సంక్షోభం నుంచి గట్టెక్కడానికి జర్మనీకి దాని అవసరం ఉంది. గణతంత్ర వేడుకలకు వచ్చి అణు ఒప్పందం సహా అనేక ఒప్పందాలపై సంతకాలు పెట్టించుకున్న ఒబామాకు మోదీ, ఆయన గారి మేక్ ఇన్ ఇండియా నచ్చుతుంది. కెనడాలో మూల్గుతున్న పెన్షన్ నిధులను పెట్టుబడులుగా మార్చడానికి మేక్ ఇన్ ఇండియా దారి చూపుతుంది. పిల్లి నల్లదైతేనేమి, తెల్లదైతేనేమి అనే సిద్ధాంతాన్ని సృష్టించిన చైనా వీరులకు మేక్ ఇన్ ఇండియా కావాలి. దశాబ్దాలుగా దేశ ఆర్థిక వ్యవస్థలో పెద్దగా పురోభివృద్ధికి నోచుకోని జపానుకు మోదీ స్మార్ట్ సిటీలు, నమామి గంగలు కావాలి. ఇప్పటికే మోదీ వెళ్లిన ప్రతి దేశంలో డజన్లకొద్దీ వ్యాపార ఒప్పందాలు కుదుర్చుకొని లక్షల కోట్ల రూపాయల పెట్టుబడులను ఆహ్వానిస్తూ దేశాన్ని నట్టేట ముంచుతున్నాడు. అందుకే మోదీని ఒబామా, స్టీఫెన్ హార్పర్, ఏంజెలా మెర్కెల్, ఫ్రాంకోస్ హోలాండే, ఘిజింగ్‌పింగ్, పుతిన్, షింజో అబె ప్రపంచ బ్యాంకు నేత క్విమ్, ఐఎంఎఫ్ నేత్రి క్రిస్టీన్ లగార్డ్‌లూ గుండెలకద్దుకుని ఆలింగనం చేసుకుంటున్నారు. దేశ ప్రజలు మాత్రం తనను ఈసడించుకుంటున్నారు. అందులో భాగంగా దంతెవాడ ప్రజలు పాయకా మోదీ బస్తర్‌తున్ లూటికీయల వాత్తోర్ (బస్తర్‌ను దోచుకోవటానికి వచ్చిండు) అని గ్రహించే ఉన్నత పోరాటాలకు సిద్ధమవుతున్నారు. తాము నిర్మించుకుంటున్న విప్లవ ప్రత్యామ్నాయ రాజ్యాధికార సంస్థలను దృఢంగా ఎత్తిపడుతున్నారు.



## రచనలకు ఆహ్వానం

అరుణతార అనేక ఇబ్బందుల మధ్యనే విప్లవ సాహిత్య సాంస్కృతిక రంగంలో కృషి చేస్తోంది. విరసం అధికార పత్రికగా ప్రజా ఉద్యమాల పక్షాన నిలబడి ప్రగతిశీల విలువలను నిలబెట్టడంలో సోదర సాహిత్య, రాజకీయ, సామాజిక పత్రికలతోపాటు తన వంతు బాధ్యత నిర్వర్తిస్తోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పెచ్చరిల్లిన ఈ తరుణంలో విప్లవోద్యమంతోపాటు అనేక ప్రజా ధిక్కార స్వరాలు, నిరసనలు, పోరాటాలు వెల్లువెత్తుతున్నాయి. సామాజిక సంబంధాలను, విలువలను, ప్రజా ఆకాంక్షలను పాలకవర్గ విధానాలు ధ్వంసం చేస్తున్నాయి. ప్రజలు తమ వనరుల నుంచి, స్థావరాల నుంచి విస్థాపనకు గురవుతున్నారు. ప్రజల సహజీవన సంస్కృతి మీద దారుణమైన అణచివేత కొనసాగుతోంది. ఆదివాసుల పోరాటాల మీద రాజ్యం అతి పెద్ద స్థాయిలో యుద్ధం ప్రకటించిన సందర్భంలో మనం ఉన్నాం. అణగారిన ప్రాంతాలు, కులాలు, మహిళలు, మత మైనార్టీలు తీవ్ర అభద్రతలోంచే ఆత్మగౌరవం కోసం, న్యాయమైన ఆకాంక్షల కోసం పెనుగులాడుతున్నారు. ఈ సంఘర్షణను తెలుగు సృజనాత్మక సాహిత్యం అద్భుతంగా వ్యక్తీకరిస్తోంది. మారుతున్న ఈ సామాజిక సందర్భాన్ని తెలుగు రచయితలు గతం కంటే శక్తివంతంగా వివిధ ప్రక్రియల్లో ప్రజానుకూల చైతన్యాన్ని ప్రదర్శిస్తున్నారు, సామాజికవేత్తలు విశ్లేషిస్తున్నారు.

ఈ వ్యక్తీకరణలకు, విశ్లేషణలకు అరుణతార మరింతగా వేదిక కావాలని మా ఆకాంక్ష. కథ, కవిత్వం, పాట, విమర్శ, పుస్తక సమీక్ష, అనువాదాలతోపాటు విశాల ప్రజా సాహిత్య సాంస్కృతిక రంగంలోని ఏ విషయం మీదైనా రచనలు పంపండి. సాహిత్య, కళా సిద్ధాంత, భావజాలపరమైన వాదాలను, విమర్శలను, వివిధ భాషా సాహిత్యాల్లోంచి ప్రగతిశీల రచనలను అనువాదం చేసి పంపించండి. సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాల మీద, ఉద్యమాల మీద విశ్లేషణలు, నివేదికలు పంపించండి. రాజ్యహింసా రూపాల మీద వ్యాసాలు పంపండి. అమరులైన ప్రజా ఉద్యమ కార్యకర్తలు, బుద్ధిజీవులు, రచయితలపై స్మృతి వ్యాసాలు పంపించండి.

మీ రచనల వల్లే అరుణతార తాను నిర్దేశించుకున్న సాహిత్య, సాంస్కృతిక కర్తవ్యాలను, ప్రజా ఉద్యమ బాధ్యతలను మరింత శక్తివంతంగా నిర్వర్తించగలుగుతుంది. మీ రచనల వల్లే పత్రిక ప్రమాణాలు మరింత బలోపేతమవుతాయి. పత్రికలో వస్తున్న రచనల మీద ఎప్పటికప్పుడు అభిప్రాయాలను, విమర్శలను రాసి మా కృషిని మెరుగులు దిద్దండి. అన్ని రకాలుగా మీ నుంచి సహకారాన్ని కోరుతూ...

– సం.

నివేదిక

# విప్లవ సాహిత్య సాంస్కృతిక కేతనం రెపరెపల్లో...

## చేతనా నాట్యమంచ్ దక్షిణ్ బస్తర్ డివిజన్ 4వ మహాసభల నివేదిక



అక్టోబర్ 18.. అడవిలోని పిచ్చుకల రాగాలతోనే అక్కడికి వచ్చిన కళాకారుల హడావిడి మొదలైయింది. కళాకారులంటే గండపెండేరాలు తొడుక్కొని పాండిత్యాన్ని పాటలుగా అల్లే కళాకారులు కాదు. వీళ్ళు ప్రకృతితో సంబంధాన్ని పెనవేసుకుని జీవితమే కళగా, పోరాటమే కార్యక్షేత్రంగా రాజ్యంపై రణం చేస్తున్న సహజమైన ప్రజా కళాకారులు. వీళ్లు కేవలం పాటలు పాడేవాళ్ళు మాత్రమే కాదు, అందుబాటులో ఉండే అన్ని కళలూ వాళ్ల సొంతం. వాళ్ళ కండ్లలో నిత్యం విప్లవోత్సాహం.

భారత పీడిత ప్రజల ప్రియతమ నాయకులు కా. సుశీల్‌రాయ్, కా. రావుఫ్‌ల కమ్యూన్. ఆ కమ్యూన్ మధ్యలో కా. విజాల్ ప్రాంగణమంతా ఎర్ర ఎర్రని తోరణాలతో పండగ వాతావరణం. ఆ ప్రాంగణం మధ్యలో పీడిత ప్రజల విముక్తి కోసం ప్రాణాలను ధారపోసిన అమరుల స్మారక స్థూపం. ఆ స్థూపం చుట్టూ ప్రకృతి పరిచిన పచ్చటి ఆకులతో అలంకరించిన చమన్, ఆ చమన్‌లో ఎర్రెర్రని పువ్వులు. ఆ ప్రాంగణమంతా కళా విలువలు ఉట్టిపడే తెల్లటి ముగ్గులు. ఆ ముగ్గులల్లో కూడా విప్లవ సాంప్రదాయాలే. ప్రాంగణానికి ఒక పక్క కళాత్మకంగా తీర్చిదిద్దిన కా. విజయ్, కా. నతాషాల మీటింగ్ హాల్. మరొక పక్క కళాకారుల కడుపు నింపడానికి చల్లని మనసుగల్ల కా. శాంతక్క కిచెన్, అక్కడ వంట డ్యూటీ కామ్రేడ్స్ సందడి. కమ్యూనంతా పండుగ సందడి. అది నూతన సంస్కృతికి సంకేతం.

పక్షుల అరుపులతోనే పనిలో పడ్డ కార్యకర్తలందరూ, 9 గంటలు అయ్యేసరికి వారి రోజువారి దుస్తుల నుండి అందరు సి.ఎన్.ఎం. రూపొందించుకున్న యూనిఫారంలోకి వచ్చేశారు. డోలు, డప్పులు.. వివిధ ఆదివాసీ వాయిద్యాల ధ్వనులతో కమ్యూన్ అంతా దద్దరిల్లింది. గల్లు, గల్లుమంటున్న గజ్జల శబ్దాలతో చెవులు రింగు రింగుమన్నాయి. రే... రెలాయ్యో... రే... రేలా... అనే రేలా పాటలు, సామూహికమైన గానం, లయబద్ధమైన డాఖా (సాంప్రదాయ నృత్యాలు)లతో ర్యాలీ మొదలైంది. ర్యాలీ ముందట సి.ఎన్.ఎం. ఆశయాలకు లక్ష్యాలకు సంకేతమైన ఎర్రని పతాకాలను తన భుజాలపై మోసుకు వస్తున్న డివిజన్ అధ్యక్షురాలు రాజే సిఎన్ఎం వర్ధిల్లాలి... కళ కళ కోసం కాదు, కళ ప్రజల కోసం.. నూతన ప్రజాస్వామిక విప్లవం వర్ధిల్లాలి అంటూ విప్లవ నినాదాలు. ఆటా పాట, నృత్యాలతో ర్యాలీ కా. విజాల్ ప్రాంగణంలోకి వచ్చింది. ఇక విప్లవ సాంప్రదాయంతో ఆట పాట మొదలైంది. వీళ్ళందరు కళాకారులే అయినా క్రమశిక్షణకు మారు పేరు. అందరూ వాళ్ళ వాళ్ళ లైన్లల్లోకి వచ్చేశారు. ప్రాంగణంలోని సాంస్కృతిక సైన్యమంతా సావధాన్‌లోకి వచ్చేసింది. అందరి రెడ్ సెల్యూట్‌ల మధ్యలో అధ్యక్షురాలు సిఎన్ఎం పతాకను ఎగుర వేశారు. "ఉంగాముంతా ఉంగాముంతారో.. జెండా... లాల్ జెండా ఉంగాముంతారో... జెండా" ఒక ఉద్వేగమైన సామూహికమైన పతాక గీతం సిఎన్ఎం లక్ష్యాలు కర్తవ్యాలతో కళాకారులను పునరుత్తేజ పరిచింది. మరొక కామ్రేడ్ వచ్చి అమరుల స్మారక స్థూపాన్ని ఆవిష్కరించాడు. అమరులకు జోహార్లు, అమరుల ఆశయాలను కొనసాగిస్తామంటు పేరు పేరున జోహార్లతో కమ్యూనంతా అమరుల స్ఫూర్తితో నిండిపోయింది.



ప్రతినిధులను స్వాగతిస్తూ "లాల్ సలాం కర్‌తేహై... ప్రతినిధి కామ్రేడోంకో... లాల్ సలాం కర్‌తే హై... కళాకార్ కామ్రేడోంకో..." అంటూ సామూహిక గానంతో ఉత్తేజమైన కరచలనాలతో,



కల్మషం లేని మనస్సుతో కా. విజయ్, కా. నతాషాల హాల్‌లోకి ఆహ్వానించారు. హాల్‌లోకి ప్రవేశించిన ప్రతినిధులందరూ ప్రజలు, సభ్యులు తమపై పెట్టిన ఉన్నతమైన బాధ్యతను నెరవేరుస్తామని ప్రతిజ్ఞ చేశారు. ప్రతినిధులకు స్వాగతం పలకడంలోను కళాత్మకమైన నూతన ఉత్తేజం ప్రతిబింబించింది. బూర్జువా సమాజంలో నేనంటే నేను అని నాయకత్వం కోసం పోటీలు పడుతున్న కాలంలో, ఏ కల్మషం లేకుండా తమ ప్రతినిధులను మనస్ఫూర్తిగా స్వాగతించడం, అందరూ సమాన బాధ్యతాయుత స్ఫూర్తి ప్రకటించడం అభివృద్ధి చెందుతున్న భారత నూతన ప్రజాస్వామిక సంస్కృతికి నిదర్శనం.

ప్రతినిధుల్లోంచి ప్రతి ఏరియా నుండి ఒక్కొక్క పాట పాడడంతో ప్రారంభ సభ శురువు అయింది. అప్పటికే ఉన్న డివిజన్ కమిటీ అంతా స్టీరింగ్ కమిటీగా మారిపోయి, మహాసభను నిర్వహించడానికి ఒక్క అధ్యక్ష వర్గాన్ని ఎంపిక చేసి ప్రతిపాదించింది. అధ్యక్షవర్గాన్ని ప్రతినిధులందరు ఆమోదించడంతో ఎంపికైన ముగ్గురి అధ్యక్షతన సిఎన్ఎం మహాసభలు ప్రారంభమైనాయి. పరిచయ కార్యక్రమంలో ప్రతి సభ్యుడు, సభ్యురాలు లేచి వారి పేరు, వారి ఏరియా, స్థాయిని పరిచయం చేసుకున్నారు. ప్రతినిధుల, సౌహార్ద ప్రతినిధుల జోన్ సిఎన్ఎం పరిశీలకులందరి పరిచయాలతో పాటే బడ్జెట్ ప్రవేశ పెట్టినారు. పరిచయ కార్యక్రమం ముగించిన వెంటనే మహాసభల ఎజెండాను ప్రవేశపెట్టి వాటి ప్రతిని ప్రతినిధులందరికి అందించారు. ప్రతినిధులు ఎజెండాను వారి ఏరియా సభ్యులతో చర్చించుకొని చేర్పులు మార్పులను సూచించారు. చిన్న చిన్న చేర్పులు మార్పులతో ఎజెండా సభామోదం పొందింది.

సిఎన్ఎం జోన్ అధ్యక్షులు కా. చందు వేదిక పైకి వచ్చి ఉద్వేగమైన నినాదాల మధ్య ప్రారంభ ఉపన్యాసాన్ని మొదలు పెట్టారు. కామ్రేడ్... ఎంతో మంది అమరుల కల... మన సిఎన్ఎం ఏర్పడడానికి ఎంతో మంది ప్రత్యక్ష పరోక్ష ప్రోత్సాహం ఉంది. అందు వల్ల ఇవ్వాళ మనం ఇక్కడ నిలబడి మాట్లాడుకుంటున్నాం. అందుకే ముందుగా అమరులందరికి జోహార్లు. సిఎన్ఎం ఏర్పడిన నాటి పరిస్థితి మన సంఖ్యతో ఇవ్వాల్టి మన ఈ సంఖ్యను చూస్తుంటే ఆనందంగా ఉంది. కాని ఈ సంఖ్య సరిపోదు. ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యవాదం తీవ్రమైన సంక్షోభ పరిస్థితి ఎదుర్కొంటోంది. ప్రపంచ పరిస్థితులకు తగినట్లే దాని బంటుగా ఉన్న ఎన్‌డిఎ ప్రభుత్వ తీరు ఉంది. అందులో భాగంగానే మన దండకారణ్య ప్రాంతంలో జరుగుతున్న దోపిడీ, రాజ్యహింస, ప్రజలపై జరుగుతున్న సామూహిక హత్యలు, నరసంహారాలు జరుగుతున్నాయి. భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతుల దాడులు జరుగుతున్నాయి. దోపిడి సంస్కృతులను ఎండగట్టి, ధ్వంసం చేయవలసిన అవసరాన్ని, సిఎన్ఎం మీద నేడు ఉంది. ఇది చారిత్రకమైన బాధ్యత.. అని మహాసభకు దిశా నిర్దేశం చేసే ఎజెండాలోని చర్చనీయాంశాలకు బలమైన భూమికను అందించి లాల్ సలామ్ చెపుతూ ముగించాడు.

డిసిఎస్‌సి (దండకారణ్య కల్చరల్ సభ కమిటీ) సభ్యుడు కా. అర్జున్ మహాసభల నుద్దేశించి ప్రసంగిస్తూ, కళాకారులపై పీడిత ప్రజలు, మన ప్రియతమ అమరులు పెట్టిన బాధ్యతను గుర్తు చేశారు. దండకారణ్యంలో భూస్వామ్య సంస్కృతి రూపంలో ఉన్న వెనకబడిన మూఢనమ్మకాలు, తెగ పెద్దల పెత్తందారీ సంస్కృతి, సామ్రాజ్యవాద రూపంలో ఉన్న మార్కెట్ మాయాజాలాన్ని వివరించాడు. రాజ్యం తీసుకు వస్తున్న ద్విముఖ దాడిని తిప్పి కొట్టడానికి సాంస్కృతిక పోరాటంతో పాటు సాయుధ నిర్మాణం బలపడకుండా ఈ దాడిని ఎదుర్కోలేం. అందుకే ప్రజలు ఎక్కడికక్కడే ఎదుర్కొంటున్న సాంస్కృతిక దాడికి వ్యతిరేకంగా ప్రజలను సంఘటితం చేస్తూనే ప్రజలను సాయుధం చేయాలని వివరించి, లాల్ సలామ్ చెపుతూ ముగించాడు.

సౌహార్ద ప్రతినిధి కా. రాబర్ట్ (రెవెల్యూషనరి డెమోక్రటిక్ కల్చరల్ ఫ్రంట్) సందేశం ఇస్తూ కామ్రేడ్స్... ఎంతో మంది అమరుల స్వప్నం, శ్రీకాకుళ పోరాటంలో కా. సుబ్బారావు పాణిగ్రాహి, చినబాబుల నుండి కా. బెల్లి లలిత, కా. విద్య దాకా రాజ్యంతో పోరాడి అమరులైనారు. వారి వారసత్వమే సిఎన్ఎం. సిఎన్ఎం లాంటి కళా సంఘం నేడున్న పరిస్థితిలో చాలా అవసరం. దేశ వ్యాపితంగా ప్రజలు సిఎన్ఎం పాటల కోసం చూస్తున్నారు. ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యవాదం ఆర్థిక సంక్షోభ సుడిగుండంలో కూరుకుపోయి, పీడిత దేశాలపై తన విచ్చలవిడి దోపిడీని చేస్తుంది. ఈ దేశంలో భూస్వామ్య సంస్కృతి మానవ సమాజాన్ని అంధకారంలోకి నెట్టెస్తూ, మహిళలకు స్వేచ్ఛా, స్వతంత్రాలు లేకుండా చేసి వంటింటికి బానిసలను చేస్తోంది. సామ్రాజ్యవాద విష సంస్కృతి మనుషుల మెదళ్లను ప్రభావితం చేస్తూ, మంచి విషయాలు ఆలోచించకుండా చేసి అభివృద్ధిని అడ్డుకుంటోంది. కేంద్రంలో ఏర్పడిన ఎన్‌డిఎ ప్రభుత్వం భయంకరమైన హిందుత్వ దాడిని కొనసాగిస్తోంది. ఈ పరిస్థితిలో సిఎన్ఎం మహాసభలు జరగడం ఒక ప్రాధాన్యత సంతరించుకున్నది. సిఎన్ఎం పైన ఉన్న బాధ్యతను గుర్తింప చేస్తున్నది. సాంస్కృతిక రంగంలో వినూత్నమైన మార్పులు తీసుకువచ్చి, భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతిరేకంగా సాంస్కృతిక పోరాటం కొనసాగిస్తుందని

కోరుకుంటున్నాను. దేశంలో ఉన్న వివిధ సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతిరేకమైన, భావ సారూప్యత సంస్థలతో సిపిఎస్ఎంకు మధ్యన నిరంతరం సౌహార్ధత కొనసాగాలని కోరుకుంటూ ముగిస్తున్నాను... అని అన్నాడు.

కా. గంగాల్ ఎటిబి సాంస్కృతిక రంగ సౌహార్ధ ప్రతినిధి సందేశం ఇస్తూ కామ్రేడ్స్... దక్షిణ బస్తర్ సిపిఎస్ఎం 4వ మహాసభలకు జేజేలు. . భారత విప్లవ సాంస్కృతిక సేనానులు ఈ నేల మీద రక్తం ధారపోసి విప్లవోద్యమాన్ని గానం చేసిన కా. సుబ్బారావు పాణిగ్రాహి నుండి కా. మాధవ్ దాకా ఎందరో కార్మిక వర్గ ఉత్తమ కళాకారుల వారసులు చేతనా నాట్యమంచ్ కళాకారులు. సిపిఎస్ఎం ప్రపంచ సోషలిస్టు సంస్కృతి నిర్మాణంలో భాగం. ప్రపంచ చరిత్ర ప్రతి మలుపులో సాంస్కృతిక రంగం చాలా కీలకమైన పాత్ర పోషించింది. ఈ రంగం రాజకీయ, సాంస్కృతిక, సామాజిక, సైనిక పునాదులను ప్రచారం చేసే భావజాలరంగం. అందుకే బూర్జువా సాంస్కృతిక రంగానికి, ప్రజా సాంస్కృతిక రంగానికి నిరంతరం వైరుధ్యం కొనసాగుతోంది. దేశంలో సామ్రాజ్యవాద సంస్కృతి బుసలు కొడుతూ, విషం కక్కుతోంది. పీడిత ప్రజలను రిమోట్‌తో నడిపించడానికి మర మనుషులుగా తయారు చేస్తోంది. బ్రాహ్మణీయ భూస్వామ్య, కాలం చెల్లిన వెనకబడిన మూఢ విశ్వాసాలను, ప్రబోధిస్తూ ప్రజలను తెలివిలేనివారిగా చేస్తూ, కుల, మత, వైరుధ్యాలను తీవ్రతరం చేస్తూ పబ్బం గడుపుకుంటున్నది. ఒక వైపు భూస్వామ్య, సామ్రాజ్యవాద విధానాలు, వాటి వెంటనే వచ్చే వారి పనికి రాని సంస్కృతి ప్రజలపై దాడి చేస్తున్న నేపథ్యంలో సిపిఎస్ఎం డివిజన్ మహాసభ జరగడం ఒక చారిత్రక అవసరాన్ని గుర్తింప చేస్తున్నది. అందుకే భూస్వామ్య, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా సిపిఎస్ఎం అభివృద్ధిలో ఎటిబి సాంస్కృతిక రంగం నుండి అవసరమైన సహకారాన్ని అందిస్తుందని చెపుతూ ముగిస్తున్నానన్నాడు.

రెండవ రోజు సిపిఎస్ఎం ప్రణాళికా నిబంధనావళిని జోనల్ అధ్యక్షులు కా. చందు వివరించాడు. ఆ తర్వాత చర్చలో ప్రతినిధులు లోతైన, అర్ధవంతమైన అభిప్రాయాలు వచ్చాయి. కొన్ని చేర్పులు, కొన్ని మార్పులు, కొన్ని వివరణలతో ప్రణాళిక - నిబంధనావళిని సభ ఆమోదించింది.



మూడవ రోజు సిపిఎస్ఎం 4 సంవత్సరాల సమీక్షా పత్రాన్ని స్టీరింగ్ కమిటీలోని సభ్యులు అంశాల వారీగా ప్రవేశపెట్టగా దానిలోని ప్రతి అంశంపై రాజకీయ, నిర్మాణ, సాహిత్య, సాంస్కృతిపరమైన లోతైన చర్చ జరిగింది. ప్రతినిధులందరు చాలా ఉత్సాహంగా చర్చలో పాల్గొని అనేక మార్పులు చేర్పులను సూచించారు. వచ్చిన సూచనలనన్నింటిని పరిగణనలోకి తీసుకుంటు అందులో స్వీకరించ వలసిన వాటిని స్వీకరిస్తూ సభామోదం పొందింది. సహేతుకమైన సూచనలను క్రోడీకరిస్తూ సమీక్షను సంపద్వంతం చేయడానికి ఒక డ్రాఫ్టింగ్ కమిటీని నియమించింది.

నాలుగవ రోజు విమర్శ - స్వయం విమర్శను ప్రతినిధులు మొదలు పెట్టినారు. ముందుగా డివిజన్ కమిటీ నుండి అధ్యక్షురాలితో సహా ప్రతి సభ్యుడు / సభ్యురాలు 4 సంవత్సరాల కార్యాచరణలో తమ వైపు నుండి జరిగిన లోపాలపై, తమలో ఉన్న బలహీనతలపై స్వయం విమర్శ ప్రకటిస్తూ, వాటిని అధిగమిస్తామని హామీ ఇచ్చారు. కార్యకర్తల నుండి కొన్ని విమర్శలు వచ్చాయి. వాటికి కూడా స్వయం విమర్శ చేసుకున్నారు.

## నూతన కమిటీ ఎన్నిక

స్టీరింగ్ కమిటీ డివిజన్‌లోని అన్ని ఏరియాలకు ప్రాతినిధ్యం ఉండేలా ఒక ప్యానల్‌ను ప్రతిపాదించింది. దీని మీద అందరి అభిప్రాయాలు సేకరించిన తర్వాత ఎన్నికల కార్యక్రమం మొదలైయింది. ప్రతి ఏరియా వాళ్లు స్పష్టమైన అభిప్రాయాలు వ్యక్తం చేయడంతో ఎన్నిక పూర్తి అయింది. ఎన్నుకున్న ప్యానల్ తమ అధ్యక్షుడ్ని / అధ్యక్షురాలిని ఎన్నుకోవడానికి అవకాశం ఇవ్వడంతో ప్యానల్ తమ అధ్యక్షురాలుగా కా. రాజెను ఎన్నుకున్నారు.

తర్వాత నూతన నాయకత్వం చేత ప్రతిజ్ఞ చేయించారు.

చేతనా నాట్యమంచ్ డివిజన్ కమిటీ సభ్యులమైన మేము సిపిఎస్ఎం ఆశయాలకు, లక్ష్యాలకు, కట్టుబడి ఉంటామని, ప్రజల సంస్కృతిని నిలబెట్టడానికి మేము బాధ్యతగా పనిచేస్తామని, ఆచరణలో ఎన్ని సమస్యలు వచ్చినా, వాటిని సరి అయిన నిర్మాణ పద్ధతిలో పరిష్కరించుకొని ముందుకు నడుస్తామని, ప్రజల లోపల ఉన్న అనేకమైన కళలను అధ్యయనం చేస్తూ కొత్త కళారూపాలను సృష్టించడానికి కృషి చేస్తామని, సామ్రాజ్యవాద సంస్కృతిని వ్యతిరేకిస్తూ, నూతన ప్రజాస్వామిక సంస్కృతిని గ్రామ గ్రామాన నిలబెట్టడానికి సర్వదా కృషి చేస్తామని ప్రతిజ్ఞ చేస్తున్నాం" అంటూ డిసిఎస్‌సిలోని సభ్యుడు కా. అర్జున్ కొత్త నాయకత్వం చేత ప్రతిజ్ఞ చేయించాడు. సభ నిర్వహణ కోసం ఎన్నుకున్న అధ్యక్షవర్గం తమ చివరి మాటలను ఉద్ఘటిస్తూ వేదికను నూతన కమిటీకి అప్పగించింది. . నూతన కమిటీ అధ్యక్షురాలు తదుపరి సమావేశాన్ని కొనసాగించారు. నూతన అధ్యక్షురాలి అధ్యక్షతన

ప్రతినిధులందరు ప్రతిజ్ఞ చేశారు. సభ నూతన ఉత్తేజంతో నినాదాల హోరైంది.

నూతన కమిటీ కొన్ని తీర్మానాలను ప్రవేశపెట్టింది.



1. అంతర్జాతీయ, దేశీయ పరిస్థితులపై..
2. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్న రాజ్యహింస, మానసిక యుద్ధానికి వ్యతిరేకంగా..
3. హిందూ ఫాసిజానికి వ్యతిరేకంగా..
4. ప్రభుత్వం తీసుక వస్తున్న సరెండర్ పాలసీలకు వ్యతిరేకంగా..
5. బైలాడిల్లా, పోలవరం, బాల్కోదా విమానాశ్రయాల వలన జరుగుతున్న విస్థాపన్‌కు వ్యతిరేకంగా..
6. అధిక ధరలు, అవినీతికి వ్యతిరేకంగా
7. భూస్వామ్య సంస్కృతి మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా..
8. సామ్రాజ్యవాద విష సంస్కృతికి వ్యతిరేకంగా...
9. అభివృద్ధి నిరోధకమైన ఇసాయి (క్రిష్టియన్) ధర్మ ప్రచారానికి వ్యతిరేకంగా...

ఈ తీర్మానాలపై ప్రతినిధులు విస్తృత చర్చ జరిపి ఆమోదించారు.

చివరగా సౌహార్ద ప్రతినిధుల తరపున పరిశీలకుడిగా కా. రాజన్ (రివల్యూషనరీ కల్చరల్ ఆర్గనైజేషన్) మాట్లాడుతూ కామ్రేడ్స్... మనందరి పైన ఒక బాధ్యత ఉంది. అది భావజాలంపై యుద్ధం చేయడం. పాట పాడాలన్నా, తుపాకీ పట్టాలన్నా మనలో చైతన్యం రావాలి. ఆ చైతన్యాన్ని అందించే శక్తి పాటకు ఉంది. ప్రజలను చైతన్య పర్చడానికీ, మనం మన సాధారణమైన జీవనాన్ని వదిలి, భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతిని రూపుమాపి నూతన ప్రజాస్వామిక సంస్కృతిని నిర్మించడానికీ సిఎన్ఎం లాంటి కళా సంఘాల్లో చేరాం. ఇవ్వాళ ఇలాంటి కళా సంఘాలు చాలా అవసరం. సిఎన్ఎం ఒక్క డికేకే పరిమితం కాకుండా దేశవ్యాపిత ప్రజలకు చైతన్యాన్నందించేదిగా ఎదగాలని కోరుకుంటున్నాను. ఈ సభలు చాలా రాజకీయంగా, నిర్మాణాత్మకంగా జరిగినాయి. ఈ సభలలో జరిగిన చర్చ చాలా చైతన్యవంతమైనది. సభ నిర్వహణ చాలా ప్రజాస్వామ్యబద్ధంగా జరిగింది. అందుకే సిఎన్ఎం చైతన్యం చాలా ఉన్నతమైనది. మేము మీ నుండి అనేక విషయాలు నేర్చుకుంటూ, భూస్వామ్య సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో మరింత ఉత్సాహంగా పనిచేస్తామని చెపుతూ, మన మధ్య ఇలాంటి సౌహార్దత నిరంతరంగా కొనసాగాలని చెపుతూ ముగిస్తున్నాను.. అన్నాడు.

చివరిగా అధ్యక్షురాలు జెండావందనం కార్యక్రమంలో మాట్లాడుతూ... మనం 5 రోజులుగా ఈ డివిజన్ సిఎన్ఎం మహాసభలను శత్రువు కార్పొరేట్ సెక్యూరిటీల, కూంబింగుల, హెలికాప్టర్ల, యూఎవి డేగ కన్నుల మధ్య... అంటే యుద్ధం మధ్యనే విజయవంతంగా ముగించుకున్నాం. ఈ మహాసభల విజయం వెనక ప్రజల, మన సిఎన్ఎం కళాకారుల పూర్తి సహకారం, భాగస్వామ్యం ఉన్నది. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు రక్షణ కవచంగా ఉండి మనలను కంటికి రెప్పలాగా కాపాడుకున్నారు.

అందుకే ప్రజల శక్తి ముందు ఏ శక్తి నిలువజాలదని అర్థం చేసుకుందాం. ఈ మహాసభల విజయానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన ప్రజలందరికి పేరు పేరునా విప్లవాభినందనాలు. ఈ మహాసభలకు వివిధ రాష్ట్రాల నుండి సౌహార్ద ప్రతినిధులుగా వచ్చిన కా. రాబర్ట్, కా. గంగాల్, కా. రాజన్, కా. శ్రీమాలకు మరొక్కసారి విప్లవాభినందనలు. ఈ మహాసభలలో రూపొందించుకున్న తక్షణ కర్తవ్యాలను సృజనాత్మకంగా ప్రజల మధ్యలోకి తీసికెళ్లాలి. వర్గపోరాటాన్ని అభివృద్ధి చేసే దిశలో మన సాంస్కృతిక సమరాన్ని సాగిద్దాం... అంటూ రెడ్ సెల్యూట్స్ మధ్య జెండాను అవనతం చేసింది. ఆటా పాటల నడుమ అమరులకు జోహార్లతో మహా సభ ముగిసింది.

(అరుణతార సంపాదకవర్గానికి ఈ నివేదిక ఆలస్యంగా అందింది. అయినా విప్లవ సాహిత్య సాంస్కృతిక రంగంలో దండకారణ్య చేతనా నాట్యమంచ్‌కు ఉన్న విశిష్టత రీత్యా పాఠకుల కోసం దీన్ని ప్రచురిస్తున్నాం... సం.)



విరసం కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికలను, విరసం ప్రచురణలను **www.virasam.in** వెబ్‌సైట్‌లో చూడవచ్చు. సాఫ్ట్‌కాపీలు డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు.

కరపత్రం

# మళ్లీ అదే ప్రశ్న... రచయితలారా మీరెటు వైపు?

**విప్లవ విద్యార్థి కామ్రేడ్ వివేక్ అమరత్వ స్ఫూర్తితో విరసం 45వ ఆవిర్భావ దినం జరుపుకుందాం**

**సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో వర్గపోరాట చైతన్యం ప్రతిబింబిద్దాం**

12 జూలై 2015, ఆదివారం ఉదయం 9.30 నుండి సాయంత్రం 5.30 వరకు

హైదరాబాద్, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో, కామ్రేడ్ వివేక్ వేదికపై

జూన్ 12న వరంగల్-ఛత్తీస్‌ఘడ్ సరిహద్దుల్లో ఒక ఎన్‌కౌంటర్ జరిగింది. అందులో ఇద్దరు ఆదివాసీ యువతులు మడకం జోగి, మడకం దేవెలతో పాటు హైదరాబాదులో న్యాయశాస్త్రం చదువుతున్న కామ్రేడ్ వివేక్ అమరుడయ్యాడు. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో క్రియాశీలంగా పని చేసిన వివేక్ ఆ తర్వాత విప్లవోద్యమంలోకి వెళ్లిపోయాడు. తెలంగాణలో కొందరు మేధావులు రాజ్యపు మత్తులో ఓలలాడుతున్న తరుణాన వివేక్ ఓ వేకువ జామున లేచి దండకారణ్యం వైపు అడుగులు వేశాడు. అంతకు ముందు నుంచే విప్లవ చైతన్యంతోనే తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్న వివేక్ తెలంగాణ పునర్నిర్మాణమంటే తిరిగి గెరిల్లా జోన్‌గా, విముక్తి ప్రాంతంగా తీర్చిదిద్దడమే అనే అవగాహనతో విప్లవోద్యమంలోకి వెళ్లి అమరుడయ్యాడు.

తెలుగు సాహిత్య లోకం రకరకాల రుగ్మతలతో రోగగ్రస్థమై ఉన్నపుడు శ్రీకాకుళ పోరాట ప్రేరణతో విశాఖ విద్యార్థులు రచయితలారా మీరెటువైపు? అని ప్రశ్న వేసి విరసం ఆవిర్భావానికి తెర తీశారు. అనేక అటుపోట్ల వల్ల, తీవ్రమైన రాజకీయార్థిక పరిణామాల వల్ల తెలుగు సాహిత్య లోకం, ముఖ్యంగా తెలంగాణ సాంస్కృతిక, మేధో రంగం కొత్త రాష్ట్రపు ఎండమావి వెంట పరుగులు తీస్తున్న తరుణంలో మళ్లీ అదే ప్రశ్న. రచయితలారా... మీరెటువైపు? అని. ఈ ప్రశ్నను ఇప్పుడు కా. వివేక్ ట్రిగ్గర్ మీదికి తీసుకొని వచ్చాడు. అంతేకాదు, ఈ ఏడాదితో ఫాసిజం అంతమై 70 ఏళ్లు అవుతుంది. మనం సరిగ్గా ఈ మాట అనుకొనే సమయానికి మన ప్రియతమ భారతదేశాన్ని హిట్లర్ భావజాల వారసులు పాలిస్తున్నారు. నిరంకుశ నిజాం ప్రేరణతో ఒకడు, ఫ్యూడల్ పెత్తందారు వెంకటాద్రి నాయుడి పేరిట ఒకడు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలను నెత్తుట ముంచుతున్నారు. ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటులో కొన్ని ప్రజల ప్రయోజనాలు నెరవేరినా స్వభావరీత్యా బూర్జువా ప్రయోజనాలే అధికంగా నెరవేరుతాయని కేసీఆర్ ఏడాది పాలన రుజువు చేసింది. అటూ ఇటూ రెండు ప్రభుత్వాలు ఇప్పటికీ ప్రజలను అభద్రతాభావంలోనే ఉంచి తమ నిరంకుశ దోపిడీ పాలనను సాగించాలని చూస్తున్నారు. ఈ కొద్ది కాలంలోనే చంద్రబాబు ప్రభుత్వం అవినీతిలో పీకలలోతున కూరుకుపోయింది. అయినా రాజధాని మాయాజాలంతో ఆంధ్రప్రదేశ్ ప్రజలను మోసం చేయాలనుకుంటున్నాడు. కేసీఆర్ చివరికి ఉస్మానియా యూనివర్సిటీ భూములు కూడా లాక్కోవడానికి నిస్సిగ్గుగా సిద్ధమై తీవ్రమైన ప్రజా వ్యతిరేకతను మూటగట్టుకున్నాడు. అయినా ఇద్దరూ తమ ప్రయోజనాలకు దెబ్బ తగిలినప్పుడల్లా పొరుగు రాష్ట్రం పైకి తమ ప్రజలను ఎగదోస్తున్నారు. ఏడాది తరువాత కూడా భావోద్వేగాలను రెచ్చగొట్టి బతికేయాలనే ప్రయత్నిస్తున్నారు.

రాష్ట్ర పునర్విభజన ఘట్టంలో తెలుగుజాతి గురించి గగ్గోలు పెట్టిన ఆంధ్రప్రదేశ్ నేతలు ఇప్పుడు ఢిల్లీ కంట్రోల్‌లో ఆడుతున్నారు. స్వయం పాలన డిమాండ్‌పై కేంద్ర ప్రభుత్వాన్ని ధిక్కరించిన ప్రజా పోరాటాలను ఊతం చేసుకొని ఎదిగొచ్చిన తెలంగాణ బూర్జువా నాయకత్వం, రాష్ట్రాన్ని ఢిల్లీ చేతుల్లో పెట్టేందుకు తహతహ లాడుతున్నది. హైదరాబాద్ ఉమ్మడి రాజధాని, పోలవరం ఆదివాసీ ముంపు ప్రాంతాల విలీనంలోనే కాదు, దోపిడీ భూసంస్కరణలు, పారిశ్రామిక విధానం అమల్లోనూ కేసీఆర్, పోలీస్ గవర్నర్ నరసింహన్‌తో కలిసి నరహంతక మోదీ 'గుజరాత్ నమూనా'ను తలకెత్తుకున్నాడు. రాష్ట్ర ప్రజల సంక్షేమానికి కంకణబద్ధుడనని చాటుకునే చంద్రబాబు, భూసేకరణ పేరుతో భూ ఆక్రమణను వేగం చేస్తున్నాడు. మోదీతో జతకట్టి రాష్ట్రంలో విధ్వంసక అభివృద్ధి పథకాలను ముందుకు తీసుకుపోతున్నాడు. ప్రభుత్వాన్ని తగ్గించి, పాలనను పెంచుతానని మోదీ అంటున్నాడు కానీ, విచిత్రంగా తెలుగు రాష్ట్రాల పాలకులు అంతకంతకూ కేంద్రానికి ఉపగ్రహాలుగా మారుతున్నారు. మోదీ 'వికేంద్రీకరణ' పిలుపులోని 'మరింత కేంద్రీకరణ' పరమార్థాన్ని యెరిగి మసులుకొంటున్నారు. అందువల్లనే దేశమంతా వ్యతిరేకించిన భూసేకరణ ఆర్డినెన్స్‌ను చంద్రబాబు, కేసీఆర్ ఆంధ్రప్రదేశ్, తెలంగాణల్లో కేంద్రంతో పనులు ఉన్నవారి హడావుడిని 'స్వచ్ఛ భారత్' తలపిస్తుంది. కానీ, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ పాలకులు మటుకు ఈ కార్యక్రమాన్ని తప్పనిసరి చేసేశారు. మోదీ ప్రతిష్టను పెంచేందుకు ఇలాంటి స్కీమ్‌లను అమలు చేస్తున్నారు. కాషాయీకరణ ప్రచారంలోనూ ఇరు రాష్ట్రాల సీఎంలు పోటీలు పడుతున్నారు.

కేసీఆర్ 'బంగారు తెలంగాణ'లో బంగారాన్ని, చంద్రబాబు 'నవ్యాంధ్ర' పిలుపులో నవ్యతను చూడటం అజ్ఞానమే. కానీ బంగారం మీద, ఆ నవ్యత మీద మోజున్న మేధావులు మనకు తారసపడుతున్నారు. పైగా ఆ మేధావులు కొత్త రాష్ట్రాలను నడపటంలో ప్రభుత్వాలకు వెసులుబాటు కల్పించాలనే దాకా వెళ్లారు. వాస్తవానికి ఈ రెండు రాష్ట్రాల్లో ప్రభుత్వ విధానాలు ఈనాటివి కావు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగా గత ప్రభుత్వాలు అమలు చేసిన విధానాలనే ఈ ప్రభుత్వాలు అనుసరిస్తున్నాయి. ఇంకా వేగంగా ముందుకు తీసుకుపోతున్నాయి.

## కార్యక్రమం

**ఉదయం 9.30కు : పతాకావిష్కరణ**
**10.00 గంటలకు సభ ప్రారంభం**

తొలి సెషన్ అధ్యక్షత : రివేరా

**మేక్ ఇన్ ఇండియా - కాషాయీకరణ**
**- జనతన సర్కార్ ప్రత్యామ్నాయం**
పాణి
**ప్రజా వ్యతిరేక భూసేకరణ ఆర్డినెన్స్**
రవికుమార్ (న్యాయవాది)

**1.30కు భోజన విరామం**

మధ్యాహ్నం 2.30కు రెండో సెషన్ ప్రారంభం
అధ్యక్షత : రాంకీ

**తెలంగాణలో పాలకుల ఎజెండా - ప్రజల జెండా**
కాశీం
**ఆంధ్రప్రదేశ్ పాలకుల ఎజెండా - ప్రజల ఎజెండా**
వరలక్ష్మి
**మళ్లీ అదే ప్రశ్న... రచయితలారా మీరెటు వైపు?**
వరవరరావు

**పుస్తకావిష్కరణలు**

1) ఏది నేరం (హజారీబాగ్ జైలు కథలు - బి.అనూరాధ), 2) కామ్రేడ్ వివేక్ స్మృతిలో (విరసం కవితా సంకలనం), 3) మేక్ ఇన్ ఇండియా వినాశకరం-జనతన సర్కార్లు ప్రత్యామ్నాయం, 4) మేడక యుగంధరరావు కవిత్వం, 5) చైనా కమ్యూనిస్టు పార్టీ మౌలిక భావనలు, 6) ఐక్యసంఘటన వ్యాసాలు, 7) వైరుధ్యాలు-మావో, 8) తత్వశాస్త్రం మాయాజాలం కాదు, 9) చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు, 10) బాలగోపాల్ తాత్విక గందరగోళం, 11) మెరిసే అక్షరాల వెనక - ఎన్. రాజశేఖరం

***ప్రజా కళామండలి సాంస్కృతిక కార్యక్రమాలు ఉంటాయి***

ముస్లిం యువకులను, ఎర్ర చందనం, కూలీలను, విప్లవకారులను కాల్చేయడంలో కూడా ఇద్దరి విధానాలు ఒకటే. అమరావతి రాజధాని, హైదరాబాద్ విశ్వనగరం, మిషన్ కాకతీయ, పవర్ ప్లాంట్లు, మైనింగ్ ప్రాజెక్టుల కింద, రక్తం తప్ప నీళ్లు పారే వీలు లేని పట్టిసీమ, నక్కలగండి తదితర సాగునీటి పథకాల అవినీతి ముంపు కింద పేదలు, దళితులు, ఆదివాసీలు తమ భూములను, బతుకులను కోల్పోతున్నారు. వారంత రాష్ట్ర ఆవిర్భావ వేడుకలను సైతం బహిష్కరించి రోడ్డెక్కారు. నాడు ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు తిరిగే దారిలోని ఫుట్‌పాత్‌లను, వాటిపై కదలాడే జీవన దృశ్యాలను చంద్రబాబు తుడిచేశాడు. ఇప్పుడు కేసీఆర్ మరింత ముందుకెళ్లి, 'మేక్ ఇన్ ఇండియా' సింహం ఆకలి తీర్చడానికి హైదరాబాద్ పాతబస్తీని, పేదల వాడలను బలిపెడుతున్నాడు. ఈ సింహంలోనే మోదీని చూసుకొంటూ మురిసిపోతున్నాడు. హైదరాబాద్‌లో లక్షలాది ఎకరాల భూమిని దానికి ఆహారంగా వేస్తున్నాడు. దానికోసం 'డబుల్ బెడ్‌రూములు' 'జీ ప్లస్ ఇళ్ల' కలలు విసురుతున్నారు. 'స్వచ్ఛ హైదరాబాద్' అంటూ వలలు పరుస్తున్నాడు. ఆస్పత్రులు, విద్యా సంస్థలకు దానం చేసిన నవాబుల భూములను, వక్ఫ్, పేదల స్థలాలను కేసీఆర్ గుంజుకుంటే, రాజధాని ముసుగులో ముక్కారు పంటలు పండే పచ్చని భూములను కార్పొరేట్, విదేశీ బహుళజాతి కంపెనీలకు చంద్రబాబు కారుచౌకగా దోచి పెడుతున్నాడు. సంఖ్యాబల ప్రదర్శనకు తప్ప మరెందుకూ కొరగాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై పైచెయ్యి కోసం ఒకడు ఫిరాయింపులకు పాల్పడితే, ఒకడు కెమెరాల సాక్షిగా ఎమ్మెల్యేలకు డబ్బులు వెదజల్లుతూ దొరికిపోయాడు. ఒక్కమాటలో అరవై ఏళ్ల కాలంలో అనుభవించిన అణచివేత, పీడనను ఈ ఏడాది కాలంలోనే తెలుగు రాష్ట్రాలు చవిచూస్తున్నాయి.

ఇలాంటి పరిస్థితుల్లో నిప్పులా రగిలి 'కంచులా మోగాల్సిన కంఠాలు' కరువవ్వడం అన్నింటి కన్నా విషాదం. నెత్తి కాలే ఎండల్లో నిలువు కాళ్లపై నిలబెడుతున్నా, ఆఫీసుల చుట్టూ తిప్పుకొంటున్నా సర్కారీ మెప్పు, అవార్డులు, నజరానాలు, పర్సు కోసం... ఆ అవమానాలను, తిరస్కారాలను లోలోనే దిగమింగుతున్న కొంతమంది మేధావులు, సాహితీవేత్తల గురించి వింటున్నాం! ఇది ఎంత దూరం పోయిందంటే ప్రజాస్వామిక, లౌకిక వేదికలపై కనిపించే, వినిపించే చాలా ముఖాలు, పేర్లు, కలాలు, గొంతులు ఈనాడు అధికార పార్టీల జెండాలు, ఎజెండాల్లో పూర్తిగా కరిగిపోతున్నాయి!

ఇలాంటి గడ్డు కాలంలో 'రచయితలారా! మీరెటు వైపు?' అన్న ప్రశ్న మరోసారి తెలుగు నేలను తొలుచుకొని పైకి వస్తున్నది. 45 ఏళ్ల క్రితం నక్సల్బరీ తొలిసారి విసిరిన ఈ సవాల్‌ను తెలుగు కవులు, రచయితలు, కళాకారులు అందుకొని ప్రజా పక్షపాతాన్ని ప్రకటించుకొని విప్లవ సాహిత్యోద్యమాన్ని రగిలించారు. ప్రశ్న అదే, పాతదే. కానీ అది తిరిగి తెరపైకి వచ్చింది. ఆనాడు నక్సల్బరీ గొంతులో పలికిన 'ప్రత్యామ్నాయం', ఈనాడు విప్లవ జనతన సర్కారు రూపంలో మన ఎదుట నిలిచింది. బీజ రూపంలోనైనా ప్రత్యామ్నాయ ప్రజాధికారాన్ని స్థాపించింది. నిజమైన భారతదేశానికి ఒక నమూనా దండకారణ్యంలో రూపొందుతున్నది. కాబట్టి 'మీరు ఎటు వైపు' అనే ప్రశ్న మరింత పదునెక్కి పరిణత రూపంలో మరోసారి మన ముందుకొచ్చింది. ఈ ప్రశ్నను అందుకొందాని. సాహిత్య శిబిరం అన్ని తావులా వర్గపోరాట చేవను ప్రదర్శించాల్సిన తరుణమిది. ఈ కాలపు ఆదర్శ విప్లవ నమూనాగా నిలిచిన కామ్రేడ్ వివేక్, కామ్రేడ్ మడకం జోగి, కామ్రేడ్ మడకం దేవేల స్ఫూర్తితో ఈ ప్రశ్నను అందుకుందాం. విప్లవమే ప్రత్యామ్నాయమనే దండకారణ్యాన్ని స్వాగతిద్దామని విరసం తన ఆవిర్భావ సభకు అందరినీ సాదరంగా ఆహ్వానిస్తున్నది.

***- విప్లవ రచయితల సంఘం***

# సోషలిజమే ప్రత్యామ్నాయం, నక్సల్బరీయే భారత విప్లవ పంథా
# వ్యవస్థను అర్థం చేసుకోవాలన్నా, మార్చాలన్నా మార్క్సిజమే మార్గం

మిత్రులారా,

2017 నవంబర్ నాటికి బోల్షివిక్ విప్లవ విజయానికి వందేళ్ళు పూర్తవుతాయి. అదే ఏడాది మే నాటికి నక్సల్బరీకి యాభై ఏళ్ళు. 2018 నాటికి మార్క్స్ 200వ జయంతి. 2019 అక్టోబర్ నాటికి చైనా విప్లవానికి డెబ్బై ఏళ్లు. వందేళ్లకు, యాభై ఏళ్లకు, జయంతులకు ఏ ప్రత్యేకతా లేదు. మనం గుర్తించుకునే సందర్భాలు మాత్రమే. ప్రస్తుత సంక్షుభిత వాతావరణంలో, బూర్జువా ప్రజాస్వామ్యం పూర్తిగా విఫలమైపోయి ఫాసిస్టు రూపు తీసుకుంటున్న దశలో ఈ చారిత్రక మైలురాళ్లను గర్తించుకునే సందర్భాలు వస్తున్నాయి. "ఎప్పటి సోవియట్ విప్లవం గురించి మాట్లాడుతున్నారు? ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి" వంటి మాటలు చాలా విన్నాం, వింటున్నాం. సోవియట్ ఒక విఫల ప్రయోగమని, ఏకపార్టీ నియతృత్వమనీ, వ్యక్తి స్వేచ్ఛను అణగదొక్కేదనీ, బూర్జువా ప్రజాస్వామ్యానికి ప్రత్యమ్నాయం లేదని ఎన్నో వ్యాఖ్యలు, వాదనలు సరే సరి.

ఒక వైపు దేశం తర్వాత దేశం సామ్రాజ్యవాద మార్కెట్ సంక్షోభంలో కూరుకుపోతున్నాయి. సామ్రాజ్యవాదుల దురాక్రమణ యుద్ధాల్లోనో, అవి ప్రేరేపిస్తున్న అంతర్యుద్ధాల్లోనో నెత్తురోడుతున్నాయి. ఫాసిజం, ఫండమెంటలిజం మానవజాతిని దారుణ తిరోగమనం వైపు తోసేస్తూ ఉంది. మరోవైపు ఈ దుర్మార్గమైన వ్యవస్థకు ప్రత్యామ్నాయమే లేదని చెప్పే సామ్రాజ్యవాద పెట్టుబడి, ప్రత్యామ్నాయ ప్రయత్నాలను, స్వావలంబన ఆర్థిక విధానాలను హింసాత్మకంగా నిర్మూలించేదుకు తెగబడుతున్నది. బూర్జువా ప్రజాస్వామ్యం మానవాళికిచ్చిన హామీలు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం హాస్యస్పదంగా తయారైనాయి. విప్లవాలకు ఎంత పరిపక్వమైన పరిస్థితులున్నా ప్రస్తుత దశలో సోషలిస్టు విప్లవ శక్తుల బలం తగినంతగా లేని మాట కూడా వాస్తవం. అయితే శక్తివంతమైన కార్మికవర్గ విప్లవాలు కనిపించనప్పటికీ సామ్రాజ్యవాద మార్కెట్ అత్యాశకు, విపరీతమైన సంపద కేంద్రీకరణకు, తీవ్రతరమవుతున్న అసమానతలకు వ్యతిరేక ధోరణి బలపడుతున్నది. ఇదంతా ప్రపంచ సోషలిస్టు క్రమంలో భాగంగా చూడవచ్చు.

ఈ నేపథ్యంలో పైన పేర్కొన్న గత శతాబ్దపు విప్లవ వెల్లువలకు సంబంధించిన మహాద్భుత ఘట్టాలను ఈ కాలానికి, ఈ తరానికి పరిచయం చేయడమే కాక వర్తమాన అవసరాలు తీర్చేలా వాటిని విశ్లేషించవలసిన అవసరం ఉంది. సోవియట్ సోషలిస్టు విప్లవానికి కొనసాగింపుగా జరిగిన అనేక విప్లవాలు, సాధించిన విజయాలు, పొందిన వైఫల్యాలు, అవి నేర్పిన గుణపాఠాలు కొనసాగుతున్న విప్లవోద్యమాలకు, సాహిత్యసాంస్కృతికోద్యమాలకు కూడా అధ్యయన పాఠాలే. సామ్రాజ్యవాదం విప్లవోద్యమాలను పూర్తిగా నిర్మూలించాలనే లక్ష్యంలో భాగంగా ఆల్అవుట్ వార్‌తో పాటు మానసిక, భావజాల యుద్ధం తీవ్రతరం చేసింది. మార్క్సిజానికి, వర్గపోరాటానికి, సోషలిజానికి కాలం చెల్లిపోయిందని ఆధునికాంతర అశాస్త్రీయ సిద్ధాంతాలతో పాలకవర్గ అనుకూల భావజాలం ఊదరగొడుతున్నది. 20, 21వ శతాబ్దంలో పుట్టుకొచ్చిన భిన్న ధోరణులన్నీ సారాంశంలో మార్క్సిస్టు వ్యతిరేకత ముఖ్యమైన లక్షణంగా కలిగి ఉంటున్నాయి. కొన్నయితే మార్క్సిజం పేరుతోనే ప్రపంచవ్యాప్తంగా బురదజల్లే చర్చలు (లెనిన్‌కు, స్టాలిన్‌కు పోటీ పెట్టడం, మావోయిస్టు వ్యతిరేకత, ట్రాట్స్కీవాదం వగైరా) ఉంటున్నాయి.

ఈ పరిస్థితుల్లో మార్క్సిజం పక్షాన, వర్గపోరాటం పక్షాన, పీడిత ప్రజల పక్షాన శక్తివంతంగా సైద్ధాంతిక పోరాటం చేయవలసిన అవసరాన్ని విరసం గుర్తిస్తున్నది. పైన చెప్పిన చారిత్రక ఘట్టాలను వర్తమాన సన్నివేశం వద్దకు తీసుకొచ్చి వచ్చే నాలుగేళ్లలో విస్తృతంగా మార్క్సిజంపైన, సోషలిస్టు ప్రత్యామ్నాయంపైన అధ్యయనం, చర్చ, సాహిత్య ప్రచురణ చేపట్టాలని జూన్ 7న జరిగిన విస్తృత స్థాయి కార్యవర్గ సమావేశంలో విప్లవ రచయితల సంఘం తీర్మానించింది. "సోషలిజమే ప్రత్యమ్నాయం, నక్సల్బరీయే భారత విప్లవ పంథా" అనే నినాదంతో సైద్ధాంతిక, భావజాల రంగంలో నిర్దిష్ట కార్యాచరణతో పనిచేయాలని నిర్ణయించింది. సైద్ధాంతిక రంగంలో వర్గపోరట ఆచరణతో "వ్యవస్థను అర్థం చేసుకోవాలన్నా, మార్చాలన్నా మార్క్సిజమే మార్గం" అన్న సత్యాన్ని ఎలుగెత్తి చాటాలని, ఈ పనిలో భావసారూప్యత ఉన్న సంస్థలతో, వ్యక్తులతో కలిసి పనిచేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో మిత్రుల సలహాలు, సూచనలను విరసం ఆహ్వానిస్తున్నది.

ఇటీవలి కాలంలో విప్లవ రచయితల సంఘం విస్తృత స్థాయిలో పలు మార్క్సిస్టు, లెనినిస్టు, మావోయిస్టు సైద్ధాంతిక గ్రంథాలను వెలువరిస్తున్న సంగతి మిత్రులకు తెలిసే ఉంటుంది. అట్లాగే రానున్న నాలుగేళ్లలో సైద్ధాంతిక అవగాహన, చర్చను పెంపొందించే లక్ష్యంతో మరిన్ని పుస్తకాలను పాఠకుల అందుబాటులోకి తీసుకురావాలని విరసం అనుకుంటున్నది. వాటిలో కొన్ని: 1.జర్మన్ ఐడియాలజీ, 2.పారీస్ కమ్యూన్, 3.బోల్షివిక్ విప్లవ చరిత్ర, 4.లెనిన్ జీవితం, పోరాటం, 5.స్పెయిన్ అంతర్యుద్ధం-బుద్ధిజీవులు, 6.ఎర్రమందారాలు (నవల), 7.కొడుకులు, కూతుళ్లు (నవల), 8.ఉదయగీతిక (నవల), 9.కవులకు, కళాకారులకు లెనిన్ ఇచ్చిన పిలుపు, 10.అపరిచిత (నవల), 11.డెవలప్‌మెంట్ ఆఫ్ కాపిటలిజం ఇన్ రష్యా (అనువాదం), 12.మార్క్స్ మెథడ్, 13. మార్క్స్ ఆన్ జెండర్ (అనువాదం), 14.మార్క్స్ ఆన్ ఎకాలజీ (అనువాదం) 15.మార్క్స్ ఆన్ లిటరేచర్ (అనువాదం), 16.సాంస్కృతిక విప్లవం, 17.1857 తిరుగుబాటుపై మార్క్స్, 18.సహచర (నవల), 19.మేడే, 20.నక్సల్బరీ ఉద్యమ చరిత్ర.

ఉద్యమాభివందనాలతో

**- పి.వరలక్ష్మి**, కార్యదర్శి, విరసం 

# -: స్వీకారం :-

వాట్సప్ తరంలో యుద్ధగీతం
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 30/-
పేజీలు : 56

అజ్ఞాత విప్లవ యోధుడు అమరుడు కొండన్న
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 50/-
పేజీలు : 75

ఏది నేరం?!
హజారీబాగ్ జైలు గాథలు
బి. అనూరాధ
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 75/-
పేజీలు : 141

చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949-64
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 20/-
పేజీలు : 48

జనతన సర్కార్ కావాలి మేక్ ఇన్ ఇండియా కాదు
జహాంగీర్
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 15/-
పేజీలు : 40

విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు
ప్రచురణ : దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 30/-
పేజీలు : 88

ఐక్య సంఘటన సిద్ధాంత వ్యాసాలు
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 35/-
పేజీలు : 104

చైనా కమ్యూనిస్టు పార్టీ మౌలిక అవగాహన
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 100/-
పేజీలు : 198

ఒక 'మావోయిస్ట్' ఖైదీ జైలు అనుభవాలు
సంకెళ్ల సవ్వడి
అరుణ్ ఫరేరా
అనువాదం : ఎన్. వేణుగోపాల్
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 150/-
పేజీలు : 172

తత్వశాస్త్రం మాయాజాలం కాదు
అనువాదం : చలసాని ప్రసాద్
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 20/-
పేజీలు : 56

జాతుల సమస్య రిజర్వేషన్లు కార్మిక వర్గ దృక్పథం
ప్రచురణ : దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 25/-
పేజీలు : 64

వైరుధ్యాలు
అనువాదం : మావో
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 20/-
పేజీలు : 48

లంకపల్లి అమరులకు విప్లవ జోహార్లు
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 10/-
పేజీలు : 32

బాలగోపాల్ తాత్విక గందరగోళం
సమీర్
ప్రచురణ : శ్రామిక వర్గ ప్రచురణలు
వెల : రు. 70/-
పేజీలు : 112

చేరా
ప్రధాన సంపాదకులు : చేకూరి సంధ్య
ప్రచురణ : చేరా పబ్లికేషన్స్
వెల : రు. 100/-
పేజీలు : 266

KLVA101M180
52

**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)
● RNI Regn.No.21152/72 ● Published on 06/08/2015 316 - July, 2015

## జూలై 26న విశాఖపట్నంలో
## కామ్రేడ్ చలసాని ప్రసాద్ అంతిమయాత్ర దృశ్యాలు










Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M180 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజ పేజీలు | no |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Apsari |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |